# శ్రీవిద్యారహస్యము



"శ్రీవిద్యారత్నాకర", శ్రీవిద్యావిశారద"

క్రోవి పార్థసారథి

ప్రథమ ముద్రణము : జూన్ 1998

ప్రతులు : 1,000



మూల్యము : రూ. 60/=

D.T.P. - Jaya Graphics, Gandhinagar, Vja- 3. © 574289

Printed at Sai Sruthi Offset Printers, Gandhinagar,
Vja - 3. © 572965

ప్రతులకు:

కె.మంజూష
23–11 /1– 10 / 2, దేవీనిలయం
ఓగిరాలవారివీధి, సత్యనారాయణపురం
విజయవాడ - 520 011.
© 530672



ఓం నమో శ్రీవేంకటేశాయ

THIS BOOK
**"SRIVIDYARAHASYAM"**
IS PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF
TIRUMALA TIRUPATI DEVA STHANAMS UNDER THEIR
SCHEMS AID TO PUBLISH RELIGIOUS BOOKS"



Phone : 2707 (Tenkasi)

HIS HOLINESS JAGADGURU
SRI SIVA CHIDANANDA BHARATHI SWAMI
Sri Siddheswari Peetadhipati
Courtallam - 627 802
(Via) Tenkasi - Tirunelveli Dist. ---- South India
With Narayanasmritis

---

# అభినందన

5-5-1997

దేవీ పూజలో కాల, సమయమతములు, శ్రీ చక్రాంతర్గత రహస్యములు,
భిన్న సంప్రదాయములలో పంచదశీమహామంత్రము, షట్చక్రభేదన-
దేవి సాక్షాత్కారము మొదలైన విషయములు పామరులకు కూడా
అర్థమయ్యేరీతిలో
శ్రీ క్రోవి పార్థ సారధిగారు వ్రాసిన

## "శ్రీ విద్యాదర్శనము"

గ్రంథావిష్కరణ సమయమున వారిని అభినందిస్తూ
కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠ మహా సంస్థానామోదమున గ్రంథకర్తను

## " శ్రీ విద్యారత్నాకర"

అను బిరుదరాజముతో సన్మానించడమయినది.

ఇతి నారాయణస్మృతిః



జ్యోతిష విజ్ఞానపీఠం, విజయవాడ.

'శ్రీవిద్యా రహస్యం' గ్రంథావిష్కరణ

గ్రంధకర్త శ్రీ క్రోవి పార్ధసారధిగారికి సువర్ణ హస్త కంకణము బహూకరిస్తున్న స్వామి 'వాసుదేవానందగిరి'

श्री श्री जगद्गुरु शङ्कराचार्य महासंस्थानम्, दक्षिणाम्नाय श्री शारदापीठम्, श्रृंगेरी

PRIVATE SECRETARY



Ref. No.: D7/499
Camp:
Date:

శృంగేరి,
౧౮/౪/౯౮.

శ్రీ క్రోవి పార్థసారథి గారికి నమస్కారములు.

మీరు ౯/౪/౯౮ న వ్రాసిన పత్రము, దానితో పంపిన శ్రీవిద్యా రహస్యము అను పుస్తకము అందినది. శ్రీచరణుల సన్నిధిన సమర్పించితిని. ఆపుస్తకము చూసి శ్రీచరణులు చాలా సంతసించినారు.

శ్రీశారదా చంద్రమౌళీశ్వరుల అనుగ్రహము వలన ఈపుస్తకము శ్రీవిద్యా ఉపాసకులకు ఉపయోగమగుగాకయని శ్రీచరణులు ఆశీర్వదిం అనుగ్రహించిన ఆశీర్మంత్రాక్షతలు, శ్రీశారదా చంద్రమౌళీశ్వరుల ప్రసాదము, మరియు మీపుస్తకమును దీనిజతలో పంపుచున్నాను.

ఇంతే నమస్కారములు,

To:

Krovi Partha Sarathi,
23-11/1-10/2,
'Devinilayam',
Ogiralavari Street,
Sathyanarayanapuram,
Vijayavada-11.(A.P.)



1-8-98 న స్వామీ వాసుదేవానందగిరి వారిచే "శ్రీవిద్యా రహస్యము" గ్రంథావిష్కరణ. గ్రంధకర్త శ్రీ క్రోవి పార్థసారధి

శ్రీ యంత్రము సాధకునికి శరీరము వలె ప్రధానము. శరీరమునకు శక్తి మూలమై నడచుటకు సప్తధాతువులు శక్తిమూలములై యుండుట కారణము; ఇంతవరకు వైద్యశాస్త్రము తెల్పుచున్నది. ఈ సప్తధాతువులను నక్షత్రములను వివిధ దేవతా శక్తుల అధిష్ఠించి యుండుట, యాదృశ శక్తిస్వరూపా విధానము శ్రీవిద్య యుపపాదించుచున్నది. ఈ విషయమును, లలితా రహస్యనామావళి, సౌందర్యలహరి, శుభగోదయము, మన్త్ర నిరూపణము మొదలైన ప్రామాణిక గ్రంథముల నుండి సేకరించి ఈ గ్రంథమున ప్రతిపాదించుటకు ప్రయత్నించినందులకు సంతోషము.

"చిచ్ఛక్తి శ్చేతనా రూపా, జడశక్తి ర్జడాత్మికా" చేతనా శక్తిచే నధిష్ఠితమైన యప్పుడే జడశక్తి కార్యనిర్వాహణ సమర్థమగును. ఈ చేతనా చేతన తత్త్వము అతీంద్రియము. అతీంద్రియమగు తత్త్వ విషయమున హేతువాదములు పనికిరాదు. ఇచట శాస్త్రమే ప్రమాణము. తేట తెనుగు భాషలో సులభశైలిలో మీరు శ్రీవిద్యా సంప్రదాయములను సాధకలోకమున కందించుటకు మీరు చేసిన కృషి శ్రీ శారదా చంద్రమౌళీశ్వరుని అనుగ్రహముతో సఫలము గాత యని, ఆశించుచు ఆశీర్వదించుచున్నాము.

శుభం.

ఇతి.

ఇతి నారాయణ స్మృతిః.

[illegible signature]



'శ్రీ విద్యాదర్పణము' గ్రంథావిష్కరణ చేస్తున్న దత్త పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామి



Phone : 2707 (Tenkasi)

HIS HOLINESS JAGADGURU
SRI SIVA CHIDANANDA BHARATHI SWAMI
Sri Siddheswari Peetadhipati
Courtallam - 627 802
(Via) Tenkasi - Tirunelveli Dist. ---- South India
With Narayanasmritis

Date : 10-5-1998

# శ్రీముఖము

ఏమాత్రం ఆధ్యాత్మిక వాసన వున్నా నిత్యానిత్యవస్తు వివేకాది సాధనచతుష్టయ సంపద అంటే యేమిటో తెలిసి వుంటుంది. సాధకులకిది అతి ముఖ్యమని కూడా తెలుసు.

కర్మభక్త్యుపాసనాది మార్గాలన్నీ ఆధ్యాత్మిక జ్ఞాన పర్యవసితాలేకాని తద్భిన్నాలు కావు. ఏ మార్గంలో పయనించదలచు కొన్నా సాధనచతుష్టయం చాలా ముఖ్యమనిపిస్తుంది. ఈ మార్గాలన్నీ గమ్యప్రాప్తిలో ఒక కూడలిలో కలిసిపోయేవే అని గుర్తించాలి. గమ్యం, అపరమార్గం, జ్ఞానం, ఇది సిద్ధించి నప్పుడు అంతట అణువణువునా వ్యాప్తమైన ఆత్మ స్వరూపం తానే అనే భావం నిలకడగా వుండి పోతుంది.

ద్వైతభావంలో పూజలు, ప్రార్థనలు, వ్రతాలు, యజ్ఞ యాగాదులు వివిధ దేవతోపాసనలు, పారాయణాదు లెన్ని చేసినా అందుకు భక్తి శ్రద్ధల అవసరం బాగా వుందనేది అంగీకరించాల్సిందే.

అయితే యీ భక్తి శ్రద్ధలతో సాధించేదేమిటి? తానుపాసించేదేవతయొక్క అనుగ్రహమేగా! ఆ అనుగ్రహం వల్ల వచ్చేలాభమేమిటి? ఇహ పరలోక సుఖాలేకదా! ఈ సుఖాలు పుణ్యకర్మఫలాలని అర్థమవుతూనేవుంది. పుణ్యకర్మఫలాలయిన సుఖభోగాల అనుభవంకాగానే తిరిగి జన్మించి కర్మచేయటమేగా! ఈ విధానానికి అంతంటూవుండదని తెల్ల మౌతూవుంది.

అయితే దీనికంతులేకపోలేదు. ఆ అంతు చూడాలంటే యీ విధానానికి అవలవున్న జ్ఞానజలధిని మధించాలి. అప్పుడమృతముద్భవిస్తుంది. ఈ అమృతాస్వాదనతో సుఖదుఃఖ జననమరణాదులేవీ వుండవు. అదొక నిర్వి కారదశ. రెండవ దంటూ గోచరించని కేవలత్వస్థితి.

ఈ నిత్యసత్యమైన విషయాన్ని వివరించి సూక్ష్మదృష్టితో సూటిగా వర్ణించి చెప్పిన ఉత్తమగ్రంథం ఈ "శ్రీవిద్యారహస్యం"

# శ్రీవిద్యారహస్యము

శ్రీ విద్య అంటే మామూలు విద్యయేదీకాదు. సాక్షాత్తు బ్రహ్మవిద్యయే. ఇది ఆ బ్రహ్మ విద్యారహస్యమేమిటో ఒకప్రత్యేక పద్ధతిలో చెప్పింది. అది రహస్యం కనుక కాస్త సూక్ష్మ దృష్టి అంటే జ్ఞానదృష్టి అత్యవసరం.

శ్రీ విద్య అంటే శక్త్యుపాసనమనీ, ఉపనిషత్తులు భోధించే జ్ఞానానికిది భిన్నమనీ సామాన్యులనుకొనేమాట. ఈ మాటలో నిజంలేదు. ఉపనిషత్ర్శుతిపాద్యమైన బ్రహ్మజ్ఞానాన్నే శ్రీ విద్యప్రబోధిస్తుందని వాళ్ళకు తెలియదు.

సంప్రదాయ బద్ధంగా సద్గురువునాశ్రయించి తదుపదేశానుసారం శ్రీ విద్యనుపాసించే వాళ్ళకు ఈ రహస్యం చక్కగా తెలుస్తుంది. సాధన తిన్నగా చేయలేనప్పుడు భిన్నంగా తోచవచ్చు.

శ్రీ విద్యోపాసన వల్ల త్రిపుటి బాగా అర్థమౌతుంది. అవగాహనలోనే ఆగిపోతే గమ్యం దొరకదు. త్రిపుటీరాహిత్య స్థితి నందుకొన్నప్పుడే లక్ష్యానికి చేరువవుతాడు సాధకుడు. దీనికి సాధనలో గురూపదేశం సాంప్రదాయకసూచన లందిస్తుంది. నిస్త్రైగుణ్యస్థితి శ్రీవిద్యాపరమార్థం.ఇదే వేదాంతం. కనుకనే "త్రైగుణ్య విషయావేదాః నిస్త్రైగుణ్యోభవార్జున' ' అనిగీతలో పరమాత్మ ప్రభోధించాడు.

శ్రీవిద్య యోగమార్గంలో వుపాసించుటం ఒక సాంప్రదాయకమైన మర్యాద. జీవుడు మాయా వరణం తొలిగించుకొంటే తానే పరమాత్మస్వరూపమని తెలుసుకొంటాడు. జీవాత్మ పరమాత్మల ఐక్యమే యోగం చేసేపని. ఇది శ్రీ విద్యలో ప్రధాన పాత్ర వహిస్తుంది.

ఈ సాధనలో సృష్టి స్థితి లయాలకు కారణమైన మూలశక్తి, దానికి కారణమైన మూల తత్త్వం అర్థమౌతుంది. ఇచ్ఛాజ్ఞాన క్రియారూప మైన శక్తి నిర్వికార నిరంజన నిత్య సత్యమైన పరతత్త్వం నుండి బహిర్గతమై దానిలో భాగమై అందులోనే చివరికిలయిస్తుంది. శుద్ధ సత్వమైన పరతత్త్వస్థితి తాననితెలియబడే దశకు చేరుకొనే నరికి శక్తి, శక్యము, శక్తుడు అనే త్రిపుటి అంతరించిపోతుంది. అదే ఆత్మజ్ఞానం. దీనికోసమే శ్రీవిద్యారహస్య సాధనం.

శ్రీవిద్యాపరులకు పారమార్థిక దృష్టి యేర్పడుతుంది క్రమంగా జ్ఞానవైరాగ్యాలు సిద్ధిస్తాయి. తత్ఫలితంగా జన్మరాహిత్యం సిద్ధిస్తుంది. ఇదే శ్రీవిద్యాసాధకుల పరమ లక్ష్యం.

ఈ సుదీర్ఘ సాధన ప్రయాణంలో అనేకమజిలీలు, అక్కడక్కడ సేద తీర్చు కొంటూ గతాన్ని గమనిస్తూ ముందుచూపుతో పట్టువీడకుండా పయనించాలి. ఈ దశలో శ్రీచక్రమంటే "శ్రీ చక్రం శివయోర్వపుః" శివశక్తుల శరీరమే అనే భావన బలపడుతుంది. ఇక్కడ శివ శబ్దం పరతత్త్వ బోధ కమే కాని త్రిమూర్తుల్లోని శివుడు కాదు. శక్తి అంటే పార్వతి కాదు అపరాత్పరి కుండలినియే జీవునిశక్తి. ఈ శివశక్తుల ఐక్యభావనయే శ్రీవిద్యాపరమార్థం. దీనికి ప్రాణాయామప్రధానమైన యోగం ముఖ్యంగా కావాలి.

ఇలాంటి అత్యుత్తమ భావనకు తీరైన బాట ఈ "శ్రీవిద్యారహస్య" గ్రంథంలో దొరుకుతుంది. మానవుని శరీరంలోని షట్చక్రాలు, పద్మాకారంలోని ఒక్కొక్క చక్రానికెన్ని దళాలు, ఏ దళంలో యేయే శక్తులుంటాయో తెలియ జేయటమే కాక, ఆయా చక్రాని కధిష్ఠాన దేవత, బీజం, న్యాసం, మంత్రం, మొదలయినవి యే అక్షర సంకేతంలో వుంటాయో మిక్కిలి జాగ్రత్తగా నిరూపించారు రచయిత. అంతేకాదు యోగి నీ న్యాసంలో ధ్యానమెలావుంటుందో సోదాహరణంగా నిరూపితమయింది. ప్రతి చక్రాన్ని సౌందర్యలహరిలో ఆ చార్యస్వామి యెలా వర్ణించారో "షట్చక్రనిరూపణంలో ఏమి చెప్పబడిందో ఆయా శ్లోకాలనుదహరిస్తూ లలితా సహస్రనామాలతో సమన్వయించటం చూస్తే రచయిత అంతర్దృష్టి తెలుస్తుంది. పరిశోధనాపాటవం అర్థమవుతుంది.

తంత్రాలన్నీ సామాన్యంగా గుణత్రయప్రధానాలై సగుణబ్రహ్మనుగురించి ముచ్చటించాయి. ఇవన్నీ ఇటు వింధ్యనుంచి శ్రీలంక, అటు చైనా, చిట్గాంగ్ వరకు చతుష్షష్టి తంత్రాలుగా ప్రసిద్ధంగా వున్నాయి. ఇవి మాత్రం మనమనుకొన్న బ్రహ్మజ్ఞానం సంపన్నమయిన వేదాంతాన్ని చెప్పేవి కావు. వీటి గమ్యం మోక్షంకాదు. ఇవి కౌళమార్గప్రవర్తకులకు ఆరాధ్యాలు. బహిర్యాగ ప్రచోదకాలు. దీనివల్ల లౌకికశక్తులనవేకం సాధిస్తాడు సాధకుడు.

ఈ కారణం చేతనే మోక్షైక లక్ష్యమైన శ్రీవిద్యకు విశిష్ట ప్రాధాన్యం వచ్చింది. ఈ మహా విద్య మహావాక్యార్థ బోధకమై ఒక నిబద్ధ సత్సంప్రదాయంలో జీవనదిలాగా అనూచానంగా ప్రసరిస్తూ వచ్చింది. ఇది అంతర్యాగ ప్రవర్తకమై ఒప్పారుతున్నది. సామయికులు మాత్రమే ఆచరించే పరమోత్కృష్ట విద్య. దీనికి వేదమే ప్రమాణం. ఫలం అలౌకికం.

శ్రీవిద్యను ప్రమాణంగా లోకంలో ప్రవర్తింపజేసిన మహాపురుషులు నారాయణభట్టు, ఆచార్యశంకరులు, భాస్కరరాయల వారున్నూ, సంప్రదాయ ప్రవర్తకులుగా వీరికి ప్రత్యేక గురుస్థానం తదనుయాయులిచ్చారు. ఆ గౌరవం ఇప్పటికీ అవిచ్ఛిన్నంగా సాగుతూనే వుంది.

ఈ విద్య అలౌకికం కావటం చేత అపౌరుషేయ మని చెప్పనక్కరలేదు. సాక్షాత్తు కామేశ్వరీదేవి ఉమామహేశ్వరుల కుపదేశించగా అది క్రమంగా లక్ష్మీనారాయణులకు తర్వాతవాణీ హిరణ్యగర్భులకు సంక్రమించింది.

ఈ విధంగా శ్రీవిద్యావిర్భవాన్ని సలక్షణంగా వర్ణిస్తూ "శ్రీవిద్యారహస్య" గ్రంథ రచనారంభం చేసి అనేక సూక్ష్మ విషయాలను ప్రవచించిన చిరంజీవి శ్రీక్రోవి పార్థసారథిగారి ధీ శక్తి కొనియాడ దగింది.

ఈ గ్రంథంలో గణేశాది వివిధరూపాలలో పరదేవతారూపం ఎలావున్న దో వివరంగా వర్ణితమైనది. అకారాది క్షకారాంతం ఏబది ఒక్క వర్ణాలు అమ్మవారి పీఠాలనీ, మాతృకారూపిణి అయిన ఆయమ్మనుండి సకలమంత్రశాస్త్రం పుట్టిందనీ, ఆ తల్లికి వర్ణస్థానాలయిన ఏబది ఒక్క

పీఠాలు భారతదేశంలో ఏయే ప్రాంతాలలో వున్నాయోకూడా తెలియజేయటం విశేషం. అంతేకాక యీ ఏబది ఒక్క పీఠాలకు సమానమైన స్థానాలు శ్రీచక్రంలోను మనుష్యదేహంలోను కూడా వున్నట్లు నిరూపించబడింది. కనుకనే యోగులయినవారు ఆ పరదేవతను తమ శరీరం లోనే దర్శించగలుగుతున్నారు.

ఐహిక వాంఛాపరిపూర్తి కోసం చేసే బాహ్య పూజకంటె " అంతరారాధనపరా వైదికా బ్రహ్మవాదినః" అని బ్రహ్మజ్ఞానపరులు అంతఃపూజకే ప్రాధాన్యమిస్తారని అనుకున్నాం కదా ! అలాంటి అంతర్యాగ విచారణ చేస్తూ షట్చక్రభేదనం గురించి వివరించటమే కాక మానవ శరీరనిర్మాణంలో ఎముకలు, నాడులు, రక్తము మొదలయినవి యేయే పాళ్ళలో వుంటాయో బాగా విశ్లేషించి చెప్పటం జరిగింది. ఇక నాడీమండలాన్ని గురించి పరిపూర్ణంగా చర్చించిన పార్థసారథి గారి వివేచనాశక్తి అద్భుతంగా గోచరించింది. ఈ సందర్భంలో మానవ దేహశాస్త్రం మథనం చేసిన శస్త్రవైద్యుడని పించారు. ఇది చదువు తూంటే మన శరీరంలో నాడులెన్ని వున్నాయో, ఏనాడి యెలాపని చేస్తుందో, అలాగే యెన్ని వాయువులున్నాయో, అయావాయువులపని తీరు ఎలాంటిదో ఇక ఉపవాయువులు చేసే పని యేమిటో బాగా అర్థమవుతుంది. ఆశ్చర్యంతో కూడిన జిజ్ఞాస పెరుగుతుంది.

సామాన్యంగా షట్చక్రాల పరిచయం ఈ విద్యాసక్తి వున్నవారికి వుంటుంది. కాని ఆజ్ఞాచక్రంపైనుంచి ప్రారంభమయ్యే సూక్ష్మ చక్రాల పరిచయం అందరికీవుండదు. ఈ ప్రకరణంలో చంద్రమండలాది సూక్ష్మచక్రాలు తొమ్మిదింటి పరిచయం చేయబడింది. తీవ్రంగా సాధన చేస్తూ సాధకుడు క్రమంగా ఒక్కొక్క చక్రం అధిగమిస్తూ ఒక్కొక్క తత్వాన్ని వదిలేసుకొంటూ పోతాడు. చివరికి అన్ని తత్వాలను పూర్తిగా వదిలి పెట్టి ఉన్మనీ చక్రంచేరుకొని కేవలం ఆత్మరూపంగా నేమిగిలిపోతాడు. ఇది బ్రహ్మాత్మనా సంస్థితివంటిది. ఈ దశలో సర్వేంద్రియాలు ఉపసంహరింపబడతాయి. మనస్సునయితం మాయమై పోతుంది. కనుకనే ఈ దశను అమనస్కయోగం అంటారు. ఇదే రాజయోగం అని పార్థసారథిగారు సంక్షిప్త మైన వివరణ మీయటం బాగున్నది.

నిష్కామకర్మలు చేసిన వారు ఉత్తరాయణ మార్గంలో పయనించి పరబ్రహ్మను సంధానం పొందుతారు. సకామకర్మలొనర్చినవారు దక్షిణాయన మార్గంలో ప్రయాణించి పితృలోకాలకు వెళ్ళి పరలోకంలో కర్మఫలాన్ని అనుభవించి తిరిగి భూమిపైన జన్మిస్తారు.

ఈరెండు మార్గాలకు చెందని వారు మాత్రం క్రిమికీటకాలుగాను పశుపక్ష్యాదులుగాను పుడతారని "అర్చిరాదిమార్గ" శీర్షికలో ప్రస్తావన జరిగింది.

"అథమ ఏతౌ పంథావౌ నవిదు స్తే కీటాః పతంగా యదిదం దంద శూకం"

అని బృహదారణ్యక ప్రమాణంతో ఈ విషయం బలపడింది. ఈ వివరణ చాలా ఆసక్తి దాయకంగా వుంటుంది.

కుండలినీ స్వరూప స్వభావాలు, దాన్ని ఉద్బుద్ధం చేసే విధానం, అందుకు సాధకుడు కూర్చుండ వలసనిన ఆసనం, మూలాధారంలో వున్న కామవాయువును ఎలా త్రిప్పితే కామాగ్ని ప్రజ్వరిల్లి కుండలిని మేల్కొంటుందో, అందుకోసం చేయవలసిన ప్రాణాయామాది ప్రక్రియలెలాంటివో అనుపూర్విగా "కుండలినీ శక్తి" ప్రస్తావనలో వివృతమయింది.

ఈ గ్రంథం చివరలో భావనోపనిషత్తును, సాదాఖ్యకళను గురించి వివరించటం సాభిప్రాయంగాను సముచితం గాను వుంది. ఎందుకంటే, వేదాల సారమే ఉపనిషత్తులు అవే వేదాంతాలు. అలాగే ఈ గ్రంథానికి సారభూతమైంది. భావనోపనిషత్తు, ఉపనిషత్ప్రతిపాదితమైన బ్రహ్మజ్ఞానమే శ్రీవిద్యా ఫలం కూడాను అనేది , సూచితమైనట్లయింది. గ్రంథం తాలూకు సారభూతమైన రహస్యం భావనోపనిషత్తు లో వుందన్నమాట. రహస్యవివరణమే సాదాఖ్య కళ అని అర్థంచేసుకోవాలి. ఈ రెంటిని మినహాయిస్తే యీ గ్రంథానికి నిండుదనం, సాఫల్యం చేకూరేదికాదు. ఇది రచయిత విజ్ఞానఫలంగా భావిస్తాము.

"ఆకాశాత్పతితం తోయం యథాగచ్ఛతి సాగరం
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి"

అనే శ్లోకభావాన్ని ఈ గ్రంథం సూచిస్తూ ప్రబోధిస్తున్నది. ప్రాజ్ఞులయిన శ్రీ వి పార్థసారథిగారు మంచి బోధకతాశక్తిగల కళాశాలా ధ్యాపకులు. కనుక యే విషయాన్ని ఎంతవరకు వివరించాలో బాగా తెలిసిన వారు. షడ్విధలింగములు తెలిసినవారు కనుకనే గ్రంథానికి కావలసిన ప్రారంభోపసంహరాలను చాలా నేర్పుతో చేశారు. శాస్త్ర విషయాన్ని ప్రతిపాదించటంలో ఉపక్రమోపసంహారాది షడ్విధలింగాల ను పాటించినట్లు వీరు శ్రీవిద్యా విషయప్రతిపాదనలో కూడా పాటించి సప్రమాణంగా నిరూపించి కృత కృత్యులయ్యారు.

అనేక విషయాలనొకచోట జేర్చటం ప్రతిభ కావచ్చు. పరిశోధకుని లక్షణంకావచ్చు. కాని హృదయదఘ్నంగా అనుభవించి వ్రాయటం మాత్రం పరాశక్తికృప అనే చెప్పాలి. ఆ తల్లి నిండుదయ పార్థసారథిగారికున్నది.

పార్థసారథిగారు గ్రంథ విషయంలో జొరబడిన మనసుతో పలికిన పలుకు ఈ గ్రంథమని పిస్తుంది. భగవత్తత్వాన్ని వర్ణించటం సాధ్యమే కాని , దర్శించం అనుభవిస్తేనే సాధ్యం. దైవం అనుభూతి తప్పమరొకటికాదు.

భావనోపనిషత్తు బాగా అర్థం చేసుకుంటే బ్రహ్మాను భూతి కలుగుతుంది. ముందు చెప్పిన గ్రంథ విషయాన్ని ఉపనిషత్తుతో సమన్వయించుకొంటే పరమార్థమేమిటో తెల్లమౌతుంది.

నా రుద్రోరుద్ర మర్చయేత్" అన్నట్లు పార్థసాదరథిగారు ఏ కొంతైన సాధకులయితేతప్ప యింత హృదయానికి హత్తుకొనే లాగా మధుర సుందరంగా శ్రీవిద్యారహస్యాన్ని వివరించలేరనిపిస్తుంది.

గ్రథంఆసాంతం చదివిన తర్వాత శ్రీవిద్య అంటే బ్రహ్మవిద్య అనీ, తద్రహస్యమంటే సాదాఖ్యకళ అనీ సూచితమౌతుంది. అదే దేవీ సాక్షాత్కారం. లోగడ వీరు వ్రాసిన గ్రంథాలు కూడా చూడటం తటస్థించింది. ఇప్పుడీ గ్రంథావలోకనంతో వీరెంత ఎదిగారో అర్థమయింది.

ఈ సాధకరచయిత శ్రీవి పార్థసారథిగారు ఇతోధికంగా ప్రజ్ఞాఘనులై నిరహంకారులయి యిలాంటి ఉత్తమోత్తమగ్రంథాలను లోకానికందిస్తూ అమ్మకృపాజలధిలో నోలలాడుతూ సకుటుంబంగా సుఖశాంతులను పొంచి చిరాయు రారోగ్య ఐశ్వర్య సమృద్ధు లు కావలయునని శ్రీ రాజరాజేశ్వరిని ప్రార్థిస్తూ నారాయణ స్మృతులతో ఆశీర్వదిస్తున్నాము.

| | |
|---|---|
| మకాం | ఇట్లు |
| విజయవాడ - దత్తాత్రేయాశ్రమం | నారాయణస్మృతులతో |
| 10-5-98 | శ్రీ శివచిదానంద భారతి స్వామి |





సిద్దేశ్వరీదేవి



గ్రంథకర్త పార్థసారథిని సన్మానిస్తున్న గన్నవరం భువనేశ్వరీ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ చిదానంద భారతీస్వామి,
శ్రీ విద్యాదర్శనము గ్రంథావిష్కరణ చేస్తున్న కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠాధిపతి శ్రీశ్రీశ్రీ శివచిదానంద భారతీస్వామి

# ప్రణతులు

శ్రీ అంటే మహాకాళి,మహాలక్ష్మి, మహాసరస్వతుల స్వరూపమైన పరాత్పరి. స్త్రీదేవతనుపూజించే మంత్రాన్ని 'విద్య' అంటారు. కాబట్టి శ్రీవిద్య అంటే ఆ జగన్మాతయొక్క ఉపాసననుగురించి వివరించేది. అందులోని రహస్యాలను వెల్లడించేది కాబట్టి ఈగ్రంథానికి శ్రీవిద్యారహస్యము అని పేరుపెట్టటం జరిగింది. గతంలో శ్రీవిద్యాదర్శనము అనే పేరుతో శ్రీవిద్యను కొంతవరకు వివరించటం జరిగింది. అయితే దానిలోని కొన్నిరహస్యాలకు వివరణకావాలని కొంతమంది అడగటంచేత శ్రీవిద్యారహస్యము వ్రాయటం జరిగింది.

గ్రంథము యొక్క ప్రతిని పంపగానే నామీద అపారమైనదయతో శ్రీముఖాన్ని పంపిన శృంగేరీ దక్షిణామ్నాయ పీఠాధిపతులు జగద్గురు భారతీ తీర్థస్వామి-వారికి నాకృతజ్ఞతా పూర్వక ప్రణామములు. అలాగే ఈ గ్రంథానికి శ్రీ ముఖములు పంపి నన్ను ఆశీర్వదించిన కుర్తాళంసిద్ధేశ్వరీ పీఠాధి పతులు శ్రీశ్రీశ్రీ శివచిదానంద భారతీస్వామి వారికి, పుష్పగిరి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీవిద్యా నృసింహభారతీస్వామి వారికి, గన్నవరం భువనేశ్వరీ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ చిదానందభారతీస్వామి వారికి నా కృతజ్ఞతాభివందనములు.

గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయం చేసిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈగ్రంథ రచనలో నన్ను అన్ని విధాల ప్రోత్సహించి, నాకు అన్ని విధాల సహకరించిన నా శ్రీమతి రమాదేవికి నా అభినందనలు.

గ్రంథముద్రణలో నాకు సహకరించిన శాతవాహన కళాశాల లెక్చరర్ పింగళి వెంకట కృష్ణారావు గారికి, పూజ్యులు మల్లాది సుబ్రహ్మణ్యశర్మగారికి, గ్రంథముద్రణకు ఇతోధికంగా ద్రవ్య సహాయం చేసిన మిత్రులందరికీ నా మనఃపూర్వక కృతజ్ఞతలు అందచేస్తున్నాను.

గతంలో నేను వ్రాసిన శ్రీవిద్యాదర్శనము, శ్రీవిద్యాదర్పణముల మాదిరిగానే శ్రీవిద్యారహస్యమును కూడా సామాన్యులకు అర్థంకావాలనే దృష్టితో సులభశైలిలో వ్రాయటం జరిగింది.శ్రీవిద్యోపాసకులు ఈగ్రంథాన్ని ఆదరిస్తారని, పండితులు నా ఈసాహసాన్ని మన్నిస్తారని ఆశిస్తాను.

ఇట్లు

విజయవాడ
11-6-98

క్రోవి పార్థసారథి

# గ్రంథముద్రణకు విరాళమిచ్చిన దాతలు

| | | |
|---|---|---|
| 1. శ్రీ మాగంటి సుబ్రహ్మణ్యం గారు. | - | ప్రొప్రైటర్,మిత్రాఏజన్సీస్, విజయవాడ |
| 2. శ్రీ కాండూరి ఉమామహేశ్వరుడు గారు | - | ఉమాచిట్ ఫండ్స్ , విజయవాడ. |
| 3. శ్రీమతి వారణాసి అన్నపూర్ణమ్మగారు. | - | సత్యన్నారాయణపురం, విజయవాడ. |
| 4. శ్రీముత్తిరెడ్డి కోటేశ్వరరావుగారు. | - | లెక్చరర్,శాతవాహన కళాశాల, విజయవాడ |
| 5. శ్రీ వి.శ్రీనివాస్ గారు | - | లెక్చరర్,శాతవాహన కళాశాల, విజయవాడ |
| 6. శ్రీ వి.వి. రమణ గారు. | - | లెక్చరర్,శాతవాహన కళాశాల, విజయవాడ |
| 7. శ్రీ జి. సాంబశివరావుగారు. | - | లెక్చరర్,శాతవాహన కళాశాల, విజయవాడ |
| 8. శ్రీ ఎ. రాజేశ్వరరావు గారు. | - | లెక్చరర్.శాతవాహన కళాశాల, విజయవాడ |
| 9. శ్రీ ఎమ్. శ్రీనివాస్ గారు. | - | లెక్చరర్,శాతవాహన కళాశాల, విజయవాడ |
| 10. శ్రీ ఎన్.పి.యస్. బాబు గారు | - | లెక్చరర్,శాతవాహన కళాశాల, విజయవాడ |
| 11. కుమారి వి. రాజేశ్వరి గారు | - | లెక్చరర్,శాతవాహన కళాశాల, విజయవాడ |
| 12. కుమారి జి. శ్రీదేవి గారు | - | లెక్చరర్,సి.డి.యు, ఉస్మానియా యూనివర్శిటి, |



గ్రంథకర్త పార్థసారథి, వారి ధర్మపత్ని రమాదేవి

# విషయసూచిక

# శ్రీచక్రనగరసామ్రాజ్ఞి



# 1.గురుమండలము

గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః

అజ్ఞానమనే అంధకారాన్ని పారద్రోలి, జ్ఞానజ్యోతిని వెలిగించేవాడు గురువు. సాధకునకు మంత్రోపదేశంచేసి, దీక్షఇచ్చి, సాధనావిధానముచెప్పి, ముక్తి మార్గం చూపే వాడు గురువు.

ఏ మహాత్ముడు నీకు బాగా గుర్తు ఉంటాడో, ఏ మహానుభావుని రూపం నీ మనస్సులో సదానిలిచి పోతుందో, ఏ సన్యాసి నీకు స్వప్నంలో కూడా కనుపించి సన్మార్గాన్ని బోధిస్తుంటాడో, ఏ సాధువు చెప్పిన ధర్మసూత్రాలు నీ మదిలో నిలిచిపోతాయో, ఏ మహనీయుని దగ్గరకు వెళ్ళగానే నీకు అనుమానాలు తీరిపోతాయో, ఏ వ్యక్తి దగ్గర నీకు ప్రశాంతత ఆనందము కలుగుతాయో, ఏ వ్యక్తి మీదనీకు నమ్మకము, గురి కలుగుతాయో ఆమహనీయుడే నీకు గురువు. అలాగే గురువుచెప్పిన భక్తి, జ్ఞాన వైరాగ్యాలు, ధర్మసూత్రాలు గుర్తుంచుకుని మరచిపోకుండా ఉండేవాడే శిష్యుడు. స్థూలంగా చెప్పాలంటే తన శిష్యునకు సన్మార్గాన్ని బోధించి, తరుణోపాయం చూపే వాడు గురువు.

మనకు మొత్తం ఏడు రకాల గురువులున్నారని చెప్పబడింది. వారు :-

1. సూచకగురువు :- చదువు చెప్పే వాడు
2. వాచకగురువు :- కులధర్మాలు, ఆశ్రమధర్మాలు బోధించేవాడు.
3. బోధకగురువు :- మహామంత్రాలనుపదేశం చేసేవాడు
4. నిషిద్ధగురువు :- వశీకరణ, మారణ, ప్రయోగాలు నేర్పేవాడు.
5. విహితగురువు :- విషయభోగముల మీద విరక్తి కలిగించేవాడు.
6. కారణగురువు :- జీవబ్రహ్మైక్యాన్ని బోధించేవాడు.
7. పరమగురువు :- జీవాత్మ పరమాత్మ ఒకటే అని ప్రత్యక్షానుభవాన్ని కలిగించేవాడు.

గురువు శిష్యునకుఉపదేశం చేసి దీక్ష ఇస్తాడు. ఈ దీక్ష నాలుగు రకాలు.

1. స్పర్శదీక్ష :- గురువు శిష్యుని తాకినంత మాత్రం చేతనే శిష్యునకు శక్తివస్తుంది.
2. ధ్యానదీక్ష :- గురువు దూరంగా ఉన్నప్పటికీ శిష్యుని ఉద్ధరణ కోసం ధ్యానం చేస్తుంటాడు. దాని వల్లనే శిష్యునకు శక్తి వస్తుంది.
3. దృష్టిదీక్ష :- ఇది కంటిచూపుతోనే ఇచ్చే దీక్ష. దీనిలో శిష్యుడు పవిత్రుడు కావాలనే తలంపుతో గురువు తన దృష్టిసారిస్తాడు.
4. మంత్రదీక్ష :- గురువు శిష్యునకు ధర్మసూత్రాలు చెప్పి, మంత్ర దీక్ష ఇచ్చి అతనికి తరణోపాయం చూపుతాడు.

ఈ రకంగా అనేక రకాలయిన గురువులు, వారిచ్చు దీక్షా పద్ధతులు చెప్పబడినాయి. గురువు ఏ జాతివాడైనా, ఏ మతంవాడైనా, ఏ కులంవాడైనా సరే అతనిని పూజించాలి. గౌరవించాలి. ఆరాధించాలి. లోకంలో అస్థిరమైనవి, ఐహికసుఖాలనిచ్చేవి ఎన్ని సంపాదించినా గురుకటాక్షం పొందలేకపోతే, ఇవన్నీ నిష్ప్రయోజనం. ఈ విషయాన్ని శంకర భగవత్పాదులు తమ 'గుర్వష్టకమ్' లో వివరిస్తూ, గురువు అంటే ఆ భగవంతుడే అని చెప్పారు.

శరీరం సురూపం తథా వా కలత్రం యశశ్చారు చిత్రం ధనం మేరు తుల్యమ్ ।
మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥

కలత్రం ధనం పుత్రపౌత్రాది సర్వం గృహం బాన్ధవాః సర్వమే తద్ధి జాతమ్ ।
మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥

షడఙ్గాది వేదో ముఖే శాస్త్రవిద్యా కవిత్వాది గద్యం సుపద్యం కరోతి ।
మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥

విదేశేషు మాన్యః స్వదే శేషు ధన్యః సదాచార వృత్తేషు మత్తోన చాన్యః ।
మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥

క్షమామణ్డలే భూప భూపాలబృన్దైః సదాసేవితం యస్య పాదార విన్దమ్ ।
మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥

యశో మే గతం దిక్షు దానప్రతాపా జ్జగద్వస్తు సర్వం కరే యత్ప్రసాదాత్
మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥

న భోగే న యోగే న వా వాజిరాజౌ న కాన్తాముఖేనై వ విత్తేషు చిత్తమ్ ।
మనశ్చే న్న లగ్నం' గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥

అరణ్యే నవా స్వస్య గేహేన కార్యే నదేహే మనోవర్తతే మేత్వనర్ఘే
మనశ్చే న్న లగ్నం గురో రంఘ్రిపద్మే తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥

ఈ లోకంలో ధనము, అందమైనభార్య, విద్య, పేరుప్రఖ్యాతులెన్నున్నా, ఇవేవీ గురుకటాక్షం కన్న ఎక్కువకాదు. అని పై శ్లోకాల అర్థం.

న గురోరధికం తత్వం న గురోరధికం తపః ।
తత్త్వ జ్ఞానాత్ పరం నాస్తి తస్మై శ్రీగురవేనమః ॥

గురువు కన్న ఎక్కువైన తత్త్వం లేదు, తపస్సులేదు. జ్ఞానంలేదు.

శ్రీవిద్యారహస్యము

అఖండ మండలాకారం వ్యాప్తంయేన చరాచరం ।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవేనమః ॥

అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా ।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవేనమః ॥

విశాలమైన ఈ విశ్వమంతా వ్యాపించినవాడు, శిష్యుల అజ్ఞానాన్ని పారద్రోలి, జ్ఞాన జ్యోతిని వెలిగించేవాడు, అయిన గురువు పాదాలకు నమస్కరిస్తున్నాను.

సాధకుని కర్మఫలాన్ని బట్టి గురువు లభించటం జరుగుతుంది. కొంతమందికి ఏళ్ళ తరబడి ఎదురు చూచినా సద్గురువు లభ్యంకాడు. ఆ గురు అన్వేషణలో అడవుల వెంబడి తిరుగుతూ, తనువు చాలించినవా రనేక మంది ఉన్నారు. మరికొందరికి చాలా తేలికగా, గురువే శిష్యుణ్ణి వెతుక్కుంటూ వస్తాడు. ఇదంతా సాధకుని పూర్వజన్మ కర్మఫలం మీద ఆధారపడి ఉంటుంది. వివేకానందునకు రామకృష్ణపరమహంసలాగా, మంచి గురువు దొరకటమనేది జన్మ జన్మల ఫలం అని గుర్తించాలి.

అటువంటి గురువు సృష్టి,స్థితి లయకారకులైన ఆ త్రిమూర్తుల్స్వరూపము, అతడే సాక్షాత్తూ పరబ్రహ్మ. గురుకటాక్షం లేనిదే కార్యసాధన జరగదు. గురువు భౌతికంగా లేక పోయినా, అదృశ్యంగా ఉండి తన శిష్యుణ్ణి సదా కాపాడుతూ ఉంటాడు.తప్పుమార్గంలో పోతే హెచ్చరించి, సన్మార్గానికి త్రిప్పుతాడు. కాబట్టి పరబ్రహ్మ స్వరూపుడైన గురువందనం చేసి, హరితస గోత్రీకుడనైన క్రోవి పార్థసారథి అనునేను 'శ్రీవిద్యారహస్యము' అను గ్రంథరచన కుపక్రమిస్తున్నాను.

బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి॥

పరమాత్మ పూర్ణబిందు స్వరూపుడు. ఆయన తనయందు ఇమిడి ఉన్న బిందుత్రయాన్ని 1. ప్రకాశాంశ 2.విమర్శాంశ లుగా అనగా, స్త్రీ, పురుష భేదములతో కామేశ్వరీ, కామేశ్వరులుగా విభజించాడు. ఇందులో ప్రకాశాంశ కామేశ్వరుడు విమర్శాంశ కామేశ్వరీదేవి.

సృష్టి ఆవిర్భావ కాలంలో, కృతయుగము ప్రారంభంలో, సర్వానందమయ ఓఢ్యాణపీఠమనే బిందుపీఠమందు, పరమాత్మస్వరూపుడై పూర్ణకామేశ్వరుడు, 'ఊర్ధ్వానంద నాథ' అనే పేరుతో, అనుత్తరానందము కొరకు మాయాస్వరూపిణి, స్వాత్మరూప అయిన కామేశ్వరీదేవికి శ్రీవిద్యనుపదేశించాడు కామేశ్వరీ కామేశ్వరులిద్దరూ పరబ్రహ్మ స్వరూపులే. వారిద్దరికీ భేదములేదు. అయినప్పటికీ లోకాలను అనుగ్రహించాలనే సత్సంకల్పంతో, పరమాత్మ తానే గురు

శిష్యులుగామారి, సర్వోపనిషత్కారణ భూతమైన శ్రీవిద్యాతంత్రాన్ని ఆమెకు ఉపదేశించాడు.

ఈరకంగా పరమాత్మ శ్రీవిద్యను లోకంలో వ్యాప్తిచెయ్యటంకోసం, తాను 'ఊర్ధ్వదేవనాథ' అనే దీక్షానామం ధరించి, కామేశ్వరీదేవికి శ్రీవిద్యనుపదేశించి, ఆమెకు "మిత్రేశదేవనాథ' అని నామకరణంచేశాడు.

కామేశ్వరీ కామేశ్వరులు ఊర్ధ్వదేవనాథ, మిత్రేశనాథ ( అనేపేర్లతో సర్వానందమయమైన ఓఢ్యాణపీఠములో పురాణదంపతులుగా ఉన్నారుఇది శ్రీవిద్యకు మొదటి స్థానము.

ఆతరువాత, పరమేశ్వరుని ఆజ్ఞమేరకు ఆ పరాభట్టారిక, శ్రీవిద్యారహస్యవ్యాప్తి కోసము తాను 'షష్ఠీశదేవనాథ' అనే పేరు ధరించి, తనయొక్క అంశలు, అవ్యక్త మహత్తత్వాహంకారస్వరూపులు, సత్వరజస్తమోగుణప్రధానులు, సృష్టిస్థితిలయకారకులు, వాగ్భవ కామరాజ, శక్తి బీజాధిపతులయిన త్రిమూర్తి ద్వంద్వానికి ఈ విద్యను ఉపదేశించింది. వారి ద్వారా ఉపదేశపరంపరగా, ఈ విద్య విస్తరించి, దివ్యౌఘ సిద్ధౌఘ, మాన వౌఘ గురుమండలంగా లోకంలో ప్రసిద్ధి చెందింది. దివ్యౌఘులు అంటే ఇంద్రాది దేవతలు, 'సిద్ధౌఘులు' అంటే సనక సనందనాదిదులు, 'మానవౌఘులు' అంటే విద్యారణ్యులు, గౌడపాదులు, శంకరులు మొదలైనమానవులు.

బిందుమండల వర్తిని అయిన ఆ కామేశ్వరి, యోనిచక్రం (త్రికోణం) లోని ఉత్తర కోణము నందు జాలంధరపీఠంలో ఉన్న; శక్తి బీజాధిపతులైన ఉమామహేశ్వరులకు మొదటగా శ్రీవిద్యను ఉపదేశించి, వారికి ఊర్ధ్వదేవనాథ, కామేశ్వర్యంబా అని పేరు పెట్టింది. తరువాత ఊర్ధ్వదేవనాథ ద్వంద్వము, యోనిచక్రంలోని దక్షిణకోణంలో, పూర్ణగిరిపీఠంలో ఉన్న కామరాజబీజాధిపతులైన లక్ష్మీనారాయణులకు ఈ విద్యనుపదేశించి, వారికి 'షష్ఠీశ దేవనాథ, వజ్రేశ్వర్యంబా, అని పేరుపెట్టారు. ఆ తరువాత, షష్ఠీశదేవనాథ ద్వంద్వము, యోని చక్రానికి అగ్రకోణంలో, కామగిరిపీఠంలో ఉన్న వాగ్భవబీజాధిపతులైన వాణీ హిరణ్యగర్భులకు పదేశించి, వారికి మిత్రేశదేవనాథ, భగమాలిన్యంబా అని నామకరణం చేశారు.

శ్రీచక్రంలోని ఎనిమిదవ ఆవరణ అయిన త్రికోణంలో కామేశ్వరి, వజ్రేశ్వరి, భగమాలిని అను పేర్లతో ఉన్న దేవతలు వీరే.

మిత్రేశదేవనాథద్వంద్వము శ్రీవిద్యను దివ్యులైన ఇంద్రాది దేవతలకుపదేశించగా, వారు సనకసనందనాది సిద్ధులకు, వారు మానవులకు ఉపదేశించారు. ఈ రకంగా గురుపరంపరానుగతంగా శ్రీవిద్య భూలోకంలో వ్యాప్తి చెందింది. త్రిమూర్తులు, వారి స్థానములు, దీక్షానామములు, ఈ క్రింద వివరంగా చూపబడ్డాయి.

| దేవతల పేర్లు | యోనిచక్రంలోస్థానము | పీఠము | బీజము | దీక్షానామము |
|---|---|---|---|---|
| 1. ఉమాదేవి మహేశ్వరుడ | ఉత్తరకోణము | జాలంధర | శక్తి | కామేశ్వర్యంబా ఊర్ధ్వదేవనాథ |
| 2. లక్ష్మీదేవి నారాయణుడ | దక్షిణకోణము | పూర్ణగిరి | కామరాజ | వజ్రేశ్వర్యంబా షష్ఠీశదేవనాథ |
| 3. సరస్వతీదేవి బ్రహ్మ | అగ్రకోణము | కామగిరి | వాగ్భవ | భగమాలిన్యంబా మిత్రేశదేవనాథ |

దీక్షాపరులు గురుత్రయం చెప్పేటప్పుడు వారి పూర్వ గురువులకు నమస్కరిస్తూ

1. ఆదినాథ సమారంభాం శంకరాచార్య మధ్యమాం
2. నారాయణ సమారంభాం, వ్యాసశంకరమధ్యమాం
3. సదాశివ సమారంభాం, శంకరాచార్యమధ్యమాం
4. లక్ష్మీనాథ సమారంభాం, నాథయామున మధ్యమాం.

అని రక రకాలుగాచెబుతూ ఆదిగురువునుండి అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరాం॥ అని తమకు మంత్రోపదేశంచేసి దీక్షనిచ్చినగురువు వరకు, అందరికీ నమస్కరించాలి. శిష్యుడు తన గురువు పట్ల ఆచరించవలసిన విధులను ఈ దిగువ వివరించడం జరిగింది.

శ్రీ గురుమూర్తిని చేరినంతనె నమ
స్కారంబు ముందుగా సలుపవలయు
లజ్జాభిమానకుంబు వీడి పాద
చారియై సద్భక్తి జేరవలయు
సుతుడైన హితుడైన సోదరుడైనను
గులహీనుడైనను గొలువవలయు
గురునాజ్ఞ వర్తించి గురుడిచ్చు తృణమైన
మేరువుగా నెంచి మెలగవలయు

గురుని ప్రభువంచు స్వామి దేవర యటంచు
బిలుచుచును లోభగుణముల దొలచవలయు
బరమయోగీంద్ర నిగమార్థశరధిచంద్ర
వరమునీంద్ర బ్రహ్మానందగిరి యతీంద్ర॥

గురుమూర్తి వచ్చుచో గూర్చుండగారాదు
గురుశిష్యులొకశయ్య గూర్కరాదు
ముందుగా దనయంత భుజియింపగారాదు
పొరిదొంగత్రోవల బోవరాదు
గురునింద వినరాదు కూడి సేయగరాదు
గురుని కప్రియమును గూర్పరాదు
సద్గురు విడిన శాసనము మీరగరాదు
హెచ్చి దా గురుని శాసింపరాదు

గురుఁ బోధింప నెంచిన నురుగరాదు
అతడు బోధింపకుండిన నడుగరాదు
వ రమునీంద్ర నిగమార్థశరధిచంద్ర
వరమునీంద్ర బ్రహ్మానందగిరి యతీంద్ర

ఈ రకంగా గురుకటాక్షం పొందితేనే సాధకునకు కార్యసాఫల్యం, మంత్రసిద్ధికలుగుతాయి.



# 2. శ్రీవిద్య

దైవాధీనం జగత్సర్వం, మంత్రాధీనంతుదైవతం
తన్మంత్రం బ్రాహ్మణాధీనం, బ్రాహ్మణోమమదేవతా॥

ఈ చరాచర జగత్తు అంతా కూడా దైవముయొక్క అధీనంలో ఉన్నది. ఆ దైవం మంత్రానికి అధీనం అయిఉన్నది. ఆ మంత్రము బ్రాహ్మణునకు అధీనం అయి ఉన్నది. అందుకనే బ్రాహ్మణుని భూసురుడు అన్నారు. ప్రతిఫలాపేక్ష లేకుండా లోకకల్యాణం కోసం జపం చేసేవాడు బ్రాహ్మణుడు ఒక్కడే. అందుకనే భూలోకంలో బ్రాహ్మణుడు ప్రత్యక్ష దైవంగా చెప్పబడుతున్నాడు. మననాత్త్రాయత ఇతిమంత్రః

దేవతల దయకుపాత్రులుకావాలి అంటే మంత్రజపంచెయ్యాలి, దీనినే ఉపాసన అంటారు. అరణి మథిస్తే అగ్ని ఎలాపుడుతుందో, అలాగే మంత్రజపంచేస్తే శక్తి పుడుతుంది,ఒకేమాటని, లేదా పదాన్ని పదేపదే ఉచ్చరించటంవల్ల శక్తి ఉద్భవిస్తుంది, ఆశక్తి సాధకుని సర్వకార్యాలు నెరవేరుస్తుంది. అయితే బీజాక్షరాలచేతసంపుటంచేయబడిన మంత్రజపంవల్ల దేవతల అనుగ్రహం త్వరగాకలుగుతుంది, సంస్కృతభాషకు ఉన్న యాభై అక్షరాలనూ యాభై బీజాలుగా గుర్తించాలి. ఇవేకాకుండా సంయుక్తాక్షరాలను కూడాబీజాలుగా వ్రాయటంజరుగుతుంది. ఈ రకంగా బీజాక్షరాలు అనేకం ఉన్నాయి. ఈబీజాక్షరాలకు ప్రతిదానికీ విడివిడిగా కొంతశక్తి ఉంటుంది. ఆ విషయం బీజాక్షరనిఘంటువుచూచినట్లైతే తెలుస్తుంది, అటువంటిశక్తికల బీజాక్షరాలు కొన్నింటిని సాధకుడి కోరికను అనుసరించి సంపుటీకరణం చేస్తారు. అరకమైన మంత్రసాధనవల్ల సాధకుడి కోరికలు త్వరగా తీరుతాయి.అయితే దేవతల ఉపాసన చేసేప్పుడు ఆదేవతలతత్వాలకు సాధకుని కోర్కెలకు అనుగుణంగా బీజాక్షరాలు చెప్పబడు కాయిదీన్నే సంపుటీకరణ అంటారు. ఐం వాగ్బీజము, క్లీం మన్మథబీజము. ఈ రకంగా దేవతలకేకాకుండా పంచభూతాలకు కుడాబీజాలున్నాయి, అవి లం పృధివీ బీజము, హం ఆకాశ బీజము, యం వాయుబీజము, రం అగ్ని బీజము, వం అమృత బీజము.

అసలుమంత్రను మూడు రకాలుగావిభజించవచ్చు.

1. వైదికములు. 2 .తాంత్రికములు 3 అపభ్రంశములు

1. వైదిక మంత్రాలు :- ఇవి జ్ఞానప్రదాలు ముక్తి కారకాలు

2. తాంత్రికములు :- కేవలం కామ్యప్రదమైన మంత్రాలను తాంత్రికాలు అంటారు

3. అపభ్రంశములు :- సంస్కృతభాషలో కాకుండా ఇతర భాషలలో ఉన్న మంత్రాలను అపభ్రంశాలు అంటారు. మళయాళమంత్రాలు, హిందీ,తెలుగు, పార్శీమంత్రాలు, పాము, తేలుమంత్రాలు ఇలాటివే.

వైదికాప్రణవైర్యుతాః ప్రణవేనవిహీనాస్తు తాంత్రికాఏవ ప్రకీర్తితాః ।

అంటే ఓంకారసహితమైనవి వైదికమంత్రములు. ఓంకారములేనివి తాంత్రికాలు. మంత్రాలను1స్త్రీ, 2 పురుష,3 నపుంసక మంత్రాలు అని మూడు రకాలుగాచెప్పవచ్చు.

| | |
|---|---|
| స్వాహా అనేపదం చివరకలవి | స్త్రీ మంత్రాలు |
| హుంఫట్ అనే పదం చివరకలవి | పురుష మంత్రాలు |
| నమః అనే పదం చివరకలవి | నపుంసక మంత్రాలు |

స్త్రీ దైవత్యాస్తు విద్యాస్స్యుః మంత్రాః పుందేవతా స్మృతా

పురుషదేవతలనుపాసించేవాటిని మంత్రాలని, స్త్రీదేవతలనుపాసించే మంత్రాలను 'విద్య' అని అంటారు. వీటిలో

మంత్రా ఏకాక్షరాః పిండాః కర్తర్య స్త్ర్యక్షరా మతాః
వర్ణత్రయం సమారభ్య నవార్ణావధిబీజకాః
తతో దశార్ణ మారభ్య యావద్వింశతి మంత్రకాః
అత ఊర్ధ్వం గతా మాలా స్తాసు భేదో న విద్యతే.

| | | |
|---|---|---|
| ఒక అక్షరములు కలమంత్రాలను | - | పిండము |
| మూడు అక్షరములు కలమంత్రాలను | - | కర్తరులు |
| 3 నుంచి9 వరకు అక్షరములు కలమంత్రాలను | - | బీజములు |
| 10-20 వరకు అక్షరము కలవాటిని | - | మంత్రము |
| 20 కన్న ఎక్కువ అక్షరములు కలవాటిని | - | మాలామంత్రము అంటారు |

ఆమ్నాయమంత్రాలన్నీ పరమేశ్వరుని ముఖంనుంచేవచ్చినాయని చెప్పబడుతోంది,పరమేశ్వరుడుఐదురూపాలుగా ఉన్నాడు. ఆరూపాలే పంచబ్రహ్మలు. వారు 1.సద్యోజాత 2.వామదేవ 3.అఘోర 4.తత్పురుష 5.ఈశానులు. ఈరకంగాపంచబ్రహ్మలస్వరూపమే అదేవి.అందుకే ఆమెను పంచబ్రహ్మ స్వరూపిణి అన్నారు. ఆమెపంచప్రేతాసనాసీన అనిచెప్పబడుతోంది ఈ పంచబ్రహ్మల స్వరూపంలోనే పరపశివుడు మంత్రశాస్త్రాన్నిచెప్పాడు. షడామ్నాయాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

పూర్వామ్నాయము

ఋగామ్నాయ మయం తత్ర పూర్వద్వారం ప్రకీర్తితం।
ఊర్మిణీనామ విఖ్యాతా ఋగామ్నాయాధి దేవతా॥

సద్యోజాతునిముఖంనుంచి వేదయుతయైన గాయత్రి మొదలైన రెండుకోట్ల మంత్రాలు వచ్చినాయి. ఇది పూర్వామ్నాయమము. ఋగ్వేద పూర్వకము. దీనికి అధిదేవత ఊర్మిణి

శుద్ధవిద్యా చ బాలా చ ద్వాదశార్ధా మతంగినీ,
ద్విజత్వసాధనీ విద్యా గాయత్రీ వేదమాతృకా.
గాణాపత్యం కార్తికేయం మృత్యుజి న్నీలకంఠకం
త్ర్యంబకం జాతవేదాశ్చ తథా ప్రత్యంగిరాదయః
సద్యోజాతముఖోద్భూతా వైదికాస్తు న్త్రికోటయః
ఏతాః కామగిరీంద్రస్థాః పూర్వామ్నాయస్య దేవతాః
గురుత్రయాదిపీఠాంతం చతుర్వింశత్సహస్రకం,
ఏతదావరణో పేతం పూర్వామ్నాయం భజామ్యహం.
మూలాధారే భజేన్మంత్రే పూర్వామ్నాయ మనూన్ ప్రియే.

## 2. దక్షిణామ్నాయము

తథైవ దక్షిణం ద్వారం యజురామ్నాయ రూపకం।
భోగినీనామ సా దేవీ దక్షిణామ్నాయ దేవతా॥

వామదేవుని ముఖంనుండి శైవాగమాలయిన కోటి మంత్రాలువచ్చినాయి. ఇది దక్షిణామ్నాయము యజుర్వేద పూర్వకము దీనికి అధిదేవత భోగిని

సౌభాగ్యవిద్యా బగళా వారాహీ వటుక స్తథా
శ్రీతిరస్కరిణీ ప్రోక్తా మహామాయా ప్రకీర్తితా,
అఘోరం శరభం ఖడ్గరావణం వీరభద్రకం.
రౌద్రం శాక్తం పాశుపతాద్యస్త్రశస్త్రాదిభైరవం,
దక్షిణామూర్తిమంత్రాద్యా శ్శైవాగమ సముద్భవాః
వామదేవముఖోద్భూతాః కోటిమంత్రా వరాననే,
పూర్వపీఠస్థితా దేవి దక్షిణామ్నాయదేవతాః
ద్విసహస్రంతు దేవ్యస్తాః పరివారసమన్వితాః
భైరవాదిపదద్వంద్వం భజే దక్షిణ ముత్తమం
స్వాధిష్ఠానే స్మరేద్దేవి దక్షిణామ్నాయ ముత్తమం.

## 3. పశ్చిమామ్నాయము

సామ వేదమయం చాత్ర పశ్చిమద్వార మీరితం।
కుబ్జికాఖ్యా మహాదేవి పశ్చిమద్వార దేవతా॥

అఘోరునిముఖంనుండి పశ్చిమామ్నాయమైన వైష్ణవాగమాలుకోటి మంత్రాలు వచ్చినాయి. సామవేద పూర్వకమయిన పశ్చిమామ్నాయానికి అధిదేవత కుబ్జిక

లోపాముద్రా మహాదేవీ అంబా చ భువనేశ్వరీ
అన్నపూర్ణా కామకలా సర్వసిద్ధి ప్రదాయినీ,
మదర్భవం వైనతేయం కార్తవీర్యం నృసింహకం.
వామత్రయం రామమంత్రం గోపాలం సారమేవ చ,
ధన్వంతరం చేంద్రజాల మింద్రాది సురమంత్రకం.
దత్తాత్రేయం ద్వాదశాష్టౌ వైష్ణవాగమచోదితాః.
అఘోరముఖసంభూతాః మదంశాః కోటిసంఖ్య కాః.
ఏతా జాలంధ్ర పీఠస్థాః పశ్చిమామ్నాయదేవతాః.
దూత్యాది చ చతుష్షష్టిః సిద్ధాంతం త్రిసహస్రకం.
ఆమ్నాయం పశ్చిమం వందే సర్వదా సర్వకామదం,
మణిపూరేస్మరేద్దేవి పశ్చిమామ్నాయజం మనుం.

## 4. ఉత్తరామ్నాయము

అథర్వణమయం తద్వ దుత్తరామ్నాయ మీరితం।
కాళికాఖ్యా మహాదేవీ ఉత్తరద్వార దేవతా॥

తత్పురుషునిముఖం నుంచిశ్రీవిద్యాఖ్యమైన ఉతరామ్నాయ మంత్రాలు రెండు కోట్లువచ్చినాయి. అథర్వణవేద పూర్వికమయిన ఉత్తరామ్నాయానికి అధిదేవత కాళిక.

తురీయాంబా మహార్థా చ అశ్వారూఢా తథైవ చ.
మిత్రాంబా చ మహాదేవీ శ్రీమద్వాగ్వాదినీ అపి.
దుర్గా కాళీ దహచ్చండీ నకులీ చ పులిందినీ,
రేణుకాలక్ష్మివాగీశౌ మాతృకాద్యాస్స్యు యంవరా.
పంచామ్నా యసమోపేతం శ్రీవిద్యాఖ్యం మదంశజం,
ముఖాత్తత్పురుషాజ్జాతా ద్వికోటీమంత్రనాయకాః.
ఏతాశ్చోడ్యానపీఠస్థాశ్శాక్తాగమ సముద్భవాః
ద్విసహస్రస్తు దేవ్యస్తాః పరివారయుతాః ప్రియే.
ముద్రాదినవకం చైవ సిద్ధానాం నవకం తథా,
వీరావళీ చ నవకం భజేదామ్నాయ ముత్తమం.
అనాహతాబ్జే స్మరద్వ్య ముత్తరామ్నాయ ముత్తమం.

### 5. ఊర్ధ్వామ్నాయము

చతుర్వేదమయః సాక్షాదూర్ధ్వామ్నాయస్సమీరతః॥
ఊర్ధ్వామ్నాయస్య సంప్రోక్తా దేవతా చండ భైరవీ॥

ఈశానుని(శివుని)ముఖం నుంచిఆత్మానంద ప్రదాయకమైన కోటిమంత్రాలువచ్చినాయి.ఇది ఊర్ధ్వామ్నాయము. చతుర్వేద సమన్వయము. దీనికి అధిదేవత చండభైరవి.

పరాపరా చ సా దేవీ పరా శాంభవమేవ చ.
ప్రాసాదం దహరం హంసం మహావాక్యాదికం పరం,
పంచాక్షరం మహామంత్రం తారకం జన్మతారకం.
ఈశానముఖసంభూతా స్స్వాత్మానంద ప్రదాయకాః.
కోటిసంఖ్యా మహాదేవి మంత్రరూపాస్సర్వసిద్ధిదాః,
ఏతాశ్శాంభవపీఠస్థా స్సహస్ర పరివారితాః,
ఆరాధ్య మాలినీపూర్వం మండలాంతం తథైవ చ.
సాయుజ్య హేతుకం నిత్యం వందే చోర్ధ్వకలాత్మకం,
ఊర్ధ్వామ్నాయస్య చ మనూనాజ్ఞాంతే తు విభావయేత్.
పూర్వశ్చ పశ్చిమశ్చైవ దక్షిణశ్చోత్తర స్తథా।

### 6. అనుత్తరామ్నాయము

ఊర్ధ్వామ్నాయశ్చసంచైతే మోక్షమార్గాః ప్రకీర్తితాః॥
ఊర్ధ్వత్వాత్సర్వధర్మాణామూర్ధ్వామ్నాయః ప్రశస్యతే।
ఊర్ధ్వామ్నాయం విజానీయా త్సాక్షా న్మోక్షైకసాధనమ్।
పూర్వామ్నాయః సృష్టిరూపః స్థితిరూపశ్చ దక్షిణః ।
సంహారః పశ్చిమోదేవి తిరోధాన స్తథోత్తరః॥
ఊర్ధ్వామ్నాయ స్తతోదేవి తథానుగ్రహరూపకం।
అనుత్తరా పరాంబా సా శ్రీమత్త్రిపురసుందరీ॥

కాగా అనుత్తరామ్నాయ మంత్రాలు సాక్షాత్తు పరమేశ్వరుని ముఖంనుంచే వచ్చినాయి. ఈరకంగా శివుని ముఖంనుంచి ఏడుకోట్లమంత్రాలువచ్చినాయి.వీటన్నింటినీ శంకరభగవత్పాదులవారు ప్రపంచసార సంగ్రహంలో నిక్షిప్తంచేశారు

ఊర్ధ్వ శ్రీపాదుకా పూర్వం చరణాంతం గురోః క్రమాత్
స్మర్తవ్యా పాదుకా పూర్వం చరణం తదనంతరం,
పంచాంబా నవనాథాంబా మూలవిద్యా తతఃపరం
ఆధారవిద్యాషట్కం చ పునరంఘ్రిద్వయం క్రమాత్,
శాంభవీ చాథ హృల్లేఖా సమయాపరబోధినీ.
కౌళపంచాక్షరీ పంచ దళార్ధా ను త్తరాత్మికా,
షోడశీ పూర్తివిద్యా చ మహాత్రిపురసున్దరీ.
పశ్చాదనుత్తరం వందే పరబ్రహ్మస్వరూపిణీం.
అనుత్తరామ్నాయమనూన్మండలాంతం యథాక్రమం,
సప్తకోటిమహామంత్రాన్ ద్వాదశాంతే సదాస్మరేత్.
శుచిర్వాప్యశుచిర్వా ఽపి గచ్ఛన్ తిష్ఠన్ స్వపన్నపి,
మంత్రైకశరణో విద్వాన్మనసా ఽపి సదా స్మరేత్.
తత్తత్సిద్ధ్యై చ సాహస్రం జపేత్సాధకపుంగవః.

శ్రీవిద్య అన్నప్పుడు శ్రీ అనేది గౌరవవాచకం కాదు.శ్రీఅంటేమహాకాళి, శ్రీ అంటే మహాలక్ష్మి శ్రీ అంటే మహాసరస్వతి.

శ్రీమహావిష్ణువు యోగనిద్రలో ఉన్నప్పుడు మధుకైటభులనే అసురులు మదోన్మత్తులై బ్రహ్మనువధించటానికి వచ్చారు.అప్పుడు,ఆ అసురులను సంహరించటంకోసం బ్రహ్మచేత స్తుతింపబడినది మహాకాళి.ఈమెఇంద్రనీలముల కాంతులు వెదజల్లుతూ పది ముఖములుకలిగి పదిచేతులయందు ఖడ్గము, శూలము, భుసుండి,మానవశిరస్సు, శంఖము మొదలైన ఆయుధములు ధరించి ఉంటుంది. ఈదేవి రూపము ప్రక్కపుటలో ఇవ్వబడింది.

### మహాకాళీధ్యానము

ఖడ్గం చక్రగదేషుచాపపరిఘాన్ శూలంభుశుణ్డీం శిరః
శఙ్ఖం సన్దధతీం కరైస్త్రినయనాం సర్వాఙ్గభూషావృతామ్।
యాం హన్తుం మధుకైటభౌ జలజభూస్తుష్టావ సుప్తే హరౌ
నీలాశ్మద్యుతిమాస్యపాదదశకాం సేవే మహాకాళికామ్॥

మహిషాసురుని సంహరించినది మహాలక్ష్మి.ఈమెప్రవాళ (పగడపు) వర్ణముతో ప్రకాశిస్తూ నపద్మైనిమిది చేతులలోఅక్షమాల,గండ్రగొడ్డలి, గద, బాణము,వజ్రాయుధము,కమలము,ధనుస్సు,కలశము,దండము, శక్తి, ఖడ్గము,డాలు,శంఖము,ఘంట,పానపాత్ర,శూలము,పాశము, చక్రముధరించి తామరపూవుపై కూర్చుని ఉంటుంది. ఈదేవి రూపము ప్రక్కపుటలో ఇవ్వబడింది

**మహాలక్ష్మీధ్యానము**

ఓం అక్షస్రక్పరశుం గదేషుకులిశం పద్మం ధనుః కుణ్డికాం
దణ్డం శక్తిమసిం చ చర్మ జలజం ఘణ్టాం సురాభాజనమ్।
శూలం పాశసుదర్శనే చ దధతీం హస్తైః ప్రవాళ ప్రభాం
సేవే సైరిభమర్దినీమిహ మహాలక్ష్మీం సరోజస్థితామ్॥

శుంభనిశుంభులను సంహరించినది మహాసరస్వతి. ఈమె చంద్రుని వలె స్వచ్ఛమైన తెల్లనికాంతితో ప్రకాశిస్తూ ఎనిమిది చేతుల యందు ఘంట, శూలము,నాగలి, శంఖము, రోకలి, చక్రము, ధనుస్సు, బాణములు ధరించి ఉంటుంది. ఈమె రూపము ప్రక్కపుటలో ఇవ్వబడింది.

**మహాసరస్వతీధ్యానము**

ఘణ్టాశూలహలాని శఙ్ఖముసలే చక్రం ధనుః సాయకం
హస్తాబ్జైర్దధతీం ఘనాన్తవిలసచ్ఛీతాంశుతుల్యప్రభామ్।
గౌరీదేహసముద్భవాం త్రిజగతామాధారభూతాం మహా-
పూర్వామత్ర సరస్వతీమనుభజే శుమ్భాదిదైత్యార్దినీమ్॥

ఈరకంగా ఉన్న మహాకాళి, మహాలక్ష్మి మహాసరస్వతులస్వరూపమైన జగదంబ, పరాత్పరి అయిన రాజరాజేశ్వరిని గురించి తెలియచేసేది శ్రీవిద్య. ఆమెపాశము,అంకుశము, పుండ్రేక్షుచాపము పుష్పబాణముధరించి అష్టమినాటిచంద్రుని ఆభరణంగా శిరస్సునధరించి ఉంటుంది.

**రాజరాజేశ్వరీ ధ్యానమ్**

చతుర్భుజేచంద్రకళావతంసే కుచోన్నతే కుంకుమరాగశోణే
పుండ్రేక్షుపాశాంకుశ పుష్పబాణహస్తే నమస్తే జగదేకమాతః

ఈ దేవిరూపము ప్రక్కపుటలో ఇవ్వబడింది. సౌందర్యలహరిలో చెప్పినట్లుగా

చతుష్షష్ట్యా తంత్రైః సకల మతిసంధాయ భువనం
స్థిత స్తత్తత్సిద్ధి ప్రసవ పరతంత్రైః పశుపతిః ।
పునస్త్వన్నిర్బంధా దఖిల పురుషార్థైకఘటనా
స్వతంత్రం తే తంత్రం క్షితితల మవాతీతర దిదమ్॥

"దేవా నీవుచెప్పిన తంత్రాల ద్వారా నాభక్తులు ఐహికబంధాలలోకూరుకు పోతున్నారు. వారిని ఉద్ధరించి వారికి మోక్షంప్రసాదించటానికి ఏదైనా ఇంకొక మార్గము చూపవలసినది" అని పార్వతీ దేవి పరమశివుణ్ణి అడగ్గా,శివుడుమోక్షప్రదమైన శ్రీవిద్యా తంత్రాన్ని బోధించాడు అని

# మహాలక్ష్మి



చెప్పబడింది, ఈశ్లోకాన్ని పరిశీలిస్తే లోకంలో కేవలం కామ్యవాదులు, మోక్షవాదులు అనిరెండు రకాలవారున్నారు. వీరి ఆచారవన్యవహారాలను బట్టి దేవీ ఉపాసకులను మూడు రకాలుగాచెప్పవచ్చు,అవి

1. కాశ్మీరపద్ధతి ----- శుద్ధదక్షిణాచారము దీనినే సమయాచారము అంటారు.
2.వంగదేశపద్ధతి ----- వామాచారము
3. కేరళపద్ధతి ----- మిశ్రమాచారము

*కాని ప్రస్తుతం వాడుకలో ఉన్నవి.*

1.కౌళాచారము, 2. సమయాచారము
3. మిశ్రమాచారము 4. వామాచారము

అసలుఉపాసనలో ఉన్నవి.రెండే.పద్ధతులు 1 . సగుణోపాసన 2 నిర్గుణోపాసన

**నిర్గుణోపాసన :-** నిరాకారుడు నిర్గుణస్వరూపుడు అయినవాడు పరబ్రహ్మ.మహర్షులు., పీఠాధిపతులు ఈ ఉపాసన చేస్తారు. ఓంకారము వీరి మంత్రము. ఇందులో ఐం క్లీం సౌః ద్రాం ద్రీం బ్లూం అనేబీజాలు ఉన్నాయని చెప్పబడుతోంది, వీరిఆరాధన జ్ఞాన,మోక్షపరంగా ఉంటుంది.సాయుజ్యమే వీరి లక్ష్యము.

ఐంకారఃప్రణవాక్షరశ్చ వదనం ద్రాం ద్రీం కుచావేష్టితం
క్లీం నాభి.స్థితగుహ్య మంతరంగతం బ్లూంకార మూరుద్వయం
సౌః కారేణతు పంచబాణసదృశం బందూకపుష్పద్యుతిం
ధ్యాయేద్వర్ణ విభూషితస్య పులకో గంగాప్రవాహోద్రవం॥

**సగుణోపాసన :-** సగుణబ్రహ్మను గురించి చెప్పే తంత్రాలను ఆగమాలు అంటారు. క్రియతోకూడిన మంత్రశాస్త్రాన్ని తంత్రము అంటారు.

ఆగమాలలో వైష్ణవాగమాలు, శైవాగమాలు,శక్త్యాగమాలు అని మూడు రకాలున్నాయి, శక్తిని జగన్మాతగా, పరదేవతగాచెప్పేఆగమాలను శక్త్యాగమాలు అంటారు. వీటిలో

1. సాత్వికాగమాలను - తంత్రాలనీ,
2. రాజసాలను - యామళాలనీ,
3. తామసాలను - డామరాలనీ

అంటారు. అశ్వక్రాంతేరథక్రాంతేవిష్ణుక్రాంతేవసుంధరా,వింధ్యపర్వతాలను ఆధారంగాచేసుకుని భారతదేశాన్ని మూడుభాగాలుగాచేశారు.

1. అశ్వక్రాంతము- వింధ్యనుంచి శ్రీలంకవరకుగలప్రాంతము దీనిలో తంత్రాలున్నాయి
2. రథక్రాంతము- వింధ్యనుంచి నేపాల్‌మీదుగాచైనావరకు గలప్రాంతము.దీనిలో తంత్రాలున్నాయి
3. విష్ణుక్రాంతము :- వింధ్యనుండి చిట్టగాంగువరకు గలప్రాంతము. దీనిలో తంత్రాలున్నాయి. వీటిలో కొన్ని తంత్రాలు రెండు, మూడు ప్రాంతాలకు కూడా వర్తిస్తాయి మొత్తం తంత్రాల వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

*1. అశ్వక్రాంత దేశ విభాగమునకు తంత్రములు*

1. భూతశుద్ధి
2. గుప్తదీక్ష
3. బృహత్సార
4. తత్త్వసార
5. వర్ణసార
6. క్రియాసార
7. గుప్తతంత్ర
8. గుప్తసార
9. బృహత్తోడాల
10. బృహన్నిర్వాణ
11. సిద్ధతంత్ర
12. కాలతంత్ర
13. శివతంత్ర
14. సారాత్సార
15. బృహత్‌కంకాలిని
16. గౌరీతంత్ర
17. యోగతంత్ర
18. ధర్మకతంత్ర
19. తత్త్వచింతామణి
20. వింధుతంత్ర
21. మహాయోగిని
22. బృహద్యోగిని
23. శివధ్యాన
24. సంవద
25. శూలినీ
26. మహామాలినీ
27. మోక్ష
28. బృహన్మాలినీ
29. మహామోక్ష
30. బృహన్మోక్ష
31. గోపీతంత్ర
32. భూతలిపి
33. కామిని
34. మోహిని
35. మోహన
36. సమీరణ
37. వామకేశ్వర
38. మహావీర
39. చూడామణి
40. గుర్వార్చన
41. గోప్య
42. తీక్ష
43. మంగల
44. కామరత్న
45. గోపలీలామృత
46. బ్రహ్మాండ
47. చీనా
48. మహానిరుత్తర
49. భూతేశ్వర
50. గాయత్రి
51. విశుద్ధేశ్వర
52. యోగార్ణవ
53. భేరుండ
54. మంత్రచూడామణి
55. యంత్రచూడామణి
56. విద్యుల్లత
57. భువనేశ్వరి
58. లీలావతి
59. బృహచ్చీనా
60. కురంజ
61. జయరాధామాధవ
62. ఉజ్జశక
63. ధూమావతి
64. శివ

2. రథక్రాంత దేశ విభాగమునకు తంత్రములు.

1. చిన్మయ
2. మేృ్యసూక్త
3. మహిషమర్దని
4. మాతృకోదయ
5. హంసమహేశ్వర
6. మేరుతంత్ర
7. మహానీల
17. బృహద్యోని
18. బ్రహ్మజ్ఞాన
19. గరుడ
20. వర్ణవిలాస
21. బాలవిలాస
22. పురశ్చరణచంద్రిక
23. పురశ్చరణరసోల్లాస
33.యోగసర్వోదయ
34. యక్షిణీతంత్రము
35. స్వరోదయ
36. జ్ఞానభైరవ
37 ఆకాశభైరవ
38. రాజరాజేశ్వరి
39. రేవతి
49. శాక్తిగామసర్వస్వ
50. సంహిత
51. ఆచారసార
52.చీనాచార
53. పదామ్నాయ
54. కరాళభైరవ
55. ...ధ

| | | | |
|---|---|---|---|
| 8. మహానిర్వాణ | 24. పంచదశి | 40. సారస | 56. మహాలక్ష్మి |
| 9. భూతడామర | 25. పిచ్ఛిల | 41. ఇంద్రజాల | 57. కైవల్య |
| 10. దేవడామర | 26. ప్రపంచసార | 42. కృకలానదీపిక | 58. కులసద్భావ |
| 11. బీజచింతామణి | 27. పరమేశ్వర | 43. కంకాళమాలినీ | 59. సిద్ధికద్ధారి |
| 12. ఏకజాత | 28. నవరత్నేశ్వర | 44. కాలోత్తమ | 60. కృత్స్ర |
| 13. వాసుదేవరహస్య | 29. నారదీయ | 45. యక్షడామర | 61. కాలభైరవ |
| 14. బృహద్గౌతమీయ | 30. నాగార్జున | 46. సరస్వతీ | 62. ఉడ్డామరేశ్వర |
| 15. వర్ణోద్ధర్తి | 31. యోగసార | 47. శారద | 63. మహాకాల |
| 16. ఛాయానీల | 32. దక్షిణామూర్తి | 48. శక్తిసంగమ | 64. భూతభైరవ |

*.3. విష్ణుక్రాంత దేశ విభాగమునకు తంత్రములు*

| | | | |
|---|---|---|---|
| 1. సిద్ధీశ్వర | 17. నిత్యా | 33. మాలినీ | 49. భావచూడామణి |
| 2. కాళీతంత్ర | 18. శివాగమ | 34. రుద్రయామళ | 50. దేవప్రకాశ |
| 3. కులార్ణవ | 19. చాముండా | 35. బృహత్‌శ్రీక్రమ | 51. కామాఖ్య |
| 4. జ్ఞానార్ణవ | 20. ముండమాలా | 36. గవాక్ష | 52. కామధేను |
| 5. నీలతంత్ర | 21. హంసమహేశ్వర | 37. సుకుముదిని | 53. కుమారి |
| 6. ఫేట్కారి | 22. నిరుత్తర | 38. విశుద్ధేశ్వర | 54. భూతడామర |
| 7. దేవ్యాగమ | 23. కులప్రకాశక | 39. మాలినీవిజయ | 55. యామళ |
| 8. ఉత్తర | 24. దేవీకల్ప | 40. సమయాచార | బ్ర హ్మయామళ |
| 9. శ్రీక్రమ. | 25. గాంధర్వ | 41. భైరవి | 57. విశ్వసార |
| 10సిద్ధియామల | 26. క్రియాసార | 42. యోగినిహృదయ | 58. మహాకాల |
| 11. మత్స్యసూక్త | 27. నిబంధ | 43. భైరవ | 59. కులోడ్డీశ |
| 12. సిద్ధసార | 28. స్వతంత్ర | 44. సనత్కుమార | 60. కులామృత |
| 13. సిద్ధిసారస్వత | 29. సంమోహన | 45. యోని | కు ళ్లికా |
| 14. వారాహి | 30. తంత్రరాజ | 46.తంత్రసార | తం త్రచింతామణి |
| 15. యోగిని | 31. లలితా | 47. నవరత్నేశ్వర | 63. కాశీవిలాస |
| 16. గణేశ విమర్శని | 32. రాధా | 48. కులచూడామణి | 64. మాయంత్ర |

చతుష్షష్టితంత్రాణి మాతృణాముత్తమానిచ' ఈతంత్రాలన్నింటిలోనూ 64తంత్రాలు మాత్రమే దేవిపూజకు ఉపకరిస్తున్నాయి. ఇవన్నీ కామ్యప్రదాలు. కాబట్టి, మోక్షప్రాప్తికి ఏదైనా ఒకటి చెప్పుమని పార్వతి అడిగినప్పుడు శివుడు శ్రీవిద్యాతంత్రము చెప్పాడు. ఇంతకీ శ్రీవిద్యా తంత్రము అంటేఏది? శంకరభగవత్పాదుల తరువాత శ్రీవిద్యలోనిష్ణాతులైయింది తులు ఇద్దరు కనిపిస్తున్నారు. వారు. 1. లొల్లా లక్ష్మీధరులు. 2. భాస్కరాచార్యులు. లక్ష్మీధరుని మతంప్రకారము శ్రీవిద్య అంటే పంచదశిమహామంత్రము. కాని భాస్కరరాయలవారి ప్ర కారము

వామకేశ్వరతంత్రమేశ్రీవిద్యాతంత్రము. శ్రీవిద్యకు ప్రామాణికాలుగా చెప్పబడే గ్రంథాలుమొత్తం అరుదాకా ఉన్నాయి. అవి.

| | |
|---|---|
| 1. నారాయణభట్టు వ్రాసిన | సప్తశతి భాష్యము |
| 2. శంకరాచార్యులవారి | సౌందర్యలహరి |
| 3. శంకరులే వ్రాశారనిచెప్పబడుతున్న | లలితాత్రిశతి భాష్యము. |
| 4. భాస్కరరాయలవారువ్రాసిన | 1. లలితసహస్రనామభాష్యము |
| | 2. వరివస్యా రహస్యము. |
| | 3. సేతు బంధము. |

పై ఆరింటిలోనూ భాస్కరరాయల వారు వ్రాసిన మూడు గ్రంథాలు శ్రీవిద్యకు ప్రస్థానత్రమముగా చెప్పబడుతున్నాయి. శ్రీవిద్యకు ప్రామాణికాలుగా చెప్పబడుతున్న అరు గ్రంథాలలోనూ, మూడు భాస్కరరాయలవారివే, కాబట్టి వారి మతాన్ననుసరించి వామకేశ్వర, తంత్రమే శ్రీవిద్యాతంత్రము అనిచెప్పబడింది.



# 3. శ్రీచక్రము- మానవదేహము.

శ్రీ అంటే మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతుల స్వరూపము. చక్రము అంటే యంత్రము లేదా నివాసస్థానము. మొత్తం మీద శ్రీచక్రము అంటే మహాకాళి , మహాలక్ష్మి, మహాసరస్వతుల యొక్కస్వరూపమైన ఆ పరాభట్టారిక యొక్క సామ్రాజ్యము లేదా నివాసస్థానము. మానవదేహము నవధాతువుల వలన నిర్మితమైంది. వాటిలో ఐదు శక్తి ధాతువులు కాగా నాలుగు శివధాతువులు.

త్వగ వృజ్మాంస మేథో 2స్థిధాతవ శ్శక్తి మూలకా:

మజ్జా,శుక్ల,ప్రాణ,వీర్య ధాతవ శ్శివమూలకా:

పై శ్లోకాన్ని బట్టి చర్మము, రక్తము,మాంసము, మెదడు, ఎముకలు అనేవి శక్తిధాతుమూలకాలు కాగా, మజ్జ, శుక్లము, ప్రాణము జీవము శివధాతువులని చెప్పబడుచున్నవి.

నవధాతురయం దేహో నవయోని సముద్భవ:

దశమీయోని రే కైవ పరాశక్తి స్తదీశ్వరీ॥

అనే ఈశ్వరవచనాన్ని బట్టి మానవదేహము నవయోనుల వలన పుట్టి,నవధాతుమయమై ఉన్నది. దీనిలో పదవ యోని అపరమేశ్వరియే. శ్రీచక్రంలో ఉన్న తొమ్మిది చక్రాలు, మానవదేహంలోని తొమ్మిది ధాతువులకు ప్రతీకలు. అంతే కాకుండా మానవ దేహంలో నవరంధ్రాలున్నాయి. అలాగే శ్రీచక్రంలో నవావరణలున్నాయి. అందుచేతనే శ్రీచక్రానికీ మానవదేహానికి సామ్యము చెప్పబడింది.శ్రీచక్రంలోని నవావరణలను, మానవ దేహంలోని వివిధ అవయవాలతోపోల్చటం జరిగింది.

బైందవమ్ బ్రహ్మరంధ్రంచ, మస్తకం చ త్రికోణకమ్.

లలాటేష్టారపత్రంచ, భ్రువోర్మధ్యేదశారకమ్

బహిర్దశారం,కంఠేచ మన్వశ్రం హృదయం భవేత్

నాభౌచ, వసుపత్రంచ, కట్యాం షోడశపత్రకమ్

వృత్తత్రయంచ ఊరుభ్యాం, పద్భ్యాంభూపురత్రయమ్॥

శ్రీచక్రంలోని వివిధ ఆవరణలు, మానవదేహంలోని వివిధభాగాలతో ఈ క్రిందివిధంగా సమన్వయంచెయ్యబడ్డాయి.

| | | |
|---|---|---|
| బిందువు | - | బ్రహ్మరంధ్రము |
| త్రికోణము | - | తలముందుభాగము |
| అష్టారము (అష్టకోణము) | - | లలాటము |
| అంతర్దశారము | - | భ్రూమధ్యము |
| బహిర్దశారము | - | కంఠము |

| | | |
|---|---|---|
| చతుర్దశారము | - | హృదయము. |
| అష్టదళము | - | నాభి |
| షోడశదళము | - | కటిప్రదేశము |
| వృత్తత్రయము | - | ఊరువులు |
| భూపురము | - | పాదాలు. |

అయితే కొన్ని తంత్రాల ప్రకారము ఈసమన్వయం వేరుగా ఉంది

శ్రీచక్రం బ్రహ్మరంధ్రేతు, సువృత్తంచత్రికోణకమ్
లలాటేష్టారకంచక్రం, భ్రువోర్మధ్యే దశారకమ్
బహిర్దశారంకంఠేతు, మన్వస్రంహృదయేభవేత్
కుక్షౌతుప్రథమవృత్తం, నాభ్యామష్టదళాంబుజమ్
కట్యాంద్వితీయం వలయం, స్వాధిష్ఠానే కలాశ్రకమ్
తస్యా ధస్తాత్తృతీయం, మూలాధారే చతురశ్రకం॥
ద్వితీయంభూపురంజంఘే, తృతీయం వామజంఘకే
త్రిపురేశ్రీమహాయంత్రం సృష్టి న్యాసవిధిక్రమాత్॥

| | | |
|---|---|---|
| బిందువు, త్రికోణము | - | బ్రహ్మరంధ్రము |
| అష్టకోణము | - | లలాటము |
| అంతర్దశారము | - | భ్రూమధ్యము |
| బహిర్దశారము | - | కంఠము |
| చతుర్దశారము | - | హృదయము |
| ప్రథమవృత్తము | - | కుక్షి |
| అష్టదళము | - | నాభి |
| ద్వితీయవృత్తము | - | కటిప్రదేశము |
| షోడశదళము | - | స్వాధిష్ఠానము |
| తృతీయవృత్తము | - | స్వాధిష్ఠానానికి క్రిందిభాగము |
| చతురస్రంలోనిప్రథమరేఖ | - | మూలాధారము |
| చతురస్రంలోనిద్వితీయరేఖ | - | కుడిపిక్క |
| చతురస్రంలోనితృతీయరేఖ | - | ఎడమపిక్క |

ఈ రకంగా శ్రీచక్రంలోని వివిధ ఆవరణలు మానవదేహంలోని వివిధ భాగాలతో సమన్వయంచెయ్యబడ్డాయి. మానవ దేహము తొమిధాతువులతో కూడి ఉన్నది. వీటినే

యోనులు అంటారు. శ్రీచక్రము తొమ్మిది చక్రములసమూహమై ఉన్నది. అందుకే శ్రీచక్రాన్ని 'నవయోన్యాత్మకము' అంటారు. ఈ నవయోనులు నవధాతువులకు ప్రతీకలు. కామికాతంత్రంలో చెప్పినట్లుగా

త్వగస్కృఙ్మాంస మేదోస్థి ధాతవ శ్శక్తి మూలకాః
మజ్జా శుక్ల ప్రాణజీవధాతవశ్శివమూలకాః॥

వీటిలో చర్మము, రక్తము, మాంసము, మెదడు, ఎముకలు శక్తిధాతువులు, మజ్జ, వీర్యము, ప్రాణము, జీవము శివధాతువులు.

నవధాతురయం దేహో నవయోని సముద్భవః
దశమీ యోని రేకైవ పరాశక్తి ప్రధీశ్వరీ॥

ఈదేహమునవయోనులవలనపుట్టి,నవధాతుమయమైఉన్నది.దీనిలోపదవధాతువుపరమేశ్వరి.

మానవదేహంలో జ్ఞానేంద్రియాలు ఐదు, కర్మేంద్రియాలు ఐదు, మనస్సు మొత్తం పదకొండు ఇంద్రియాలు ఉన్నాయి. పరబ్రహ్మస్వరూపుడైన ఈశ్వరుడు లోకాలను ఉద్ధరించాలనే ఉద్దేశ్యంతో, తానే స్త్రీ పురుషులుగా, గురుశిష్యులుగా రూపాంతరంచెంది శ్రీవిద్యను దేవికి ఉపదేశిస్తూ ఇలా అన్నాడు.

శ్రీచక్రం త్రిపురసుందర్యా బ్రహ్మాండాకారమీశ్వరీ।
పంచభూతాత్మకం చైవ తన్మాత్రాత్మకమేవచ॥
ఇంద్రియాత్మక మేవంచ, మనస్తత్త్వాత్మకంతథా
మాయాది తత్త్వ రూపంచ, తత్త్వాతీతంచ బైందవమ్॥

ఇక్కడ శ్రీచక్రము బ్రహ్మాండముతోపోల్చ బడింది. ఈ చరాచరజగత్తు అంతా శ్రీచక్రంలో ఇమిడి ఉన్నది. సృష్టికి పంచభూతాలు తన్మాత్రలు మూలమై ఉన్నాయి, వాటియొక్క తత్త్వాలు శ్రీచక్రంలో చేర్చబడ్డాయి. ఈ రకంగా శ్రీచక్రం విశాలవిశ్వంతో పోల్చబడింది. అలాగే మానవదేహంలో ఉన్న జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు అనబడే పదకొండుఇంద్రియాల తత్త్వాలు శ్రీచక్రంలో చేర్చబడటంచేత శ్రీచక్రము మానవదేహంతోపోల్చబడింది. అందుకనే శ్రీచక్రపూజ చేసినట్లైతే, ఈచరాచర జగత్తునూ, విశ్వమానవాళినీ కుడాపూజించినట్లే.

**శ్రీచక్రము - షట్చక్రాలు :**

శ్రీచక్రంలో శివచక్రాలు నాలుగు, శక్తి చక్రాలు ఐదు మొత్తం తొమ్మిది చక్రాలున్నాయి. మానవదేహంలో షట్చక్రాలున్నాయి. ఈ షట్చక్రాలకు శ్రీచక్రంతో ఐక్యతనే 'నాదబిందు ఐక్యత' అంటారు. ఇక్కడనాదము అంటే శ్రీచక్రము, బిందువు అంటే షట్చక్రాలసమూహము. ఈ విషయాన్ని భైరవ యామళంలో ఈవిధంగా అన్నారు

త్రికోణ మష్టకోణం చ దశకోణద్వయం తథా
మనుకోణం చతుష్కోణం, కోణచక్రాదిషట్క్రమాత్॥
మూలాధారంతథాస్వాధిష్ఠానం చ మణిపూరకమ్ ।
అనాహతం విశుద్ధాఖ్య మాజ్ఞా చక్రంవిదుర్బుధాః॥

త్రికోణముమొదలైన చక్రాలన్నీ ఆధారాది షట్చక్రాలతో ఐక్యతపొందుతున్నాయి. శ్రీచక్రములోని తొమ్మిది చక్రాలు, మానవ దేహంలోని షట్చక్రాలు ఈ క్రింది విధంగా ఉంటాయి.

| శ్రీచక్రంలోని తొమ్మిది చక్రాలు. | మానవదేహంలోని షట్చక్రాలు |
|---|---|
| 1. బిందువు | 1. మూలాధారము |
| 2. త్రికోణము | 2. స్వాధిష్ఠానము |
| 3. అష్టకోణము | 3. మణిపూరము |
| 4. అంతర్దశారము | 4. అనాహతము |
| 5. బహిర్దశారము | 5. విశుద్ధచక్రము |
| 6. చతుర్దశారము | 6. ఆజ్ఞాచక్రము. |
| 7. అష్టదళము | 7. సహస్రారము |
| 8. షోడశదళము | |
| 9. భూపురత్రయము | |

శంకరభగవత్పాదుల వారి పరమగురువైన గౌడపాదులవారు తమ సుభగోదయస్తుతిలో నాదబిందుఐక్యతను ఈ విధంగా చెప్పారు.

త్రికోణం చాధారం, త్రిపుర తనుతే స్వర మనఘే
భవేత్స్వాధిష్ఠానం, పునరపి దశారమ్ మణిపురమ్
దశారం తే సంవిత్కమల, మథ మన్వస్ర క్రమమే
విశుద్ధం, స్యాదాజ్ఞాశివ ఇతి తతో బైందవ గృహమ్॥

| | | |
|---|---|---|
| 1. ఆధారచక్రానికి | - | త్రికోణంతో ఐక్యత |
| 2. స్వాధిష్ఠానానికి | - | అష్టకోణంతో ఐక్యత |
| 3. మణిపూరానికి | - | అంతర్దశారంతో ఐక్యత |
| 4. అనాహతానికి | - | బహిర్దశారంతో ఐక్యత |
| 5. విశుద్ధచక్రానికి | - | చతుర్దశారంతో ఐక్యత |
| 6. ఆజ్ఞాచక్రానికి | - | అష్టదళము, షోడశదళములతో ఐక్యత |

## కౌళమతానుసారము శ్రీచక్రము - షట్చక్రాల ఐక్యత


మూలాధారకమలము.


స్వాధిష్ఠానకమలము.


మణిపూరకమలము.


అనాహతకమలము.


విశుద్ధకమలము.


ఆజ్ఞాకమలము.

| | | |
|---|---|---|
| 7. సహస్రారానికి | - | చతుర్ద్వారసహితమైన భూపురంతో |
| 8. స్వాధిష్ఠానానికి పైభాగంలో | - | బ్రహ్మగ్రంధి |
| | | ప్రథమవృత్తము |
| 9. అనాహతానికి పైభాగంలో | - | విష్ణుగ్రంధి |
| | | ద్వితీయవృత్తము |
| 10. ఆజ్ఞాచక్రానికి పైభాగంలో | - | రుద్రగ్రంధి |
| | | తృతీయవృత్తము |

ఇదికౌళచారుల సమన్వయము అని కొందరి వాదన. కొందరుసమయ మతస్థుల ప్రకారము శ్రీచక్రము - షట్చక్రాల ఐక్యత ఈ విధంగా ఉంటుంది

| | | |
|---|---|---|
| 1. మూలాధారానికి | - | భూపురంతో ఐక్యత |
| 2. స్వాధిష్ఠానానికి | - | చతుర్దశారంతో ఐక్యత |
| 3. మణిపూరానికి | - | బహిర్దశారంతో ఐక్యత |
| 4.అనాహతానికి | - | అంతర్దశారంతో ఐక్యత |
| 5. విశుద్ధచక్రానికి | - | అష్టకోణంతో ఐక్యత |
| 6. ఆజ్ఞాచక్రానికి | - | త్రికోణంతో ఐక్యత |
| 7. సహస్రారానికి | - | బిందువుతో ఐక్యత |
| 8. రుద్రగ్రంధి | - | ప్రధమవృత్తముతో ఐక్యత |
| 9. విష్ణుగ్రంధి | - | ద్వితీయవృత్తముతో ఐక్యత |
| 10. బ్రహ్మగ్రంధి | - | తృతీయవృత్తముతో ఐక్యత |

కౌళసమయాచారాల ప్రకారం ఈ ఐక్యతను ప్రక్కపుటలలో పటములద్వారాచూపటం జరిగింది. ఈరకంగా గనక చూచినట్లైతే, పరదేవతకు ప్రతిరూపంగా మనం పూజించే శ్రీచక్రము, మానవ దేహము,రెండూ ఒకటేకాని వేరుకాదు. అందుకనే శ్రీచక్రపూజ -విశ్వమానవాళిపూజ అనిచెప్పబడింది.

శ్రీచక్రస్యచత్వారి ద్వారాణి చతుర్వేదరూపాణి
ద్వారప్రవేశనైవభవతి పరదేవతా సాక్షాత్కారః

శ్రీచక్రముయొక్క నాలుగు ద్వారాలు,నాలుగు వేదాలకు ప్రతీకలు. ఆద్వారములందు గనక ప్రవేశించినట్లైతే పరదేవత సాక్షాత్కారం జరుగుతుంది. ఆద్వారాలలో ప్రవేశించాలంటే, సాధకుడు ప్రాణాయామంచేసి, కుండలినీ శక్తిని నిద్రలేపాలి. అప్పుడు, అది ఊర్ధ్వముఖంగా బయలుదేరి షట్చక్రాలను, గ్రంధిత్రయాన్ని దాటిసహస్రారం చేరుతుంది. అప్పుడుసాధకునకు పరదేవతాసాక్షాత్కారముజరుగుతుంది.

# 4. శ్రీ చక్రము - శివశక్తి చక్రాలు

చతుర్భి శ్శివచక్రైశ్చ శక్తిచక్రైశ్చ పంచభిః
శివశక్త్యాత్మకం జ్ఞేయం శ్రీచక్రం శివయోర్వపుః॥

నాలుగు శివచక్రాలతోను, ఐదుశక్తిచక్రాలతోను, మొత్తం తొమ్మిది చక్రములతోను, తొమ్మిది మూలప్రకృతికలతోను శ్రీచక్రము శివశక్తులకు నిలయమై ఉన్నది, శ్రీచక్రాన్ని గురించి శంకరభగవత్పాదులవారు సౌందర్యలహరిలో ఈ విధంగా అన్నారు.

చతుర్భి శ్రీకణ్ఠైశ్శివయువతిభిః పఞ్చభిరపి
ప్రభిన్నాభి శ్శమ్భో ర్నవభిరపి మూలప్రకృతిభిః
చతుశ్చత్వారింశ ద్వసుదళ కలాశ్రత్రివలయ
త్రిరేఖాభి సార్థం తవ శరణకోణాః పరిణతాః॥

శ్రీచక్రంలో ఐదుశక్తిచక్రాలు, నాలుగుశివచక్రాలు ఉన్నాయని చెప్పబడింది. దానిలో

త్రికోణమష్టకోణంచ దశకోణద్వయం తథా
చతుర్దశారం చైతాని శక్తిచక్రాణి పంచశః॥

త్రికోణము, అష్టకోణము, దశారయుగ్మము, చతుర్దశకోణము అనే ఐదు శక్తిచక్రాలు.

బిందుశ్చాష్ట దళం పద్మం, పద్మంషోడశపత్రకమ్
చతురస్రంచ చత్వారి, శివచక్రాణ్యనుక్రమాత్॥

బిందువు, అష్టదళము, షోడశదళము భూపురత్రయము అనే నాలుగు శివచక్రాలు.

శివచక్రాలకు, శక్తి చక్రాలకు అవినాభావ సంబంధమున్నది. అది తెలిసిన వాడే చక్రవిదుడు. శ్రీచక్రములోని చక్రాలకు, మానవదేహంలోని షట్చక్రాలకు అవినాభావసంబంధమున్నదని ముందే చెప్పబడింది. శ్రీచక్రంలో త్రికోణస్వరూపిణి శక్తి, బిందుస్వరూపుడు శివుడు. 'తంత్రరాజము' లోచెప్పినట్లుగా శ్రీచక్రములోని నాలుగుద్వారాలు నాలుగు వేదాలకు ప్రతీకలు. ఆద్వారములందుగనక ప్రవేశించగలిగినట్లైతే పరదేవత సాక్షాత్కారమౌతుంది. లలితా త్రిశతి ఫలశ్రుతి లోశ్రీచక్రాన్ని ఈవిధంగా చెప్పటం జరిగింది.

ఏతేషాం సిద్ధిదా విద్యా కల్పకోటిశతై రపి।
చతుర్భిశ్శివచక్రైశ్చ శక్తిచక్రైశ్చ పంచభిః॥
నవచక్రై శ్చసంసిద్ధం శ్రీ చక్రం శివయోర్వపుః।
త్రికోణ మష్టకోణంచ దశకోణద్వయం తథా॥
చతర్దశారం చైతాని శక్తి చక్రాదిపంచ చః

బిందు శ్చాష్టదళం పద్మం పద్మం షోడశపత్రకమ్॥
చతురస్రంచ చత్వారి శివచక్రాణ్యనుక్రమాత్।
త్రికోణేబైందవం శ్లిష్టం అష్టారేష్టదళాంబుజమ్॥
దశారయో ష్షోడశారం భూగృహం భువనాశ్రకే।
శైవానామపి శాక్తానాం చక్రాణాం చ పరస్పరమ్॥
అవినాభావ సంబంధం యో జనాతి పచక్రవిత్
త్రికోణరూపిణీ శక్తిర్బిందురూపపరః శివః ॥

శ్రీచక్రము శివాశివులయొక్కశరీరము.అందులో కోణములన్నీ శక్తి చక్రాలు, బిందువు అష్టదళము, షోడశదళము, భూపురము శివచక్రాలు. శివ శక్తి చక్రాలకు అవినాభావసంబంధమున్నది. అది ఈ క్రింది విధంగా ఉంటుంది.

| | | |
|---|---|---|
| 1. త్రికోణానికి | - | బిందువుతోఐక్యము. |
| 2. అష్టకోణానికి | - | అష్టదళంతో ఐక్యము |
| 3. దశారయుగ్మముకు | - | షోడశదళముతో ఐక్యము |
| 4. భూపురత్రయముకు | - | చతుర్దశారముతో ఐక్యము. |

ఈ రకంగా శివశక్తి చక్రాల సంకేతమునెరిగిన వాడే చక్రవిదుడు. అతడే చక్రసంకేతమును తెలియగలుగుచున్నాడు. త్రికోణస్వరూపిణి శక్తి, బిందురూపుడు శివుడు. ఈవిషయం తెలియని వారికి ఎన్నిజన్మలకైనామంత్రము సిద్ధించదు. శ్రీచక్రంలోని శివశక్తి చక్రాల అవినాభావ సంబంధాన్ని భైరవయామళంలో వివరించటం జరిగింది.

త్రికోణే బైందవంశ్లిష్టమష్టారే ష్టదళాంబుజమ్।
దశారయోష్షోడశారమ్ భూగృహంభువనాశ్రకే॥

ఇదేవిషయాన్ని గౌడపాదులవారు తమసుభగోదయస్తుతిలో ఈవిధంగా అన్నారు.

"త్రికోణే వృత్తత్రితయ, మిభకోణే వసుదళం
కళాశ్రం మిత్రారే భవతి భువనాశ్రే చ భువనమ్।
చతుశ్చక్రం శైవం నివసతి భగే శాక్తికముమే
ప్రధానైక్యం షోఢాభతిచ తయోః శక్తిశివయోః॥

గౌడపాదులవారు శ్రీచక్రంలో బిందువుకు బదులుగా వృత్తత్రయాన్ని చెబుతున్నారు. మొత్తం మీద నాలుగు శివచక్రాలు, ఐదు శక్తిచక్రాలు ఉన్నాయన్నారు. అవి ఒక దానితో ఒకటి ఈవిధంగా అంతర్భావంపొందుతున్నాయి.

| | | |
|---|---|---|
| 1. త్రికోణముతో | - | వృత్తత్రయము |
| 2. అష్టకోణముతో | - | అష్టదళము |
| 3. దశారయుగ్మంతో | - | షోడశదళము |
| 4. చతుర్దశారంతో | - | భూపురము |

ఇక్కడ శక్తి త్రికోణ రూపిణి, శివుడు బిందురూపుడు ఇది అర్ధనారీశ్వరతత్త్వానికి ప్రతీక. అర్ధనారీశ్వరుడు అంటే ఒకే మూర్తిలో ఎడమభాగం దేవిఅని, కుడిభాగం ఈశ్వరుడు అనికాదు. శివశక్తులు, అప్రకృతి పురుషులు మమైకంచెందటమే అర్ధనారీశ్వర తత్త్వము. అంటే ఏదో ఒకభాగంలో కాకుండా అణువణువులోను సగభాగం స్త్రీ అయితే మిగిలినసగభాగం పురుషుడు, ఈవిషయమే శ్రీచక్రంలోని శివ, శక్తి చక్రాల ఐక్యత చెప్పటంద్వారా మరొకసారినిరూపించటం జరిగింది. ఇది భారతీయకుటుంబ వ్యవస్థకుప్రతీక.



Sri Umamaheswara Murty
శ్రీ ఉమామహేశ్వరమూర్తి

# 5. శ్రీచక్రము -వృత్తాలు

శ్రీచక్ర లేఖనంలో సంప్రదాయభేదాలనేకమున్నాయి. వాటిలోముఖ్యమైనవి వృత్తాలు. అసలు శ్రీచక్రంలో వృత్తాలున్నాయా? ఉంటేఎన్ని ఉన్నాయి? వాటిఉపయోగంఏమిటి? అనేవి మనముందు నిలచే అతిపెద్ద ప్రశ్నలు, వీటిమీదచాలమంది తాముచెప్పిందే సరైనదని, మిగిలినవన్నీ తప్పులనీ అభిప్రాయపడుతుంటారు. దీనిలో నిజానిజాలు ఎంతవరకు అవేవిషయాలు చూద్దాం.

సంప్రదాయాలను గనక ఒకసారి పరిశీలించి నట్లైతే అసలు శ్రీచక్రంలో వృత్తాలు ఎన్ని ఉండాలి అనేది మొదటి ప్రశ్న, శ్రీచక్రంలో ఉండవలసిన వృత్తాలు మూడు అని కొందరు, నాలుగు అని కొందరు చెబుతుండగా ప్రతి ఆవరణ తరువాత మొత్తం ఎనిమిది వృత్తాలవరకు శ్రీచక్రంలో గీయబడి ఉన్నాయని పుష్పగిరిపీఠ ఆస్థాన విద్వాంసులు శ్రీ ఇంద్రకంటి విశ్వనాథంగారు చెబుతున్నారు, కాని ఎక్కువ గ్రంథాలలో వృత్తాలు మూడు. అనిచెప్పటం మాత్రం జరిగింది, కాబట్టి శ్రీచక్రంలోమూడు వృత్తాలు మాత్ర మేఉంటాయని నిర్ధారించవచ్చు. అయితే ఇది కుడా సంప్రదాయాన్ని బట్టిమారుతున్నట్లుగా తెలుస్తోంది. సంప్రదాయాలలో ముఖ్యమైనవి 1 హయగ్రీవ, 2 ఆనందభైరవ,3 దక్షిణామూర్తి సంప్రదాయాలు

1 హయగ్రీవసంప్రదాయేవృత్తత్రయంనలిఖ్యతే. తత్రార్చనంనభవతి।
హయగ్రీవ సంప్రదాయంలో వృత్తత్రయంగీయబడదు. దానికి పూజలేదు.

2.ఆనంద భైరవసంప్రదాయే వృత్త త్రయం లిఖ్యతే తస్యార్చనంన భవతి.
ఆనందభైరవ సంప్రదాయంలో వృత్త త్రయం గీస్తారు. కాని దానికి పూజలేదు.

3. దక్షిణా మూర్తి సంప్రదాయేవృత్త త్రయం లిఖ్యతే, పూజ్యతే చ.
దక్షిణామూర్తి సంప్రదాయంలో వృత్త త్రయంగీస్తారు. దానికి పూజకుడా ఉంది. అయితే శ్రీచక్రంలో వృత్తాలు ఎక్కడున్నా యనేదే ప్రశ్న.

బిందుత్రికోణ వసుకోణ దశారయుగ్మ
మన్వశ్రదళ సంయుత షోడశారమ్
వృత్తత్రి భూపురయుతం పరిత శ్చతుర్ద్వాః
శ్రీచక్రమేత దుదితం పరదేవతాయాః

ఈ శ్లోకం ప్రకారము శ్రీచక్రంలో వృత్తత్రయం షోడశదళానికి, భూపురత్రయానికిమధ్యనఉన్నది.

బిందు త్రికోణ కాష్టవతారయుగ లోకకోణ వృత్తయుతం
వసుదళవృత్త, కళాదళవృత్త త్రిమహీగృహం భజే చక్రమ్॥

ఈ శ్లోకం ప్రకారము శ్రీచక్రంలో వృత్తాలు చతుర్దశారం తరువాత ఒకటి, అష్టదళం తరువాత ఒకటి, షోడశదళం తరువాత ఒకటి ఉన్నాయి.శంకరభగవత్పాదులవారు సౌందర్యలహరిలో

చతుర్భి శ్రీకణ్ఠై శ్శివయువతిభిః పఞ్చభిరపి
ప్రభిన్నాభి శ్శమ్భో ర్నవభిరపి మూలప్రకృతిభిః
చతుశ్చత్వారింశ ద్వసుదళ కలాశ్రత్రివలయ
త్రిరేఖాభి స్సార్థం తవ శరణకోణాః పరిణతాః॥

శ్రీచక్రాన్ని వివరిస్తూ షోడశారముతరువాతనే వృత్తత్రయం ఉండాలని తీర్మానించారు. శ్రీవిద్యకు మూలపురుషుడుగా చెప్పబడే గౌడపాదాచార్యులవారుతమ సుభగోదయస్తుతిలో,

త్రికోణైరష్టారం త్రిభిరపి దశారం సముదభూ
ర్ధశారం భూ గేహాదపిచ భువనాశ్రం సమభవత్
తతో 2భూన్నాగారం నృపతిదల మష్టా స్త్రివలయం
చతుర్ద్వాః ప్రాకారత్రితయ మిదమేవాంబ శరణమ్॥

ఈ శ్లోకంప్రకారము శ్రీచక్రంలో త్రికోణము, అష్టకోణము, దశారయుగ్మము, చతుర్దశారము అనేవిశక్తి చక్రాలు కాగా అష్టదళము, షోడశదళము, వృత్తత్రయము భూపురము అనేవి శివచక్రాలు. ఇక్కడ వృత్తత్రయము షోడశదళము తరువాతనే ఉన్నది.

'కామకలావిలాసము" లోని 34వసూత్రంలో వృత్త భూపురాలను వివరిస్తూ

బిందుత్రయమయ తేజస్త్రితయ వికారస్థితాని వృత్తాని,
భూబింబత్రయమేతత్పశ్యంత్యాది త్రిమాతృ విశ్రాంతిః ॥

శ్రీచక్రోద్ధారకశ్రుతిలో "వృత్తత్రయంచ ధరణీసదనత్రయంచ" అనిచెప్పబడింది శ్రీచక్రలేఖనం లో షోడశదళకమలంతరువాత వృత్తత్రయము, తరువాత భూపురత్రయముగీయట మనేది శిష్టపరంగా ఉన్నది.

కొంతమంది వృత్తాలు విడివిడిగా ఉంటాయని, అలాగనక లేకపోయినట్లైతే అష్టదళము, షోడశదళములనుగీయటంసాధ్యంకాదని, అందుచేత వృత్తాలు విడివిడి గానేఉండాలని వాదిస్తున్నారు కాని ఇదిసరికాదు. కామకలావిలాసంలో వృత్తత్రయాన్నిగీయటాన్నే ఇక్కడ 'వృత్తాని' అనటంజరిగింది. ఈ వృత్తత్రయము పశ్యంతి రూపమైన యోనిచక్రస్థ కోణబిందువగు రక్త,శుక్ల, మిశ్ర బిందువులతేజస్సు, సూర్యచంద్రాగ్ని మండలములు ఈవృత్తత్రయంగా ఉన్నాయని చెప్పబడింది.

పైశ్లోకాలు పరిశీలించినట్లైతే శ్రీచక్రంలోని వృత్తత్రయము షోడశదళం తరువాతనే ఉందని కొందరు, కాదు మూడువృత్తాలు విడివిడిగా ఉన్నాయని కొందరుచెప్పినట్లుగా

తెలుస్తోంది. ఈవాదనలకు తంత్రాలు కుడా కొంతవరకుదోహదం చేశాయి. శ్రీచక్రాన్నిమానవదేహంతో పోల్చేటప్పుడు వృత్తత్రయాన్ని గురించెప్పటంజరిగింది. వృత్తత్రయం చ ఊరుభ్యాం పద్భ్యాం భూపురత్రయమ్" అనిచెప్పటం వల్ల శ్రీచక్రంలోని వృత్తత్రయము మానవదేహంలోని ఊరుద్వయంతో పోల్చబడింది. అంటే మూడు వృత్తాలు ఒకచోట ఉన్నాయన్న మాట. కాని వేరొకతంత్రంలో ఈ రకంగా చెప్పబడింది.

కుక్షౌతు ప్రథమవృత్తం, నాభ్యామష్టదళాంబుజమ్
కట్యాంద్వితీయవలయం, స్వాధిష్ఠానేకలాశ్రకమ్
తస్యాధస్తాత్ తృతీయం, మూలాధారే చతురస్రకం

| | | |
|---|---|---|
| కుక్షిభాగము | - | ప్రథమవృత్తము |
| నాభి | - | అష్టదళము |
| కటిభాగము | - | ద్వితీయవృత్తము |
| స్వాధిష్ఠానము | - | షోడశదళము |
| స్వాధిష్ఠానంక్రింద | - | తృతీయవృత్తము |
| మూలాధారము | - | చతురస్ర ప్రథమరేఖ |

దీనినిబట్టి మూడువృత్తాలు విడివిడిగా అష్టదళముపైన ఒకటి, అష్టదళము తరువాత ఒకటి, షోడశదళము తరువాత ఒకటి ఉన్నాయని తెలుస్తోంది.

అలాగే శ్రీచక్రాన్ని షట్చక్రాలతో సమన్వయ పరచేటప్పుడు గ్రంథిత్రయాన్ని వృత్తత్రయంతోపోల్చటంజరిగింది. పంచదశీమహామంత్రంలోని హ్రీంకారాలు గ్రంథిత్రయంతోపోల్చ బడ్డాయి. గ్రంథిత్రయము వృత్తత్రయంతో పోల్చబడింది. గ్రంథిత్రయంకాని, వృత్తత్రయంకాని ఒకచోటకాకుండా విడివిడిగా ఉంటాయి కాబట్టి శ్రీచక్రంలో వృత్తత్రయంకుడా విడివిడిగా ఉండాలనేది వీరి వాదన. ఇవన్నీ సంప్రదాయభేదాలు. అయితే కొంతమంది మాత్రం ఇదితప్పు అని మొండిగావాదిస్తూ, తమవాదనకు బలంచేకూరటానికి అనేకనిదర్శనలు శాస్త్రపరమైనవికూడా చెబుతున్నారు, ఇక్కడగుర్తించవలసిన విషయం ఏమంటే ప్రతివాదన కీతగిన ఆధారం ఉంటుంది, కాబట్టి శుష్కవాదనలు కట్టిపెట్టి,భిన్న సంప్రదాయాలున్నపుడు గురు సంప్రదాయాన్నేపాటించాలనే ఆర్యోక్తిని అనుసరించాలి.

శ్రీచక్రంలో వృత్తాలు ఎన్ని ఉన్నప్పటికీ అవి ఎక్కడ ఉన్నప్పటికీ ఒక్క గౌడ పాదులుతప్ప, మిగిలినవారెవరూ వాటిని నవావరణలలోచేర్చలేదు, వాటికిపూజలేదు, చాలాగ్రంథాలలో చక్రసంజ్ఞ కూడా ఇవ్వబడలేదు. అందుచేత వృత్తాలను శ్రీచక్రనిర్మాణంలో ఒక భాగంగానే గుర్తించాలి. బహుశః ఆయాచక్రాలలో ఉండే దేవతల పరిధి, నిర్ణయించి

ఉంచటానికే ఈవృత్తాలు ఏర్పరచి ఉంటారని పుష్పగిరి పీఠ ఆస్థాన విద్వాంసులు శ్రీ ఇంద్రకంటి విశ్వనాథంగారు అంటున్నారు. కాని శ్రీచక్రంలోని మూడు వృత్తాలు, పంచదశీ మహామంత్రంలోని మూడు హ్రీంకారాలకు ప్రతీకలుగా చెప్పబడుతున్నాయి. శ్రీవిద్యకు ప్రస్థానత్రయంగా చెప్పబడే

1. సౌభాగ్య భాస్కరము (లలితాసహస్రనామావళికివ్యాఖ్య)

2. వరివస్యారహస్యము

3. సేతుబంధము. లనువ్రాసిన భాసురానందులవారు తమ 'వరివస్యారహస్యము' అనేగ్రంథంలోని 99,100 శ్లోకాలలో శ్రీచక్రము, పంచదశీమహామంత్రమునుండి పుట్టింది అన్నారు.

> కత్రితయాదీ కారాద్బిందుర్జాత స్త్రిగ్రః మేచక్రే
> హృల్లేఖాభిస్త్రిగ్ర చక్రత్రితయం హకారాభ్యామ్॥
> ఏకారేణచ తత్పరచక్రే జాతే సకారాభ్యామ్
> చతురశ్రాణి లకారై రేవం విద్యాక్షరేణ చక్రవిః॥ ।

పంచదశీ మహామంత్రము (శ్రీవిద్య) నందలి

| | | |
|---|---|---|
| 1. మూడు క కారములు, ఈకారమువలన | - | శ్రీచక్రంలోని బిందువు, |
| 2. మూడుహ్రీంకారములవలన | - | త్రికోణము, అష్టకోణము |
| 3. రెండు లకారములు,ఏకారమువలన | - | అంతర్దశారము, బహిర్దశారము, చతుర్దశారము |
| 4. రెండుసకారములవలన | - | అష్టదళము, షోడశదళము |
| 5. మూడులకారములవలన | - | భూపురత్రయముపుట్టినాయి. |

ఇక్కడవృత్తత్రయము దేనివలన పట్టినదనేవిషయం చెప్పలేదు.

ఈ రకంగా శ్రీచక్రంలోని వృత్తత్రయం మీదభిన్నాభి ప్రాయాలున్నాయి. అవి నవావరణలో చేర్చబడలేదు, వృత్తక పూజకూడా లేదు. అందుచేత, వాటిమీదచర్చకు తావియ్యకుండా, ఈవిషయంలో గురుసంప్రదాయాన్ని పాటించటమే ఉచితంది.



# 6 శ్రీచక్రము - బిందువు

శ్రీచక్రంలో ప్రధానమైనది బిందువు. ఇది తొమ్మిదవ ఆవరణ అయిన సర్వానందమయ చక్రం. ఇక్కడ శివశక్తులు విహరిస్తూ ఉంటాయి. 'యోగినీ హృదయంలో' త్రికోణంలో బిందువున్నదని చెప్పబడింది. పరాపశ్యంతులు బిందుత్రికోణాలుగా ఉన్నాయి "త్రికోణరూపిణీ శక్తిః బిందురూప పరశ్శివః "అనిచెప్పటంవల్లరెండూప్రకాశవిమర్శాంశలుగా ఉన్నాయి 'లలితాత్రిశతి' ఫలశ్రుతి భైరవయామళము వంటిగ్రంథాలలో "త్రికోణే బైందవంశ్లిష్టమష్టారేష్టదళాంబుజమ్॥ అనిచెప్పబడింది. అంటే బిందువు త్రికోణంలో ఉన్నదని అర్థం. ఈ విషయం అందరూ అంగీకరిస్తున్నారు. కౌళసమయాచారాల్లో అర్చనా భేదంమాత్రమేఉన్నది, కాని బిందువుమాత్రంత్రికోణంలోనే ఉన్నది. అయితే లొల్లా లక్ష్మీధరులు మాత్రం శ్రీచక్రలేఖనంలోనే భేదం చెబుతున్నారు. వీరిమతానుసారం కౌళాచార సంప్రదాయంలో బిందువు త్రికోణంలో ఉంటుంది కాని సమయమతానుసారము బిందువుచతుష్కోణము లేదా షట్కోణములో ఉంటుంది. దీనికి కారణము, బిందువుచంద్రమండలంలో ఉంటుంది, ఆచంద్ర మండలం చతుష్కోణాకారంలో ఉంటుంది అన్నారు. అయితే భాస్కరరాయలవారితోపాటుగా మిగిలిన వారందరూ కౌళసమయాచారాల్లో బిందువుత్రికోణంలోనే ఉన్నదని అంగీకరిస్తున్నారు మరి ఆత్రికోణంఎక్కడ ఉంటుంది?

దేవీపూజలో కౌళసమయాచారాలున్నాయని ముందేచెప్పటంజరిగింది. కౌళాచారులు చతుర్విధపురుషార్థాలలోను అర్థకామాలకే ప్రాధాన్యమునిస్తారు వీరికి పారమార్థికదృష్టి లేదు. షట్చక్రాలలో ఆధారస్వాధిష్ఠానాలయందే వీరు దేవినిపూజిస్తారు, వీరిలో ఒకతెగవారు ప్రత్యక్ష త్రికోణాన్ని పూజిస్తారు. అంటే స్త్రీయోనిని ప్రత్యక్షత్రికోణంగాభావిస్తారు. అందులో ఉన్న మన్మథ చక్రమే బిందువు అని వీరి నమ్మకం అందుకే వీరి పూజ, ఆచారాలు అవైదికములు నీతి బాహ్యములు. వీరి మతానుసారము ఆధారచక్రంలోనేత్రికోణమున్నది. శ్రీచక్రాన్ని షట్చక్రాలతో అనుసంధానం చేసేప్పుడు భైరవయామళంలోఈ విధంగాచెప్పబడింది.

త్రికోణమష్టకోణంచ దశకోణద్వయంతథా।
మనుకోణంచతుష్కోణం చ కోణచక్రాణిషట్క్రమాత్॥
మూలాధారం తథాస్వాధిష్ఠానం చమణిపూరికమ్।
అనాహతం విశుద్ధాఖ్యా మాజ్ఞాచక్రం విదుర్బుధాః॥

శ్రీచక్రంలోని త్రికోణము మొదలైన చక్రాలు మూలాధారము మొదలైన షట్చక్రాలతో అంతర్భావంపొందుతున్నాయి. గౌడపాదుల వారు తమసుభగోదయస్తుతిలో

త్రికోణందాధారంత్రిపుర విమతేష్వార మనఘే
భవేత్స్వాధిష్ఠానం పునరపి దశారం మణిపురమ్
దశారం తే సంవిత్కమల మథ మన్వస్రకముమే
విశుద్ధం స్యాదాజ్ఞాశివఇతి తతో బైందవగృహమ్॥

దీనిని బట్టి శ్రీచక్రము - షట్చక్రాలఐక్యత ఈవిధంగాఉన్నది.

1. ఆధారచక్రానికి - త్రికోణంతోఐక్యత
2. స్వాధిష్ఠానానికి - అష్టకోణంతోఐక్యత
3. మణిపూరానికి - అంతర్దశారంతో ఐక్యత
4. అనాహతానికి - బహిర్దశారంతో ఐక్యత
5. విశుద్ధచక్రానికి - చతుర్దశారంతో ఐక్యత
6. ఆజ్ఞాచక్రానికి - అష్టదళము, షోడశదళములతో ఐక్యత
7. సహస్రారానికి - భూపురంతోఐక్యత

దీనినిబట్టి ఆధారచక్రంలోనే త్రికోణమున్నదనితెలుస్తోంది, కౌళాచారులు ఆధారస్వాధిష్ఠానాలతరువాతనేబ్రహ్మగ్రంథిని చెబుతారు.

సమయాచారులది పారమార్థికదృష్టి. జ్ఞానము, వైరాగ్యము, జన్మరాహిత్యము అనేవి వీరిప్రధాన లక్ష్యాలు. వీరి మతంప్రకారము బిందువు బ్రహ్మరంధ్రంలోనే ఉంటుంది.

'బైందవం బ్రహ్మరంధ్రంచ మస్తకంచ త్రికోణకమ్' అనటంచేత బ్రహ్మరంధ్రమందు బిందువు ఉన్నదని మస్తకమేత్రికోణమని చెప్పబడుతోంది. "శ్రీచక్రంబ్రహ్మరంధ్రేతు, సవృత్తంచత్రికోణకమ్" బ్రహ్మరంధ్రంలోనే బిందువు, త్రికోణము ఉన్నాయి. వీరి మతానుసారము ఆజ్ఞాచక్రానికిపైభాగాన బ్రహ్మగ్రంథిఉంటుంది. ఇదే చంద్రమండలం. సమయాచారులలో కొంత మంది ప్రకారము చంద్రమండలం వృత్తాకారంలో ఉంటుంది. కాబట్టి బిందువు వృత్తంలో ఉంటుంది.ఈవిధంగా శ్రీచక్రంలోని బిందువు త్రికోణంలో ఉన్నదని, చతుష్కోణంలో ఉన్నదని, వృత్తంలోఉన్నదని, భిన్నవాదనలు,సంప్రదాయాలు ఉన్నాయి. ఈరకంగా భిన్నసంప్రదాయాలున్నప్పుడు గురుసంప్రదాయాన్ని మాత్రమేపాటించాలని ఆర్యోక్తి.

***బిందువేశివచక్రమా?***

శ్రీచక్రంలో నాలుగుశివ చక్రాలు, ఐదు శక్తి చక్రాలు ఉన్నాయని అన్ని గ్రంథాలలోను చెప్పబడింది. భైరవయామళంలో చెప్పినట్లుగా

త్రికోణమష్టకోణంచ దశకోణద్వయంతథా
చతుర్దశారం చైతాని శక్తిచక్రాణిపంచచ:

త్రికోణము,అష్టకోణము దశారయుగ్మము, చతుర్దశారము అనేఐదుశక్తి చక్రాలు

బిందుశ్చాష్టదళంపద్మం, పద్మంషోడశపత్రకమ్
చతురస్రంచ చత్వారి, శివచక్రాణ్యమక్రమాత్॥

బిందువు అష్టదళము, షోడశదళము, భూపురము అనేనాలుగు శివచక్రాలు. దాదాపుగా అన్ని గ్రంధాలలోనూ శివశక్తి చక్రాలుఒకేరకంగాఉన్నాయి. కాని గౌడపాదుల వారు తమ సుభగోదయస్తుతిలో ఈవిధంగా అన్నారు.

త్రికోణైరష్టారం త్రిభిరపిదశారం సముదభూ
ర్దశారం భూగేహోదపిచ భువనాశ్రం సమభవత్ ॥
తతో 2భూన్నాగారం నృపతిదలమష్టా త్రివలయమ్
చతుర్ద్వాః ప్రాకారత్రితయమిదమేవాంబ శరణమ్॥

త్రికోణము, అష్టకోణము, దశారయుగ్మము,చతుర్దశారము అనే ఐదు శక్తిచక్రాలు. అష్టదళము, షోడశదళము, వృత్తత్రయము భూపురము అనే నాలుగు శివచక్రాలు. శ్రీవిద్యకు మూలగ్రంథంగా చెప్పబడే సుభగోదయస్తుతిలో శివచక్రాలు చెప్పేటప్పుడు వాటిలో బిందువుకు బదులుగా వృత్తత్రయము చెప్పటం జరిగింది. అలాగే శివ శక్తి చక్రాల ఐక్యము చెప్పేటప్పుడు

త్రికోణేతు వృత్తత్రితయ మిభకోణే వసుదళం
కలాశ్రం మిశ్రారే భవతి భువనాశ్రే చ భువనమ్
చతుశ్చక్రం శైవం వివసతి భగే శాక్తికముమే
ప్రధానైక్యం షోఢా భవతి చ తయోః శక్తి శివయోః ॥

| | | |
|---|---|---|
| 1. త్రికోణంతో | - | వృత్తత్రయము ఐక్యత |
| 2. అష్టకోణంతో | - | అష్టదళము ఐక్యత |
| 3. దశారయుగ్మముతో | - | షోడశదళము ఐక్యత |
| 4. చతుర్దశారంతో | - | భూపురము ఐక్యత పొందుతున్నాయి. |

అని చెప్పటం జరిగింది. అంటే గౌడపాదులవారి ప్రకారము శ్రీచక్రములో బిందువులేదు. బిందువు స్థానంలో వృత్తత్రయము చెప్పబడింది.

ఈరకంగా చూచినట్లయితే భూపురము, వృత్తత్రయము, షోడశదళము, అష్టదళము అనబడే శివచక్రాలు వెలుపల,కోణరూపంలో ఉన్న శక్తి చక్రాలు లోపల ఉన్నాయి. ఈ రకంగా శివచక్రాలు వెలుపల, శక్తి చక్రాలు లోపల విడివిడిగా ఉండటం శాస్త్ర సమ్మతం కాదు.

అందుచేత శివచక్రాల యొక్క శక్తిని బిందువులో నిక్షిప్తంచేసి, ఆ బిందువును త్రికోణం మధ్య లో ఇమర్చటం జరిగింది. దీనివల్ల శివశక్తి చక్రాలు వేరువేరుగా ఉండే దోషం

పోయిందని కొందరి వాదన. ఈ విధంగా జరిగినట్లయితే బిందువుని ఏమని పిలవాలి? ఒకవేళ శివ చక్రాలకు బిందువు ప్రతీక అయినట్లయితే, బిందువు తో కలసి శివచక్రాలు ఐదుకావాలి లేదా, బిందువు ఒక్కటే శివచక్రం కావాలి. అప్పుడు శ్రీచక్రంలోని ఆవరణలు తొమ్మిదికావు.

శంకరభగవత్పాదులవారు శ్రీచక్రంలోని వృత్తాలకు ప్రతీకగా బిందువును ఏర్పాటుచెయ్యటం జరిగింది అన్నారు. దీనివల్ల రెండు వైపులా శివచక్రాలు, మధ్యన శక్తి చక్రాలు ఉంటాయి. అనగా శక్తి చక్రాలకు ఒకవైపున బిందురూపంలో ఒకటి, రెండవవైపున అష్టదళము, షోడశదళము, భూపురత్రయము శివశక్తులు ఉంటాయి. దీనివల్ల శివశక్తి చక్రాలు విడివిడిగా ఉండే దోషం పోయింది. ఈ విషయాన్ని శ్రీవిద్యలో నిష్ణాతులుగా చెప్పబడే లక్ష్మీధరులు, భాస్కరరాయలు మొదలైనవారందరూ అంగీకరిస్తున్నారు.

అయితే శివచక్రంగా చెప్పబడిన వృత్తత్రయం మాట ఏమిటి? వృత్తత్రయానికి బదులుగా బిందువు ఏర్పాటు చేయబడి, నవావరణలలోకూడా చేర్చబడింది. కాబట్టి వృత్తత్రయానికి చేసే పూజ బిందువుకు జరుగుతోంది. వృత్తత్రయం మాత్రం శ్రీచక్రంనుంచి తొలగించబడలేదు. వాటికి అర్చనమాత్రం లేదు.

అయితే ఈ వృత్తత్రయాన్ని పంచదశిమహామంత్రంలోని మూడు హ్రీంకారాలకు, షట్చక్రాలలోని గ్రంధి త్రయానికి ప్రతీకగాచెప్పటం జరిగింది. ఈ విషయాన్ని లక్ష్మీధరులు, భాస్కరాచార్యులు మొదలైనవారందరూకూడా అంగీకరించటం జరిగింది.

# 7. పరదేవత - గణేశాది రూపాలు

గణేశ, గ్రహ, నక్షత్ర, యోగినీ,రాశిరూపిణీమ్
దేవీం మంత్రమయీం, నౌమి, మాతృకాపీఠరూపిణీమ్॥

గణేశరూపిణి, నవగ్రహరూపిణి, నక్షత్రరూపిణి, యోగినీరూపిణి, రాశిస్వరూపిణి, సకలమంత్రరూపిణి, మాతృకాపీఠరూపిణి అయిన దేవికి నమస్కరించుచున్నాను.

పరదేవత, శ్రీవిద్య, శ్రీచక్రము, గురువు, సాధకుడు ఈ ఐదుగురు ఒక్కటే. ఈ సృష్టికి బ్రహ్మమునకు భేధము లేదు . వీరందరు ఒకే జాతి వారు అని చెప్పవచ్చు. వీరందరు ఒకే అమ్మలపాదిలోని బాణాల లాగా సజాతీయులు, సమాన ధర్మాలు కలవారు. ఆ సమానధర్మాలు ఏవి అంటే గణేశ, గ్రహ, నక్షత్ర, యోగినీ, రాశి, పీఠరూపాలు. వీటిలో పంచదశీమహామంత్రానికి, శ్రీచక్రానికి గల గణేశాది రూపాలను నాచేవ్రాయబడిన శ్రీవిద్యాదర్పనము అనే గ్రంథంలో వివరించటం జరిగింది. ఇక్కడ పరదేవతయొక్క సామ్యాలను వివరిస్తున్నాము. భాస్కరరాయలవారు తమ వరివశ్యారహస్యము అనే గ్రంథం లో ఈ విషయాలు వివరించారు.

1. గణేశరూపము :

మాతా నిరుపమ తేజోమయ్యాః స్వస్యా మరీచీరూపాణామ్।
ఆవరణ దేవతానా మీశత్వా దుచ్యతే గణేశీతి॥

దేవి నిరుపమతేజోమయి.ఆమె తన గణాలకు, ఆవరణదేవతలకు అధిపతి కాబట్టి ఆమె గణేశి అని చెప్పబడుతున్నది.

2. గ్రహరూపము :

ఇచ్ఛా 22 ద్విత్రిసమిష్టి ర్గుణ త్రయాఢ్యా2 నలేన్దు రవినేత్రా।
ఏవం నవభిర్యో గాద్ గ్రహరూపే త్యుచ్యతే మాతా॥

దేవి శక్తిస్వరూపిణి. ఆశక్తులుమూడు. 1 ఇచ్ఛా2జ్ఞాన 3క్రియాశక్తులు. సత్వరజస్తమోగుణాలు మూడుగుణములు కలది. సోమసూర్యాగ్నులను మూడునేత్రములుగాకలది. ఈతొమ్మిదికిగ్రహత్వమున్నది కాబట్టి దేవినవగ్రహరూపిణి అవుతోంది. త్రిశక్తులు అంటే దేవిశరీరంలో

| | | |
|---|---|---|
| ఇచ్ఛాశక్తి | - | శిరస్సు |
| జ్ఞానశక్తి | - | మధ్యభాగము |
| క్రియాశక్తి | - | పాదములు. |

బ్రహ్మము విశిష్టమైన గుణములుకలిగి ఉంటుంది. అగుణములే అవయవాలు. అవేసత్వ రజస్తమోగుణాలు. దేవిమాతృకావర్ణరూపిణి అని ముందే చెప్పబడింది. భాషకు ఉన్న అక్షరాలన్నీ నవగ్రహాలకు సంకేతాలు. అవి ఈవిధంగా ఉన్నాయి.

| అక్షరాలు | | గ్రహాలు |
|---|---|---|
| 1. అనుంచి అః వరకు (అచ్చులు) 16 | - | 1. సూర్యగ్రహస్వరూపము |
| 2. కవర్గ (5 అక్షరాలు) | - | 2. కుజగ్రహస్వరూపము |
| 3. 'చ'వర్గ(5 అక్షరాలు) | - | 3. బుధగ్రహ స్వరూపము |
| 4. 'ట'వర్గ(5అక్షరరాలు) | - | 4. గురుగ్రహ స్వరూపము |
| 5. 'త'వర్గ (5అక్షరాలు) | - | 5. శుక్రగ్రహస్వరూపము |
| 6. 'ప'వర్గ (5అక్షరాలు) | - | 6. శనిగ్రహస్వరూపము |
| 7. యరలవ(4అక్షరములు) | - | 7. చంద్రగ్రహస్వరూపము |
| 8. శషసహ(4అక్షరములు) | - | 8. రాహుగ్రహస్వరూపము |
| 9. క్షకారము(ఒకఅక్షరము) | - | 9. కేతుగ్రహస్వరూపము |
| మొత్తం అక్షరమేలు యాభై | - | గ్రహాలు తొమ్మిది. |

సంస్కృతభాషకు అక్షరాలు యాభై. 'ల,ళ యోరభేదః' అనిచెప్పటంచేత సంస్కృతభాషలో 'ళ' కారములేదు, కానికొన్నిచోట్ల ళకారమును కూడా పరిగణనలోకి తీసుకుని అక్షరాలు యాభై ఒకటి అనివ్రాయటం జరిగింది. ఇలా వ్రాసినప్పుడు ళ కారము చంద్రగ్రహస్వరూపని కొందరు, కేతు గ్రహస్వరూపమని కొందరు వ్రాశారు. ఆవివరాలు ఈవిధంగా ఉన్నాయి

| .అక్షరములు | సేతుబంధముప్రకారము గ్రహస్వరూపము | అర్థరత్నావళిప్రకారము గ్రహస్వరూపము |
|---|---|---|
| 1. అచ్చులు | సూర్యగ్రహము | సూర్యగ్రహము |
| 2. కవర్గ | కుజగ్రహము | కుజగ్రహము |
| 3. చవర్గ | బుధగ్రహము | బుధగ్రహము |
| 4. టవర్గ | గురుగ్రహము | గురుగ్రహము |
| 5. తవర్గ | శుక్రగ్రహము | శుక్రగ్రహము |
| 6. పవర్గ | శనిగ్రహము | శనిగ్రహము |
| 7. యరలళవ | చంద్రగ్రహము | |
| యరల వ | | చంద్రగ్రహము |

| | | |
|---|---|---|
| 8. శషసహ | రాహుగ్రహము | రాహుగ్రహము |
| 9. క్ష | కేతుగ్రహము | - |
| శక్ష | | కేతుగ్రము |

ఈవిధంగా దేవిమాతృకావర్ణరూపిణి. మాతృకలుగ్రహస్వరూపాలు. అందుచేత దేవికి గ్రహత్వం వచ్చింది.

3. నక్షత్రస్వరూపము:

ఇన్ద్రియదశకే నాన్తఃకరణ చతుష్కేణ :యద :శకేన।
ప్రకృతి, పురుష గుణ తత్త్వైశ ' నక్షత్రరూ' మా 'తా॥

దేవిశరీరంలో ఉన్న

| | | |
|---|---|---|
| జ్ఞానేంద్రియాలు (కన్ను,ముక్కు,నాలుక, చెవి, చర్మము) | - | 5 |
| కర్మేంద్రిములు (కాలు,చేయి, వాక్కు, పాయు,ఉపస్థ) | - | 5 |
| తన్మాత్రలు (శబ్ద,స్పర్శ,రూప,రస,గంధాలు) | - | 5 |
| వచనాదులు (వచన,దాన,గమన,విసర్గ,ఆనంద) | - | 5 |
| అంతఃకరణ (మనస్సు,బుద్ధిత్తము,( అహంకారము) | - | 4 |
| తత్త్వములు (ప్రకృతి, పురుష,గుణ) | - | 3 |
| ఇవిమొత్తం | - | 27 |

నక్షత్రాలు ఇరవైఏడు. కాబట్టి దేవినక్షత్రరూపిణి అనిచెప్పబడింది.

దేవి మాతృకావర్ణ రూపిణి. మాతృకలు నక్షత్రాలకు సంకేతాలు. ఆవివరాలు దిగువ ఇవ్వబడినాయి,

| మాతృకలు (అక్షరములు) | నక్షత్రాలు |
|---|---|
| 1. అ ఆ | అశ్వనీ నక్షత్రం |
| 2 ఇ | భరణీ న:త్రము |
| 3. ఈ ఉ ఊ | కృత్తికా నక్షత్రము |
| 4. ఋ, ౠ, | రోహిణీ నక్షుము |
| 5. ఏ | మృగశిరాక్షత్ర: ము |
| 6. ఐ | ఆర్ద్రా న:త్రము |
| 7. ఓ ఔ | పునర్వసుక్షత్ర: ము |
| 8. క | పుష్యమీ నక్షత్రము |
| 9. ఖ గ | ఆశ్లేషా నక్షత్రము |
| 10. ఘ ఙ | మఖక్షత్ర: ము |

| | |
|---|---|
| 11. చ | పుబ్బ,(పూర్వఫల్గుణీ) నక్షత్రము |
| 12. ఛజ | ఉత్తర(ఉత్తరఫల్గుణీ) నక్షత్రము |
| 13. ఝ ఞ | హస్త నక్షత్రము |
| 14. ట ఠ | చిత్రా నక్షత్రము |
| 15. డ | స్వాతి నక్షత్రము |
| 16. ఢ ణ | విశాఖా నక్షత్రము |
| 17. త థ ద | అనూరాధా నక్షత్రము |
| 18. ధ | జ్యేష్ఠా నక్షత్రము |
| 19 న ప ఫ | మూలా నక్షత్రము |
| 20. బ | పూర్వాషాఢా నక్షత్రము |
| 21. భ | ఉత్తరాషాఢా నక్షత్రము |
| 22. మ | శ్రవణా నక్షత్రము |
| 23. య,ర | ధనిష్ఠా నక్షత్రము |
| 24. ల | శతభిషము నక్షత్రము |
| 25. వ శ | పూర్వాభాద్రా నక్షత్రము |
| 26. ష స హ | ఉత్తరాభాద్రా నక్షత్రము |
| 27. అం, అః, ళ, క్ష | రేవతీ నక్షత్రము |

ఈవిధంగా మాతృకలకు, నక్షత్రాలకు సంబంధము ఉండటం చేత దేవినక్షత్రరూపిణి అని అర్థరత్నావళియందు చెప్పబడింది.

*4. యోగినీ రూపము:*

వరపతి రవికాష్ఠా షట్సముద్ర ద్వీపంక్త్యై॥
రకడబవహ పూర్వై రక్షరైర్వ్యే స్థితాభిః॥
డరలకసహవర్ణా డాకినీ భిన్న షడ్భి।
ర్లలిత తమరితియా కథ్యతే యోగినీతి॥

దేవిశరీరము డాకినీ, రాకినీ మొదలైన యోగినుల సముదాయమై ఉన్నది. దేహంలో ఉండే షట్చక్రాలలోనూ అకారాది క్షకారాంతము అక్షరాలున్నాయని చెప్పటం జరిగింది వాటిలో వజ్రేశ్వరి మొదలైన దేవతలుంటారు. వారిని డాకినీ, రాకినీ మొదలైన యోగినులు గాపిలుస్తారు. ఈదేవతలు సప్తధాతువులకు ప్రతీకలు. ఆవివరాలు ఈదిగువ ఇవ్వబడినాయి

| చక్రముపేరు | అక్షరాలు | దేవతపేరు | యోగినిపేరు | ధాతువు పేరు. |
|---|---|---|---|---|
| 1. విశుద్ధ చక్రము | అనుంచిఅ:వరకు 16 | వజ్రేశ్వరి | డాకినీ | త్వక్ (చర్మము) |
| 2.అనాహత చక్రము | కనుంచి ఠ వరకు 12 | భానుదేవి | రాకినీ | రుధిరము |
| 3. మణిపూరకము | డనుంచి ఫవరకు 10 | వయోవస్థావిన్యాసి | లాకినీ | మాంసము |
| 4. స్వాధిష్ఠానము | బ నుంచి లవరకు 6 | సిద్ధేశ్వరి | కాకినీ | మేదస్సు |
| 5. మూలాధారము | వనుంచి సవరకు 4 | సిద్ధవిద్యా | సాకినీ | ఎముకలు |
| 6. ఆజ్ఞాచక్రము | హ ళ 2 | సిద్ధమాతా | హాకినీ | మజ్జ |
| 7. సహస్రారము | అనుంచి క్ష వరకు50 | యశస్విని | యాకినీ | శుక్లము |

షట్చక్రాలలో ఉన్న దళాలలో పైనచెప్పిన అక్షరాలతో ప్రారంభమయ్యే పేర్లు కలశక్తులు ఉండగా, ఆచక్రముమధ్యన పైనచెప్పిన దేవత ఉంటుంది. ఆదేవతను అక్కడ చూపిన యోగిని పేరుతో పిలుస్తారు, ఈవివరాలు 'అంతర్యాగము'లో వివరించబడ్డాయి. ఈరకంగా ఉన్నసప్తయోగినులు ఆదేవిస్వరూపాలేకాబట్టి దేవికి యోగినీస్వరూపము చెప్పడింది.

అయితే యోగినులు డాకినీ మొదలైనవారు కాదు బ్రహ్మీ, మాహేశ్వరీ మొదలైన మాతృకలే యోగినీరూపాలు అని ఇంకొక వాదన ఉన్నది.

అక్షరాలకు బ్రాహ్మీ మొదలైన మాతృకారూపముచెప్పబడింది. అది ఈక్రింది విధంగా ఉంటుంది.

| అక్షరవర్ణులు | యోగినీ రూపము |
|---|---|
| 1. అవర్గ | బ్రాహ్మీయోగినీ |
| 2. కవర్గ | మాహేశ్వరీయోగినీ |
| 3. చవర్గ | కౌమారీ యోగినీ |
| 4. టవర్గ | వైష్ణవీ యోగినీ |
| 5. తవర్గ | వారాహీ యోగినీ |
| 6. పవర్గ | మాహేంద్రీ యోగినీ |
| 7. యవర్గ | చాముండా యోగినీ |
| 8. శవర్గ | మహలక్ష్మీ యోగినీ |

ఈయోగినులంతా దేవిస్వరూపాలే కాబట్టి దేవికి యోగినీ రూపంచెప్పబడింది.

*5. రాశిస్వరూపము :*

పంచభిర్నాగకూర్మాద్యైః ప్రాణాపానాది పంచభిః।
జీవాత్మ పరమాత్మాభ్యాం సైషా రాశి స్వరూపిణీ ॥

వాయువులు రెండు రకాలు. అవి 1. ప్రధాన వాయువులు 2. ఉపవాయువులు.

ఇవి ఒక్కొక్కటి ఐదురకాలు. వెరసిపది. జీవాత్మ పరమాత్మ. లతోకలిపిమొత్తం పన్నెండు. రాశులు పన్నెండు. కాబట్టి దేవికి రాశిస్వరూపంచెప్పబడింది. వాటివివరాలు ఈవిధంగా ఉన్నాయి.

| వాయువుపేరు | రాశిపేరు |
|---|---|
| ప్రధానవాయువులు 5 | |
| 1. ప్రాణవాయువు | మేషరాశి |
| 2. అపానవాయువు | వృషభరాశి |
| 3. వ్యానవాయువు | మిధునరాశి |
| 4. ఉదాన వాయువు | కర్కాటక రాశి |
| 5. సమానవాయువు | సింహరాశి |
| ఉపవాయువులు 5 | |
| 6. నాగవాయువు | కన్యారాశి |
| 7. కూర్మవాయువు | తులారాశి |
| 8. కృకరవాయువు | వృశ్చికరాశి |
| 9. దేవదత్తము | ధనూరాశి |
| 10. ధనుంజయము | మకరరాశి |
| 11. జీవాత్మ | కుంభరాశి |
| 12. పరమాత్మ | మీనరాశి |

ఈ రాశులకు అక్షరస్వరూపాలు కుడా చెప్పబడినాయి. అవి ఈవిధంగా ఉన్నాయి.

| అక్షరాలు | రాశిపేరు |
|---|---|
| 1. అఆఇఈ | మేషరాశి |
| 2. ఉఊఋ | వృషభరాశి |
| 3. ౠ | మిధునరాశి |
| 4. ఏఐ | కర్కాటకరాశి |
| 5. ఓఔ | సింహరాశి |
| 6. అం అః | కన్యారాశి |
| 7. కవర్గు | తులారాశి |
| 8. చవర్గు | వృశ్చికరాశి |

9. టవర్గు ధనూరాశి
10. తవర్గు మకరరాశి
11. పవర్గు కుంభరాశి
12. యవర్గు మీనరాశి

ఈరకంగా చూచి మా లు రాశిస్వరూపాలు. దేత్వకా ది. అం దుచేత దేవికి రాశికిస్వరూపం చెప్పబడింది.

*6. మాతృకాపీఠరూపిణీ :*

జ్ఞానానికి మూలంగా చెప్పబడే ఋగ్వేదంలో "అదిక్షాన్తమూర్తిః" అంటే అకారమునుంచి క్షకారమువరకు ఉన్న యాభై ఒక్క అక్షరముల రూపర పప అని ) చెప్పబడింది. అదే దేవీస్వరూపము. ఈమాతృకారనుండి దే సకల మంత్రశాస్త్రమూ ఆవిర్భవించి ందు కనే దేవిమంత్రమయి, మాతృకాపీఠరూపిణి అని చెప్పబడుతోంది. వైఖరీవర్ణ స్థానాలయిన యాభై ఒక్క పీఠాలు భారతదేశంలోని వివిధ ప్రదేశాలలో ఉన్నాయి. వీటినే మాతృకాపీఠాలు అంటారు. వాటివివరాలు ఈక్రిందివిధంగా ఉన్నాయి.

1. కామరూపము
2. వారణాసి
3. నేపాలము
4. పౌండ్రవర్ధనము
5. పురస్థిరము
6. కన్యాకుబ్జము
7. పూర్ణ సైలము
8. అర్బుదము
9. అమ్రాతకేశ్వరము
10. ఏకామ్రము
11. త్రిస్రోతము
12. కామకోటకము
కైలాసము
భృగునగ ము
15. కేదారము
16. పూర్ణచంద్రము
17. ము

27. రాజగేహము
28. మహాపథము
29. కోలాపురము
30. మేలాపురము
31. ఓంకారము
32. జయంతికము
33. ఉజ్జయిని
34. చిత్రము
35. క్షీరకము
36. హస్తినాపురః
37. ఓడ్డీశము
38. ప్రయాగ
39. షష్ఠము
40. మాయము
41. జలేశము
42. మలయము
ము

18. ఓంకారపీఠము
19. జాలంధ్రము
20. మాలాఓత్కలము
21. కులాంతము
22. దేవీకోటము
23. గోకర్ణము
24. మారుతేశ్వరము
25. అట్టహాసము
26. విరజము
44. మేరువు
45. గిరివరము
46. మహేంద్రము
47. వామనము
48 హిరణ్యపురము
49. మహాలక్ష్మీపురము
50. ఓడ్యాణము
51. ఛాయాఛత్రము

ఈయాభై ఒక్క పీఠాలకు సమానమైన స్థానాలు శ్రీచక్రంలోను, మానవదేహంలోను కుడా ఉన్నాయి.

శ్రీపర్వతం శిరస్థానే, కేదారంతు లలాటకే।
వారాణసీ మహాప్రాజ్ఞ, భృవేర్ఘ్రాణస్యమధ్యమే॥
కురుక్షేత్రంకుచస్థానే, ప్రయాగం హృత్సరోరుహే
చిదమ్బరంతు హృన్మధ్యే, అధారేకమలాలయమ్॥
ఆత్మతీర్థం సముత్సృజ్య బహి స్తీర్థాని యోవ్రజేత్।
కంఠస్థమహారత్నం త్యక్త్వాకాచంవిమార్గతే॥
తీర్థానితోయపూర్ణాని, దేవానికాష్ఠాదినిర్మితాన్।
యోగినోనప్రపూజ్యంతే స్వాత్మ ప్రత్యయకారణాత్॥
శివమాత్మని పశ్యన్తి ప్రతిమాసునయోగినః।
అజ్ఞానాం భావనార్థాయ ప్రతిమాః పరికల్పితాః॥

ఈరకంగాచెప్పటంవలన దేవి మాతృకావర్ణ రూపిణి మాతృకాపీఠరూపిణి అయింది. 'అహంబ్రహ్మాస్మి' నేనే పరమాత్మస్వరూపాన్నినే అద్వైతానుభూతిసాధించిన యోగులు మాత్రమేసకలదేవతారూపిణి, సకలతీర్థ స్వరూపిణి, గణేశ,గ్రహ, నక్షత్ర, యోగినీ.రాశి, మంత్ర, మాతృకాపీఠ రూపిణి అయిన ఆ దేవిని తమశరీరమందే దర్శించి ధ్యానించగలుగుతారు.

# 8. షట్చక్రాలు

ఆత్మ ఒక్కటే సత్యము. ఆదే నిత్యము. అంటే జీవాత్మవేరు, పరమాత్మవేరుకాదు రెండూ ఒకటే. పరమాత్మ యొక్క స్వరూపమే జీవాత్మ. సాధకుడు తనలోని ఆత్మను ఆపరమాత్మలో ఐక్యం చెయ్యాలి. అంటే కావలసినది బాహ్యపూజలు కాదు. సగుణారాధన పనికి రాదు. "బాహ్యపూజా న కర్తవ్యా"అని చెప్పబడింది. బాహ్యపూజచెయ్యటం వల్ల ఐహికమైన కోరికలు తీరతాయి. అందుకే సాంసారికమైనటువంటి ఇహలోకానికి సంబంధించిన అర్థకామాలు ఒనగూడటానికి బాహ్యపూజలుకావాలి. "అంతరారాధనపరావైదికాబ్రహ్మవాదినః" వైదికులు, బ్రహ్మవాదులు అయిన జ్ఞానులు, సాయుజ్యం కోరేవారు, అంతరారాధన మాత్రమే చేస్తారు. అంతరారాధన అంటే సాధకుడు తన శరీరంలోనే పరమాత్మను ఆవాహన చేసి, తానే పరమాత్మ అనే భావంతో షట్చక్రభేదనం చేసి సహస్రారంలో పరమాత్మను దర్శించాలి. దీనికి గాను శిష్యుడు గురువుగారి వద్ద ఆశ్వయుజ శుద్ధనవమినాడు రాత్రిపూట గురువునకు పాదాభివందనం చేసినప్పుడు, గురువు శిష్యుని తలమీదచేయి ఉంచి మళ్ళీ ఉపదేశం చేస్తాడు. దీన్నే హస్తమస్తక సంయోగము అంటారు. అప్పుడు గురువుగారు తన శిష్యునికి షట్చక్రభేదనము, చతుర్విధైక్య సంధానము ఉపదేశిస్తారు. వాటిని గనక నిరంతరాభ్యాసం చేస్తే భగవత్సాక్షాత్కారం కలుగుతుంది. చతుర్విధైక్యము, షడ్విధైక్యములను నాచే వ్రాయబడిన శ్రీవిద్యాదర్పణములో వివరించటం జరిగింది.

మానవదేహంలో అరవైఆరు ఎముకలు, డబ్బైరెండు వేలనాడులు, అర్థశేరు రక్తము, ఒకమణుగు నాలుగు సేర్లు మాంసము, అరసోలశ్లేష్మము సోలెడుపైత్యము, ముప్పైమూడు కోట్ల రోమాలు, ముప్పైమూడుమూరలు ప్రేగులు ఉంటాయి. వీటిలో అంతరారాధనకు కావలిసినవిషట్చక్రాలు. ఈ చక్రాలు గుదస్థానం దగ్గరనుండి సహస్రారందాకా వ్యాపించి ఉంటాయి.

"మూలాధారంగుదస్థానం, స్వాధిష్ఠానంతు మేహనం.
నాభిస్తుమణిపూరాఖ్యం, హృదయందాబ్జమనాహతమ్।
తాలుమూలం విశుద్ధాఖ్యం, ఆజ్ఞాంచనిటలాంబుజమ్"

"షట్చక్రాలు ఎక్కడ ఉన్నాయోముందుగామనం తెలునుకోవాలి. షట్చక్రాలు. వాటిస్థానాలు, అధిదేవతలు దళములు,మొదలగునవన్నీ ఈదిగువ ఇవ్వబడినాయి,మానవశరీరంలోని షట్చక్రాలు, వాటిపూర్తి వివరాలు ప్రక్కపటంలోచూపటం జరిగింది

| చక్రము | స్థానము | దళాలు | అధిపతి | దేవత | అక్షరాలు | తత్వము |
|---|---|---|---|---|---|---|
| 1. ఆధారము | గుదస్థానము | నాలుగు | గణపతి | సాకిని | వ, శ, ష, స | పృథివి |
| 2. స్వాధిష్ఠానము | లింగస్థానము | ఆరు | బ్రహ్మ | కాకిని | బ, భ, మ, య, ర, ల | అగ్ని |
| 3. మణిపూరము | నాభిస్థానము | పది | విష్ణువు | లాకిని | డ నుంచి ఫ వరకు | జలము |
| 4. అనాహతము | హృదయస్థానము | పన్నెండు | రుద్రుడు | రాకిని | కనుంచి ఠవరకు | వాయువు |
| .5. విశుద్ధిచక్రము | కంఠస్థానము | పదహారు | మహేశ్వరుడు | డాకిని | అనుంచి అఃవరకు | ఆకాశ |
| 6. ఆజ్ఞాచక్రము | భ్రూమధ్యస్థానము | రెండు | సదాశివుడు | హాకిని | హం,క్షం | మనస్సు |
| 7. సహస్రారము | బ్రహ్మరంధ్రము | వేయి | పరమేశ్వరుడు | యాకిని | సర్వవర్ణములు | ఆత్మ |

'సాయుజ్యము అనేమాటకు జన్మరాహిత్యము,మోక్షము, జీవాత్మనుపరమాత్మలో చేర్చటము అనిఅర్థం. అర్చనము రెండురకాలు అని ఇదివరకే చెప్పటం జరిగింది. కౌళ,దక్షిణాచారాల్లో ఏవిధంగా భగవదారాధన చేసినప్పటికీ అదిఐహికవాంఛలను తృప్తి పరచటానికే అవుతుంది. జన్మరాహిత్యం కావాలంటే మానవుడు తననుగురించి తాను తెలుసుకోవాలి. తననుగురించితాను తెలుసుకున్నవాడే మహాత్ముడు. అటువంటివ్యక్తి తనదేహంలోనే భగవంతుని దర్శించకలుగుతాడు. సాధకుడు భగవంతునిదర్శించాలంటే షట్చక్రభేదనము చెయ్యాలి. షట్చక్రాలు ఎక్కడవుంటాయనేది ముందే చెప్పబడింది. సాధకుడు గురుముఖతః షట్చక్రభేదన, కుండలినీప్రబోధము తెలుసుకున్న తరువాతనేదీని సాధన చెయ్యాలి. షట్చక్రాలలో మొదటిది ఆధారచక్రము. దీన్నే మూలాధారము అంటారు.

**మూలాధారము:**

"ఆధారస్తుచతుర్దళోరుణరుచి ర్వాసాంత వర్ణాశ్రయః"

ఇదిసర్వాభూతమైనచక్రము. ఇదిగనకలేకపోతే శరీరము పైకిఎగిరిపోవటం గాని, క్రిందికి పడిపోవటం కానిజరుగుతుంది. 'మూల' అంటేగుదస్థానము. ఆధారచక్రం గుదస్థానంలో ఉంటుంది. ఇదిపృథివీతత్వాత్మక మైనస్థానము. దీనికి అధిపతి గణపతి. ఇక్కడ నాలుగుదళాలతో కూడిన పద్మంఉంటుంది. లలితాసహస్రంలో ఈచక్రాన్నిగురించి వివరంగా చెప్పబడింది.

మూలాధారాంబుజారూఢా పంచవక్త్రాస్థిసంస్థితా
అంకుశాదిప్రహరణా వరదాదినిషేవితా
ముద్గౌదనాసక్తచిత్తా సాకిన్యంబాస్వరూపిణీ"

దీనివివరణ ఈవిధంగా ఉన్నది : షట్చక్రాల్లోను మొదటి చక్రాన్ని మూలాధారచక్రం అంటారు ఇదినాలుగు దళాలు కలిగిన పద్మము పృథివీ తత్వాత్మకము. దీని యొక్కకర్ణికలో అధిష్ఠించిన దేవతపేరు 'సిద్ధవిద్యా', పుట్టుకతోజ్ఞానవైరాగ్యములు కలవారుసిద్ధులు. వారు ఉపాసించువిద్య సిద్ధవిద్య. అణిమాది అష్టసిద్ధులు సాధించినవారు సిద్ధులు. వారు ఉపాసించేవిద్య సిద్ధవిద్య.

కాళీ తారా మహావిద్యా షోడశీ భువనేశ్వరి
భైరవీ ఛిన్నమస్తా చ విద్యా, ధూమవతీ తథా।
బగళా సిద్ధ విద్యా చ మాతంగీ కమలా త్మికా
ఏతా దశమహావిద్యా సిద్ధ విద్యాః ప్రకీర్తితాః

| | |
|---|---|
| 1. కాళి | 6. భైరవి |
| 2. తారా | 7.ఛిన్నమస్తా |
| 3. మహవిద్యా | 8. ధూమావతి |
| 4. షోడశి | 9. బగళా |
| 5. భువనేశ్వరి | 10మాతంగి |

అనేవి సిద్ధవిద్యలుగా చెప్పబడుతున్నాయి, ఆధారచక్రమునందు పసుపు రంగులో, వర్తులాకారముగ భూమండలమున్నది. ఇక్కడ తెల్లని ఏనుగుమీద లం బీజముంటుంది. ఇది కుండలినీ స్థానము. దీనిమధ్య ఉన్నత్రికోణము, దానిమీద స్వయం భూలింగానికి మూడున్నర వలయాలుగాచుట్టుకుని కుండలినీశక్తి ఉంటాయి. ఇక్కడ ఉన్నసిద్ధవిద్యాదేవికి ఐదుముఖములు (శిరస్సులు) ఉంటాయి, అవి 1. సద్యోజాత, 2. వామదేవ, 3. అఘోర. 4. తత్పురుష 5. ఈశానములు. ఈదేవత ఎముకలయందుటుంది. చేతులయందు అంకుశము, కమలము,పుస్తకము,జ్ఞానముద్ర ధరించి ఉంటుంది.ఈచక్రానికి నాలుగుదళాలుంటాయి. వాటిలో వరుసగా 1. వరద 2. శ్రీ 3 షండా 4. సరస్వతి, అనబడే దేవతలు ఉంటారు,సిద్ధవిద్యాదేవికి పెసరపప్పు,బియ్యము,బెల్లము,కొబ్బరి,పాలు,నెయ్యి కలిపివండిన పులగము (ముద్గాన్నము) నందుప్రీతి. మంత్రజపంలో బీజము,న్యాసము,కీలకము,మంత్రము అన్నిసకారసంకేతములుగా ఉంటాయి కాబట్టి సిద్ధవిద్యా దేవి 'సాకిన్యంబా' అనివిలవబడుతుంది. యోగినీన్యాసమందు సాకినీ ధ్యానము ఈవిధంగాఉన్నది.

మూలాధారస్థపద్మే శ్రుతిదళలసితే పంచవక్త్రాం త్రినేత్రాం
ధూమ్రాభామస్థిసంస్థాం సృణిమపి కమలం పుస్తకం జ్ఞానముద్రాం।
బిభ్రాణాం బాహుదండై స్సులలిత వరదాం పూర్వ శక్త్యావృతాం తాం
ముద్గాన్నాసక్తచిత్తాం మధుమద ముదితాం సాకినీం భావయామః॥

ఆధారచక్రంలో ఐదుముఖములు, మూడుకనులుకలిగిధూమ్రవర్ణముకలది, ఎముకలయందుండునది, అంకుశము,కమలము,పుస్తకము,జ్ఞానముద్రలనుచేతులందు ధరించినది వరద,సరస్వతిమొదలైనశక్తులచేపరివృతఅయినది,ముద్గాన్నము నందుఆసక్తికలది ఐరావతారూఢ అయిన సాకినీ దేవికి నమస్కరించుచున్నాను.

మూలాధారాధిష్ఠానదేవతా సాకినీయుక్తశ్రీగణ పతిస్వరూపిణ్యంబా
శ్రీపాదుకాంపూజయామి తర్పయామినమః॥

సౌందర్యలహరిలో శంకరభగవత్పాదులు ఆధారచక్రాన్నిగురించి ఈవిధంగా అన్నారు.

తవాధరే మూలే సహస్యమయాలాస్యపరయా
నవాత్మానం మన్యే నవరసమహాతాండవనటం।
ఉభాభ్యామేతాభ్యా ముదయవిధి ముద్దిశ్యదయయా
సనాథాభ్యాం జజ్ఞే సకలజననీ మజ్జగదిదమ్ ॥

ఆధారచక్రంలో శివాశివులకు భైరవీభైరవులని లేదా నవాత్మ నవాత్మకుడు అని పేర్లు. వీరిద్దరూ ఎర్రని రంగుతో ప్రకాశిస్తూ శృంగారముతోకూడిన నాట్యముచేస్తూ, జగత్తునుసృష్టించే కార్యక్రమంలో నిమగ్నమై ఉంటారు.

ఆధారచక్రము సాకినీ దేవతల చిత్రాలు ప్రక్క పేజీలో ఇవ్వబడినాయి.

షట్చక్ర నిరూపణంలో ఆధారచక్రాని గురించి ఈ విధంగా చెప్పబడింది.

1. ఆధారపద్మం సుషుమ్నాస్యలగ్నం
ధ్వజాధో గుదోర్ధ్వశ్చ చ ।ణ పత్రం।
అధోవ క్త్రముద్యత్ సువర్ణాభవర్ణైః ॥
వకారాంతైర్యుతం వేదవర్ణైః

2 అముష్మిన్ ధరాయుశ్చతుష్కోణచక్రం
సముద్భాసిశూలాష్ట కైరావృతంతత్।
లసత్ పీతవర్ణం తటిత్ కోమలాంగం
తదంతే సమాస్తే ధరాయాః స్వబీజమ్॥

3 చతుర్బాహు భూషం గజేంద్రాధిరూఢం
తదంకే నవీనార్కతుల్య ప్రకాశః ।
శిశుః సృష్టికారీ లసద్వేదబాహుః
ముఖాంభోజ లక్ష్మీశ్చతుర్భాగభేదః ॥

సహే4 । సత్ర దేవీ చ డాకిన్యభిఖ్యా
లసద్వేద బాహ రక్తేల ిత్రా
సమానోది తానేక ప్రవార్క కాశా
ప్రకాశం వహంతీ సదా శుద్ధబుద్ధేః ॥

## మూలాధారచక్రము







సాకిన్యంబా

5. వజ్రాఖ్యా వక్త్రదేశే వసతి సతతం కర్ణి కామధ్య సంస్థం
కోణంతత్ త్రైపురాఖ్యం కదిధినవిలసత్ కోమలం కామరూపం।
కందర్పో నామ వాయు ర్నివసతి సతతం తస్య మధ్యే సమంతాత్
జీవేశో బంధుజీవ ప్రకరమభిహసన్ కోటిసూర్య ప్రకాశః ॥

6. తన్మధ్యే లింగరూపీ ద్రుతకనక కలాకోమలః పశ్చిమాస్యః
జ్ఞానధ్యానప్రకాశః ప్రథమకిసలయాకారరూపః స్వయంభూః।
విద్యుత్ పూర్ణేందు బింబ ప్రకర కరచయస్నిగ్ధ సంతానహాసీ
కాశీవాసీ విలాసీ విలసతి సరిదావర్తరూప ప్రకారః ॥

7. తస్యోర్ధ్వే బిసతంతు సోదరలసత్సూక్ష్మా జగన్మోహి
బ్రహ్మద్వారముఖం ముఖేన మధురం సంఛాదయంతీ స్వయమ్।
శంఖావర్తనిభా నవీనచపలా మాలావిలాసాస్పదా
సుప్తా సర్పసమా శివోపరిలసత్సార్ధ త్రివృత్తా కృతిః ॥

8. కూజంతీ కులకుండలీ చ మధురం మత్తాలిమాలాస్ఫుటం
వాచం కోమలకావ్యబంధరచనా భేదాతిభేదక్రమైః।
శ్వాసోచ్ఛ్వాసవిభఞ్జనేన జగతాంజీవో యయాధార్యతే
సామూలాంబుజగహ్వరే విలసతి ప్రోద్దామ దీప్తావళిః ॥

9.తన్మధ్యేపరమా కలాతికుశలాసుక్ష్మాతి సూక్ష్మాపరా
నిత్యానంద పరంపరాతి విగలత్పీయూషధారాధరా।
బ్రహ్మాండాది కటాహ మేవసకలం యద్భాసయాభాసతే
సేయం శ్రీపరమేశ్వరీ విజయతే నిత్య ప్రబోదోదయా॥

ఆధారము నాలుగు దళాలు ఉన్న పద్మము లింగస్థానానికి క్రిందగా, గుదస్థానానికి దగ్గరలో ఉంటుంది. దీని దళాలు ఎర్రగా ఉంటాయి. ఇది అధోముఖంగా ఉంటుంది. ఇక్కడ నాలుగుదళాలయందు వరద, శ్రీ, షండా, సరస్వతి అనబడు నాలుగుఅక్షరాలు, శక్తులరూపంలో ఉంటారు. ఈ దళాలు దక్షిణావృతంగా అంటే ఎడమ నుండి కుడికి ఉంటాయి. ఈ పద్మానికి మధ్య భాగంలో చతురస్రాకారమైన పృథివీస్నదిదలము . అది పీతవర్ణమందిో ఉంటు . ఈ మండలానికి ఎనిమిది దిక్కులందు ఎనిమిది శూలములు ఉంటాయి.

మూలాధారే ధరాచక్రం చతుష్కోణం ప్రియంవదే
పీతవర్ణం పరివృతం చాష్టశూలైః కులాచలైః ॥

మూలాధారమందు పసుపువర్ణము కల చతురస్రాకారమైన పృథివీ మండలమున్నది.కులపర్వతములే అష్టశూలములుగా ఇక్కడ ఉన్నాయి. దీని యందు'లం' పృథివీ బీజము. 'లం' అనేదే ఇంద్ర బీజము. ఇది పచ్చని రంగుతో పెద్దపెద్ద చేతులతో వజ్రాయుధము ధరించి, ఐరావతమునధిరోహించి ఉన్నది. దాని అంకభాగమున శిశురూపంలో ఉన్న బ్రహ్మ ఉన్నాడు. అతడికి నాలుగు చేతులున్నాయి. అతడే ఇంద్రుడు అని యామళగ్రంథాలుచెబుతున్నాయి. ఇక్కడకు కొద్దిగా పైభాగాన ఉన్న స్వయంభూలింగానికి మూడులయ వలయాలుగా చుట్టుకుని అధోముఖంగా కుండలినీశక్తి నిద్రిస్తూ ఉంటుంది. కుండలిని తనముఖముచేత బ్రహ్మ కపాటాన్ని మూసి ఉంచుతుంది. కుండలిని తేజస్సు విద్యుత్తు లాగా ఉంటుంది. అది మదించిన తుమ్మెదలాగా ధ్వని చేస్తూ ఉంటుంది.

స్వాధిష్ఠానము :

"వమధ్యస్థానేక వైద్యుతవిభం బాలాంత షట్పత్రకమ్"

ఇదిమూలాధారానికి కొద్దిగా పై భాగాన ఆరుదళాలతో కూడిన పద్మం. ఇది అగ్ని తత్త్వం. ప్రకటిత దీని అధిదేవత బ్రహ్మ. లలితా సహస్రం లో స్వాధిష్ఠానం గురించి ఈ విధంగా ఉంది.

"స్వాధిష్ఠానాంబుజగతా చతుర్వక్త్రమనోహరా
శూలాద్యాయుధ సంపన్నా పీతవర్ణాతిగర్వితా
మేదోనిష్ఠా మధుప్రీతా బంధిన్యాదిసమన్వితా
దధ్యన్నాసక్తహృదయా కాకినీ రూపధారిణీ"

మూలాధారానికి కొద్దిగాపై భాగాన లింగస్థానమునందు స్వాధిష్ఠాన చక్రమున్నది. దీనిదళాలు ఆరు ఉన్నాయి. అగ్నితత్త్వాత్మకమైనచక్రము.బకారమునుండి లకారము వరకు వర్ణక్రమంలో ఆరుశక్తులు ఆవరించి ఉండగా,ధ్యమంలో కాకిని దేవత ఉంటుంది. ఈమె పేరు సిద్ధేశ్వరి. దేవగణాలలో గోవులను రక్షించటానికి సిద్ధగణ మున్నది. ఈగణములచే సేవింపబడే దేవి కాబట్టి ఈమెను సిద్ధేశ్వరి అంటారు. కాశీక్షేత్రంలో సర్వసిద్ధులు పొందిన సిద్ధేశ్వరి అను దేవత కూడా ఉన్నది. స్వాధిష్ఠానంలో సిద్ధేశ్వరీ దేవి నాలుగు చేతులు కలిగి శూలము, పాశము, కపాలము, అభయముద్రలను ధరించి పచ్చనిశరీర కాంతితో మిలమిలామెరుస్తూ, మిక్కిలి సౌందర్యము వలన అతిశయము కలిగినదియైన్ను మేద అనుధాతువునందు ఉంటుంది. శిరస్సునందు ఉండేతెల్లని మృదుత్వమైన పదార్థమే మేద.

# స్వాధిష్ఠాన చక్రము






దీనినే మెదడుఅంటారు. మధువుమేదోవృద్ధి కరము. అందుచేతఈమెకుమధువునందు ప్రీతిఎక్కువ. స్వాదిష్ఠానపద్మ కర్ణికలో సిద్ధేశ్వరీదేవి ఉండగాచుట్టూ ఆరుదళాలలోను

1. బంధిని
2. భద్రకాళి
3. మహామాయ
4. యశస్విని
5. రమా
6. లంబోష్ఠి

అనేశక్తులు ఉంటాయి. ఈదేవతకుపెరుగుతో కలిపిన అన్నమందు ఆసక్తిఎక్కువ. దీన్నే 'దధ్యన్నం' అంటారు ఈచక్రాధిదేవత అయిన సిద్ధేశ్వరికి బీజము, న్యాసము, మంత్రము అన్నీ కకారసంకేతముగానే ఉంటాయి. కాబాకి:ఈమెను'ః న్యంబా' అని కూడా అంటారు యోగినీ న్యాసంలో కాకినీ ధ్యానము ఈవిధంగా ఉంది.

స్వాధిష్ఠానాఖ్యపద్మే రసదళలసితే వేదవక్త్రాం త్రినేత్రాం
హస్తాభ్యాం ధారయంతీం త్రిశిఖగుణ కలాపాభయావ్యాత్తగర్వాం।
మేదోధాతు ప్రవిష్టామళి ముదముదితాం బందినీముఖ్య యుక్తాం
పీతాం దధ్యోదనేష్టామభిమత ఫలదాం కాకినీం భావయామః ॥

ఆరుదళములు గల ఈపద్మంలఖవలుగుము ఖలు, మూడుకనులు కలిగి, చేతులందు త్రిశూలము, పాశము, కపాలముద్రఅభయవ ।లు ధరించి పసుపువర్ణముతో ప్రకాశించునది, మిక్కిలిసౌందర్యము చేతగర్వందసుకలది, మే ్ఞఅను ధాతువునందుండునది, మద్యముచేతసంతసించునది బంధిని మొదలగుశక్తులచేపరివేష్టింపబడినది, దధ్యన్నముమీద ఆసక్తికల కాకినీదేవతకు నమస్కరించుచున్నాను.

స్వాధిష్ఠాన దేవతా కాకినీ యుక్త బ్రహ్మస్వరూపిణ్యంబా
శ్రీపాదుకాం పూజయామి తర్పయామినమః.

స్వాధిష్ఠాన చక్రము, కాకినీ దేవత చిత్రము ప్రక్కపేజీలో ఇవ్వబడ్డాయి. శంకరభగవత్పాదులవారు సౌందర్యలహరిలోస్వాధిష్ఠాన ' న్ని ఈవిధంగా వర్ణించారు,

తవ స్వాధిష్ఠానే హుతవహ మధిష్ఠాయ నిరతం
తమీళేసంవర్తం జనని మహతీం తాం చ సమయాం।
యదాలోకే లోకాన్ దహతి మహతి క్రోధకలితే
దయార్ద్రా యాదృష్టిః శిరం మువచా రచయతి॥

స్వాధిష్ఠానము అగ్నిస్థానము. ఇక్కడ ఉండే ్గ్ని ని సంవర్త ఇద ారు. ఇక్క ఉండేశివుడు సంవర్తాగ్నియైలోకాలను దహించివేస్తుంటే దేవితనకరుణాదృక్కులతో ఆలోకాలను శమింపచేస్తూ . ్వధిః కమల ్గుగు ముు ంచి షట్చక్రనిరూపణ లోఈవిధంగా ఉన్నది.

సిందూర పూరరుచిరారుణ పద్మమన్యత్
సౌషుమ్న మధ్యఘటితం ధ్వజమూలదేశే।
అంగచ్ఛదైః పరివృతం తటిదాభవర్ణై
ర్బాద్యైః స బిందులసితైశ్చ పురందరాంతైః॥
తస్యాంతరే ప్రవిలసద్విశద ప్రకాశ
మంభోజమండల మథో వరుణస్య తస్య।
అర్ధేందు రూపలసితం శర దిందు శుభ్రం
వంకార బీజమమలం మక రాధిరూఢమ్॥
తస్యాంక దేశకలితో హరి రేవపాయాత్
నీలప్రకాశరుచిర శ్రియమాదధానః॥
పీతాంబరః ప్రథమయౌవన గర్వధారీ
శ్రీవత్సకౌస్తుభధరో ధృతవేదబాహుః॥
అత్రైవభాతి సతతం ఖలు రాకిణీసా
నీలాంబుజోదర సహోదర కాంతిశోభా।
నానాయుధోద్యతకరైర్లసితాంగ లక్ష్మీ
ర్దివ్యాంబరాభరణ భూషితమత్తచిత్తా॥
స్వాధిష్ఠానాఖ్యమేతత్సరసిజమమలంచింత యేద్యోమనుష్య
స్తస్యాహంకారదోషాదిక సకలరిపుః క్షీయతే దక్షిణేన।
యోగేశః సో2పి మోహాద్భుత తిమిర చయే భానుతుల్యప్రకాశో
గద్యైః పద్యైఃప్రబంధైర్విరచయతి సుధావాక్య సందోహలక్ష్మీః॥

స్వాధిష్ఠానము, ఆధారచక్రానికి కొద్దిగాపైభాగానలింగస్థానంలో సిధూరవర్ణంగులో ఉంటుంది. దానికి ఆరు దళాలున్నాయి. వాటియందు బంధిని నుండి 'లంబోష్ఠి' వరకు శక్తులు విద్యు ల్లతలలాగాప్రకాశిస్తుంటాయి. ఈమండలము అర్ధచంద్రాకారం లో ఉంటుంది. అయితే ఇది పద్మమువలె ఉంటుంది అని కొన్నిగ్రంధాలలో ఉంది. దీనికి అధిదేవత బ్రహ్మ.బీజము 'వం.' ఆధారస్వా ధిష్ఠానాలు రెండూ అంధకారబంధురాలు. ఐహికవాంఛాసక్తులైన కౌలులు ఇక్కడ ఉపాసన చేస్తారు, సమయులకు ఇక్కడ అధికారంలేదు.

మణిపూరకము :

"రత్నాభం మణిపూరకం దశదళం డాద్యం ఫకారాంతకం

నాభిస్థానంలో పదిదళాలతో ప్రకాశించే పద్మాన్ని మణిపూరము అంటారు. ఇది జలతత్వాత్మక మైనది. దీనిలో ఆధారస్వాధిష్ఠానాలకు ప్రతీకగా పదిదళాలుంటాయి. లలితాసహస్రంలో దీన్నిగురించి ఈవిధంగా ఉంది.

# మణిపూర చక్రము






మణిపూరాబ్జనిలయా వదనత్రయసంయుతా
వజ్రాధికాయుధోపేతా డామర్యాదిభిరావృతా
రక్తవర్ణా మాంసనిష్ఠా గుడాన్న ప్రీతమానసా
సమస్త భక్త సుఖదా లాకిన్యంబాస్వరూపిణీ॥

...ం నాభిస్థాన ...ో పదిదళాలతో ప్రకాశించే చక్రాన్ని మణిపూరముఅంటారు. దీనికి పదిదళాలుంటాయి. ఈపద్మముకర్ణికలో 'వయోవస్థా వివర్జితా' అనిపిలవబడు దేవత ఉంటుంది పదిదళాలలోను.

| | |
|---|---|
| 1. డామరి | 6. దాక్షాయణి |
| 2. ఢంకారిణి | 7. ధాత్రి |
| 3. ణామిరి | 8. నందా |
| 4. తామసి | 9. పార్వతి |
| 5. స్థాణ్వి | 10. ఫట్కారిణి |

శక్తులు పరివేష్ఠించి ఉండగా మధ్యలో వయోవస్థా వివర్జితా అనబడుదేవత ఉంటుంది. ఈమెకు బాల్యము. కౌమారము, యౌవనము,మొదలైన శారీరకమైన అవస్థలు లేవు కాబట్టి ఆమెనివయోవస్థా ...ర్జితా అంటారు. ఈమెఎల్లప్పుడు పదహారు సంవత్సరముల ప్రాయములోనే ఉంయౌ...ది, నిత్య ...వనవతి, చేతులయందు వజ్రము, శక్తి, దండము, అభయముద్రలు కలి... ఎర్రక్తమువలె ...ని కాంతితో, మాంసమునందు అభిమానము కలిగి ఉంటుంది. ఈదేవి మాంసము అనబడేధాతువు నందు అభిమానము కలిగి ఉంటుంది. శరీరపుష్టినిచ్చేది మాంసము ఈదేవతను అర్చిస్తే శరీరంలో మాంసవృద్ధి జరుగుతుంది. ఈమెకు గుడాన్నమునందు ప్రీతిఎక్కువ. ఈదేవతను పూజించి, గుడాన్నమునివేదన చేసినట్లైతే సమస్త సుఖాలు ప్రాప్తిస్తాయి అని చెప్పబడింది. ఆర్తులు, అర్థార్తులు, జిజ్ఞాసులు, జ్ఞానులు మొదలుగాగల అన్నిరకాల భక్తులకు సుఖములనిస్తుంది. ఈదేవత బీజము,న్యాసము, మంత్రము అన్నీ ల కారసంకేతములుకాబట్టి ఈమెను'లాకిన్యంబా' అంటారు, యోగినీన్యాసంలో లాకినీ ధ్యానము:

దిక్పత్రే నాభిపద్మే త్రివదన విలసద్దంష్ట్రిణీం రక్తవర్ణాం
శక్తిం దంభోళిదండామభయమపి భుజైర్ధారయంతీం మహోగ్రాం।
డామర్యాద్యైఃపరీతాం పశుజనభయదాం మాంసధాత్వైకనిష్ఠాం
గౌడాన్నాసక్తచిత్తాం సకల సుఖ కరీం లాకినీం భావయామః॥

మూడుముఖములు,కోరలుకలది, రక్తమువలె ఎర్రనిరంగుతో ప్రకాశించునది, మాంసమందుండునది,గుడాన్నమందు ప్రీతికలది,డామరిమొదలైన పదిమంది శక్తులచే

పరివేష్టింపబడినది, అందరికీ సుఖములనిచ్చునది అయిన లాకినీశక్తికి నమస్కరిచు చున్నాను. మణిపూర చక్రము, లాకినీ దేవతారూపము ప్రక్క పేజీలలో ఇవ్వటం జరిగింది.

మణిపూరాధిష్ఠాన దేవతా లాకినీయుక్తవిష్ణుస్వరూపిణ్యంబా
శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః

సౌందర్యలహరిలో శంకరులవారు మణిపూరచక్రాన్ని ఈవిధంగా వర్ణించారు

"తటిత్వం తం శక్త్యా తిమిరపరిపంథిస్ఫురణయా
స్ఫురన్నానారత్నాభరణపరిణద్ధేంద్రధనుషమ్।
తమశ్శ్యామం మేఘం కమపి మణిపూరైకశరణమ్
నిషేవే వర్షం తం హరమిహిరతప్తం త్రిభువనమ్॥"

మణిపూరమందున్న మేఘముశ్యామవర్ణముకలది. అంధకారము నుపోగొట్టు మెరుపు తీగలతో కూడినటువంటిది. ఇదనానావిధములైన రత్నములచేత తయారుచేయబడి ఉంటుంది. స్వాధిష్ఠానములోదగ్గమైనలోకాలను మరలశివాశివులు పునరుత్పత్తి చేస్తుంటారు. మణిపూరముగురించి 'షట్చక్రనిరూపణ' లో ఈవిధంగా ఉన్నది.

తస్యోర్ధ్వే నాభిమూలే దశదళలసితే పూర్ణమేఘప్రకాశే,
నీలాంభోజప్రకాశై ర్రుపహితజఠరే డాదిఫాంతైః సచంద్రైః।
ధ్యాయేద్వైశ్వానరస్యారుణమిహిరసమం మండలం తత్ త్రికోణం
తద్బాహ్యేస్వస్తికాఖ్యైస్త్రి భిరభిల సితంతత్రవహ్నేః స్వబీజమ్॥
ధ్యాయేన్మేషాధి రూఢంనవతపన నిభం వేదబాహూజ్జ్వ లాంగం,
తత్క్రోడే రుద్రమూర్తి ర్నివసతి సతతం శుద్ధసిందూరరాగః
భస్మాలిప్తాంగభూషాభరణసితవపుర్వృద్ధ రూపీ త్రినేత్రో
లోకానామిష్ట దాతాభయలసితకరః సృష్టి సంహార కారీ॥
అత్రాస్తేలాకినీ సా సకలశుభకరీ వేదబాహూజ్జ్వలాంగీ
శ్యామా పీతాంబరాద్యైర్వివిధవిరచనాలంకృతా మత్త చిత్తా।
ధ్యాత్వై తన్నాభిపద్మం ప్రభవతి నితరాంసుహృతా పాలనే వా,
వాణీతస్యాననాబ్జే నివసతి సతతం జ్ఞాన సందోహలక్ష్మీః॥

నాభిస్థానంలో పదిదళాలుకలపద్మము మేఘవర్ణము కలిగి ఉన్నది. దీనికర్ణికయందున్న లాకినీ దేవి డామరి,ఫట్కారిణి మొదలైన పదిశక్తులచే పరివృత అయి ఉన్నది, దీనికర్ణికలో అగ్నిమండలమైన త్రికోణము ఎర్రనిరంగులో ఉన్నది. ఇక్కడ అగ్ని బీజము మేష వాహనముపైన ఉన్నది. ఈబీజము యొక్క అంకభాగంలో సింధూరవర్ణము కల రుద్రమూర్తి ఉంటాడు. అతడు భస్మమురాచుకునితెల్లగా ఉంటాడు. త్రినేత్రుడు అభయ, వరదముద్రలు ధరించి ఉంటాడు ఈయన సృష్టిసంహారకారి. ఇక్కడ ఉన్న లాకినీదేవి నాలుగు చేతులతో, శ్యామవర్ణముకలిగి, పీతాంబరము, రకరకాల ఆభరణాలు ధరించి ఉంటుంది.

# అనాహత చక్రము






ఈమెముఖముసరస్వతీ దేవివలే జ్ఞానమయంగా ప్రకాశిస్తూ ఉంటుంది,

స్వాధిష్ఠానమణిపూరాలస్థానాలనుగురించి భిన్నాభిప్రాయాలున్నాయి. కొంతమంది ప్రకారము స్వాధిష్ఠానము అగ్ని స్థానము కాగా కొరముంది ప్రకా ము, దిజలస్థాన కాబట్టి కొన్నిచోట్ల మణిపూరము అగ్నిస్థానము అని,మరికొన్నిచోట్ల జలస్థానము అని అంటారు.

**అనాహతము:**

"పత్ర ర్ద్వాదశభిస్త్వ నాహతపురీహైమీకంఠాం తాన్వితాం"

హృదయస్థానంలో పన్నెండుదళాలతో ఉండే వాయుతత్త్వాత్మకమైనచక్రాన్ని అనాహతము అంటారు, దీనిలో పణిపూరానికి ప్రతీకగాపది,విశుద్ధి, అజ్ఞాచక్రాలకు ప్రతీకగా రెండు మొత్తం పన్నెండు దళాలుంటాయి. ఇదిబంగారు రంగులో ఉంటుస్రంలలితాసహ లో దీన్నిగురించి ఈవిధంగా ఉన్నది.

అనాహతాబ్జనిలయా శ్యామాభా వదనద్వయా
దంష్ట్రోజ్వలాక్షమాలాదిధరా రుధిరపంస్థితా
కాళరాత్ర్యాదిశక్త్యౌఘవృతా స్నిగ్ధౌద యా
మహావీరేంద్రవరదా రాకిన్యంబాస్వరూపిణీ॥

హృదయస్థానంలో పన్నెండు దళాలతో విలసిల్లే పద్మాన్ని అవాహతం అంటారు. ఇది వాయుతత్త్వాత్మ కమైనది, హతము (నాశనమటి కానటువం ధ్వని జనించే స్థలము అనాహతము. దీనికర్ణికలో 'వామదేవి' అనే దేవత ఉంటుంది.అతి సుందరమైన శరీరలావణ్యముకలది వామదేవి. సదాశివుని పంచవ్యూహములలో ఉత్తరము వైపున్నవాడు వామదేవుడు. అతనిశక్తి వామదేవి. ఈమెనల్లరంగు కలిగి ఉంటుంది. రెండు శిరస్సులు, పందికోరలవలె కోరలు కలిగి చేతులయందు అక్షమాల శూలము, కపాలము డమరుకము ధరించి ఉంటుంది రుధిరమునకు అధిదేవత.

| | | | |
|---|---|---|---|
| 1. కాళరాత్రి | | 7. ఛాయా | |
| 2. ఖాటీత | యా | 8. జ | |
| 3. గాయత్రి | | 9. ఝంకారి | |
| 4. ఘంటాధారిణి | | 10. జ్ఞానరూపా | |
| 5. జ్ఞామిని | | 11. టంకహస్తా | |
| 6. చంద్రా | . ఠ | 12 ంకారిణి. | |

అనుపన్నెండు మంది శక్తులు ఈమెనంటావేష్టించి ఉ రు. ఈమెస్నిగ్ధాన్నప్రియ, అనగా అన్నిటితోతడిపిన ముసందు మక్కువ కలది. మహావీరేంద్రులు అంటే ఆత్మసాక్షాత్కారము పొందినజ్ఞానులు, శ్రీవిద్యోపాసకులలో శ్రేష్ఠులు. జాగ్రత్,స్వప్న సుషుప్తి తురబడే అవస్థా యంలో

తురీయాతీతము అనుభవించేవారు. అట్టివారికి వరములిస్తుంది. ఈమెయొక్క మంత్రము, బీజము, కీలకము అన్నీ రకారసంకేతముగా ఉంటాయి కాబట్టి ఈమెను 'రాకిన్యంబా' అంటారు. యోగినీన్యాసంలో రాకినీదేవిధ్యానము ఈవిధంగా ఉన్నది.

హృత్పద్మే భానుపత్రే ద్వివదనలసితాం దంష్ట్రిణీం శ్యామవర్ణాం
చక్రం శూలం కపాలం డమరుమపి భుజైర్ధారయంతీం త్రినేత్రాం।
రక్తస్థాం కాళరాత్రి ప్రభృతి పరివృతాం స్నిగ్ధభుక్తైకసక్తాం
శ్రీమద్వీరేంద్ర వంద్యామభిమత ఫలదాం రాకినీం భావయామః॥

హృదయస్థానమునున్న అనాహతము పన్నెండు దళములు, వాయుతత్త్వము హేమవర్ణముకలది. దీనికర్ణికలో ఉన్నరాకినీదేవత రెండు ముఖములు, మూడునేత్రములు, కోరలుకలిగిచేతులయందు అక్షమాల, శూలము, కపాలము, డమరుకము ధరించినది,నల్లనిరంగుకలది, రక్తమునందు ఉండునది, నేతితోకలిపిన అన్నమందు ప్రీతికలది, కాళరాత్రి మొదలు ఠంకారిణి వరకు పన్నెండు మంది శక్తులతో ఆవరింపబడినది, మహాపండితులచేనమస్కరింపబడునది అయిన రాకినీదేవికి నమస్కరిస్తున్నాను.

అనాహతాధిష్ఠానదేవతారాకినీ యుక్తరుద్రస్వరూపిణ్యంబా
శ్రీపాదుకాం పూజయామి తర్పయామినమః॥

రాకినీదేవి చిత్రము, అనాహతపద్మముప్రక్క పేజీలలో ఇవ్వబడినాయి.

సౌందర్యలహరిలో శంకరభగవత్పాదులవారు అనాహతపద్మాన్ని ఈవిధంగావర్ణించారు

"సమున్మీ లత్సంవిత్కమలమకరందైక రసికం
భజే హంసద్వంద్వం కిమపి మహతాం మానసచరం।
యదాలాపాదష్టాదశ గుణితవిద్యాపరిణతిః
ర్యదాదత్తే దోషాద్గుణమఖిల మద్భ్యఃపయఇవ,"

అనాహతంలో శివశక్తులు రాజహంసల రూపంలో ఉంటారు. సాధకులు ఆహంసమిథునాన్నే ఆరాధిస్తారు. ఇక్కడ భగవతి శివశక్తి సంపుటమైన ఇరవైఅరవ తత్త్వము. ఈతత్త్వాన్ని సేవించేవాళ్ళు అష్టాదశవిద్యలయందు అసమానులవుతారు. అనాహతచక్రాన్ని గురించి షట్చక్రనిరూపణలో ఈవిధంగా ఉంది.

తస్యోర్ధ్వేహృదిపంకజం సులలితం బంధూక కాంత్యుజ్జ్వలం
కాద్యైర్ద్వాదశవర్ణకైరుపహితం సిందూరరాగాన్వితైః॥
నామ్నా నాహతసంజ్ఞకం సురతరుం వాంఛాతిరిక్త ప్రదం
వాయోర్మండల మత్ర ధూమసదృశం షట్కోణ శోభాన్వితమ్॥
తన్మధ్యేపవనాక్షరం చ మధురం ధూమావలీధూసరం

# విశుద్ధచక్రము






ధ్యాయేత్పాటి చతుష్టయేన లసితం కృష్ణాధిరూఢంపరమ్।
క్ధ్యేకరుణావిధాన మమలం హంసాభ మీశాభిధం
తన
పాటీభ్యామభయం వరం చ విదధల్లోక త్రయాణామపి॥
అత్రాస్తే ఖలు కాకినీనవతటి త్కాశు: త్రినేత్ర భా
నరా
ల్యలంకరణాన్వితా హితకరీ సమ్యగ్గనానాం ముదా।
హ
స్త్ర:పాశకపాల శోభ నవరాన్ సంబిభ్రతీచా భయం
మత్తా
పూర్ణ సుధారసార్ద్ర హృదయాకంకాళమాలాధరా॥
4.
ఏతస్మి రజ కర్ణికాంతర లసచ్చక్రిత్రికోణాభిధా
విద్యుత్కోటి సమానకోమల వపు: సాస్తేతదాంతర్గత:॥
బాణాఖ్య: శివలింగ కోఽపికనకాకారాంగ రాగోజ్జ్వలో
మాలౌ సూక్ష్మవిభేద యుఙ్మణిరివ ప్రోల్లాస లక్ష్మ్యాలయ:॥
5. ధ్యాయే ద్వాహృది పంకజం సురతరుంశర్వస్య, పీఠాలయం
దే:
స్వానిలహీన దీపకలికా హంసేన సంశోభితమ్।
భానోర్మండల మండితాంతర లసత్కింజల్క శోభాధరం
వాచామీశ్వర ఈశ్వరోఽపి జగతాం రక్షోవినాశక్షమ:॥

స్థాన హృదయ మునందు అనాహత పద్మమున్నది. అది (సూకవర్ణము ంకెనపువ్వు) కలది ఉదు నికి పన్నె దళాలున్నాయి. వాటిలో కాళరాత్రి నుంచి ఠంకారిణి వరకు శక్తులు ఆదళాలలో ఉంటాయి. ఈచక్రము సాధకులకోర్కెలను తీరుస్తుంది. దీనికర్ణికలో షట్కోణాకృతిగా ధూమవర్ణములో వాయుమండలమున్నది యం బీజము. దీని వాహనము లేడి ఇక్కడకాకిని దేవత ఉన్నది ఆమెపీతవర్ణము, మూడుకనులు కలిగి, నాలుగు చేతులయందు శూలము కపాలము అక్షమాల,డమరుకము ధరించిఉంటుంది పుర్రెలమాల మెడనుధరించి ఉంటుంది

విశుద్ధచక్రము:

కంఠ స్థానంలో పద హదళాలలతో ఉంటుంది. ఇది ఆకాశ తత్వాత్మకమైనది దీనిని గురించి లలితా సహస్రంలో ఈవిధంగాఉంది

విశుద్ధచక్రనిలయా రక్తవర్ణా త్రిలోచనా
ఖట్వాంగాదిప్రహరణా వదనైకసమన్వితా
పాయసాన్నప్రియాత్వక్స్థాపశులోకభయంకరీ
అమృతాది మహాశక్తిసంవృతా డాకినీశ్వరీ॥

కంఠస్థా హాని కొంచెందిగువన విశుద్ధ చక్రమున్నది. అది తెల్లనిరంగుగల పద్మము పదహారు దళాలు కలిగి ఉంటుంది. అచ్చులు మొత్తం ఈదళాలలో ఉంటాయి. అం అఃగవరకు

అంటే సమయాచారులు ఈదళాలని పూజిస్తారు. ఈపద్మము కర్ణికలో వజ్రేశ్వరి ఉంటుంది. ఈమెను వాగీశ్వరీ అనికుడా అంటారు. మాతృకావర్ణములు ఇక్కడ నుండి ప్రారంభమవుతాయి, వజ్రేశ్వరి తెలుపుతో కూడిన ఎరుపు (పాటలవర్ణము) తో ఉంటుంది. ఈమెకు మూడునేత్రములుంటాయి అవి చంద్రసూర్యాగ్నులకు, ఋగ్, యజు సామవేదాలకు, భూతభవిష్యద్వర్తమానాలకు, సత్వరజస్తమోగుణాలకు ప్రతీకలు. ఈమెనాలుగుచేతులయందు ఖట్వాంగము (చర్రకుగుచ్చబడినమానవునిపుర్రె) ఖడ్గము,త్రిశూలము,చర్మము ధరించి,ఒకే ముఖంకలిగి ఉంటుంది. ఈదేవిపాయసాన్నప్రియ. చర్మమను ధాతువునందు అభిమానము కలది. జ్ఞానహీనులు,అద్వైత భావనలేని వారు అయి పశువులతో సమానమైన జనులకు భయంకలిగిస్తుంది. పదహారుదళాలలోనువరుసగా.

1. అమృత
2. ఆకర్షిణీ
3. ఇంద్రాణి
4. ఈశాని
5. ఉషఃకేశ
6. ఊర్ధ్వ
7. ఋద్ధిద
8. ౠకార
9. ఌకార
10. ౡ
11. ఏకపదా
12. ఐశ్వర్యా
13.ఓంకారి
14. ఔషధి
15. అంబికా
16. అఃక్షరా

అనబడేపదహారుశక్తులచేత పరివేష్టించబడిఉంటుంది. ఈదేవతకు బీజము న్యాసము,మంత్రసంకేతముగా ఠ కారముంటుంది కాబట్టి ఈమె డాకిని అంటారు. యోగినీన్యాసములో విశుద్ధచక్రముగురించి ఈవిధంగా ఉంది.

గ్రీవాకూపే విశుద్ధౌ. నృపదళకమలే శ్వేతవర్ణాం త్రినేత్రాం
హస్తైః ఖట్వాంగ ఖడ్గౌ త్రిశిఖ మపి మహాచర్మ సంధార యంతీం।
వక్త్రేణైకేన యుక్తాం పశుజనభయదాం పాయసాన్నైక సక్తాం
త్వక్స్థాం వందేఽమృతాద్యైః పరివృతవపుషాం డాకినీం వీరవంద్యాం॥

కంఠస్థానమున విశుద్ధచక్రము పదహారుదళములుగల పద్మము. దీని యందు ఎర్రని రంగులో మూడుకనులు కలిగి ఖట్వాంగము, ఖడ్గము, త్రిశూలము,చర్మము ధరించి ఒకేముఖముతో పశువులనబడు అజ్ఞానులకు భయముకలిగించుచు, పాయసాన్నమునందు ప్రీతికలిగి,అమృతమొదలైన పదహారుమంది శక్తులతోపరివృత అయిన డాకినీదేవికి నమస్కరించుచున్నాను.

విశుద్ధచక్రాధిష్ఠానదేవతా డాకినీయుక్త జీవేశ్వరస్వరూపిణ్యంబా
శ్రీపాదుకాంపూజయామి తర్పయామినమః।

డాకినీ దేవత రూపము, విశుద్ధచక్రము ప్రక్క పేజీలలో ఇవ్వబడినాయి. శంకరభగవత్పాదులవారు సౌందర్యలహరిలో విశుద్ధచక్రాన్ని ఈవిధంగా వర్ణించారు

విశుద్ధౌతే శుద్ధస్ఫటిక విశదం వ్యోమజనకం
శివం సేవేదేవీమపి శివసమాన వ్యవసితాం।
యయోఃకాంత్యా యాంత్యా శశికిరణ సారూప్య సరణే
ర్విధూతాం తర్ధ్వాంతా విలసతి చకోరీవ జగతి॥

విశుద్ధచక్రంలో స్ఫటికమువలె స్వచ్ఛమైనవాడు ఆకాశతత్వాత్మకుడు అయిన శివుడు, అతనితోసమానమైన దేవి ఉంటారు. ఇక్కడశివాశివులు శుద్ధస్ఫటికాలవలె ప్రకాశిస్తూ ఉంటారు. ప్రాణాయామంచెయ్యటంవల్ల కాంతిని కోల్పోయిన షోడశకళలకు శివాశివులశరీర కాంతులచేమళ్ళీ ప్రకాశము కలుగుతుంది అంటే సాధకుడి అజ్ఞానము తొలగింపబడుతుంది. విశుద్ధచక్రము గురించి షట్చక్రనిరూపణలో ఈవిధంగా ఉన్నది.

విశుద్ధాఖ్యం కంఠేసరసిజమమలం ధూమధూమ్రావభాసం
స్వరైః సర్వైః శోణైర్దళపరిలసితైర్దీపితం దీ ప్తబుద్ధేః।
సమాస్తే పూర్వాంతేప్రథితతమసభోమండలంవృత్తరూపం
హిమచ్ఛాయా నాగోపరిలసితతనోః శుక్ల వర్ణాంబరస్య॥
భుజైః పాశాభీత్యంకుశవరలసితైః శోభితాంగస్యతస్య
మనోరం కేవిత్యం నివసతిగిరిజాభిన్న దేహో హిమాభః।
త్రినేత్రఃపంచాస్యో లలితదశభుజో వ్యాఘ్రచర్మాంబరాఢ్యః
సదా పూర్వో దేవః శివ ఇతి చ సమాఖ్యానసిద్ధః ప్రసిద్ధః।
సుధాసింధోః శుద్ధా నివసతి కమలే సాకినీ పీతవస్త్రా
శరం చాపం పాశం సృణిమపి దధతీ హస్తపద్మైశ్చతుర్భిః।
సుధాంశోః సంపూర్ణం శశపరిరహితమండలం కర్ణికాయాం
మహామోక్షద్వారం శ్రియ మభిమతశీలస్య శుద్ధేంద్రియస్య॥
ఇహ స్థానే చిత్తం నిరవధి నిధాయాత్మసంపూర్ణ యోగః
కవిర్వాగ్మీజ్ఞానీ స భవతి నితరాం సాధకః శాంతచేతాః।
త్రికాలానాం దర్శీ సకలహితకరో రోగశోకప్రముక్త
శ్చిరంజీవీ జీవీ నిర నధివిపదాం ధ్వంసహంసప్రకాశః॥

కంఠస్థానమున పదహారు దళములు కలిగిన విశుద్ధి చక్రమున్నది. దీని దళములయందు అమృతామొదలు అఃక్షరా వరకు స్వరరూపు లైన శక్తులున్నాయి. దీనికర్ణికయందు వృత్త

రూపంలో ఉన్న వియన్మండలంము చంద్రబింబమువలె ప్రకాశిస్తుంది. దీనికి బీజము హం ఆకాశ బీజము. దీనికి.(ఆబీజమునకు) నాలుగుచేతులున్నాయి. వాటియందు పాశము, అంకుశము, వరద, అభయముద్ర లుంటాయి. ఆబీజమందు ఐదుముఖములు, మూడుకనులు.పదిచేతులు కలిగి వ్యాఘ్రచర్మధారియైన సదాశివుడుంటాడు. ఈ చక్రము నకు అధిదేవత డాకిని. యోగాభిలాషులగువారికిది మోక్షద్వారము,

**ఆజ్ఞాచక్రము:**

"హంక్షేత్యక్షరపద్మపత్ర యుగళం రత్నే సమాజ్ఞాపురీం"

భ్రూమధ్యభాగంలో రెండుదళాలు కలిగిన చక్రాన్ని ఆజ్ఞాచక్రము అంటారు. ఈదళము లయందు హం, క్షం వర్ణములుంటాయి. లలితాసహస్రంలో ఆజ్ఞాచక్రంగురించి ఈవిధంగా ఉన్నది,

ఆజ్ఞాచక్రాబ్జనిలయా శుక్లవర్ణా షడాననా
మజ్జాసంస్థా హంసవతీముఖ్యాశక్తిసమన్వితా
హరిద్రాన్నైకరసికా హాకినీరూపధారిణీ

కనుబొమలమధ్యగలచక్రాన్ని ఆజ్ఞాచక్రము అంటారు. దీనిలో ఆధార,స్వాధిష్ఠానాలకు ప్రతీకగా రెండుదళాలుంటాయి. ఇదిమనస్తత్వాత్మకమైన చక్రము. దీనికర్ణికయందు గలదేవి సిద్ధమాత. పుట్టుకతోనేజ్ఞానవైరాగ్యములుకలసిద్ధులకుతల్లి, నమస్కరించినంత మాత్రంచేతనే భక్తులకోర్కెలు తీర్చు వరదాయిని. భృకుటిస్థానము గంగ యమున సరస్వతుల సంగమము, ఇడపింగళసుషుమల సంగమము. కూటత్రయము, ఖండత్రయము ఇది త్రిపురానివాసస్థానము. శరీరంలోని ఇంద్రియాలకు ఇక్కడనుండి ఆజ్ఞలు జారీ అవుతాయి. అందుకనే దీనిని ఆజ్ఞాచక్రమంటారు. ఇక్కడ సిద్ధమాత తెల్లనిశరీరంతో, ఆరుముఖములుకలిగి ఉంటుంది కాబట్టిఈమెను కుమారస్వామిశక్తిగా భావించాలి. ఈ దేవత ఎముకలలోని మజ్జ యందు ఉంటుంది. ఈచక్రములోని రెండుదళాలయందు హంసవతీ, క్షమావతీ అనుశక్తులుంటాయి, ఈరెండింటినీ ఉచ్ఛ్వాస నిశ్వాసలుగా భావించాలి. ఈరెండూ ప్రాణికిముఖ్య శక్తులు, అందుకే 'ముఖ్యాశక్తిసమన్వితా' అనిచెప్పటంజరిగింది. ఈమెకు హరిద్రాన్నమునందు ప్రీతి. ఈదేవత బీజము, న్యాసము, కీలకము, మంత్రము హ కారసంకేతములు. అందుకే ఈమెను 'హాకినీ' అంటారు,యోగినీ న్యాసములో హాకినీ ధ్యానము ఈవిధంగా ఉన్నది.

భ్రూమధ్యే బిందుపద్మే దళయుగకలితే శుక్ల వర్ణాం కరాబ్జై
ర్బిభ్రాణాం జ్ఞానముద్రాం డమరుక కమలాక్ష మాలాంకపాలం ।
షట్చక్రాధారమధ్యాం త్రినయన లసితాం హంస వత్యాది యుక్తాం
హరిద్రాన్నైకసక్తాం సకల శుభకరీం హాకినీం భావయామః ॥

ఆజ్ఞాచక్రంలో తెల్లనిరంగుతో ఆరుముఖములు, మూడు కనులలో చేతులయందు కపాలము, అక్షమాల, డమరుకము, జ్ఞానముద్ర ధరించినది, మజ్జయందుండునది, హంసవతి క్షమావతి అనుశక్తులచేపరివృత అయినది, హరిద్రాన్నమందుమక్కువ కలది, సకలసుఖములను ఇచ్చునది అయినహాకినీదేవికి నమస్కరించుచున్నాము.

ఆజ్ఞా చక్రాధిష్ఠానదేవతా హాకినీయుక్త పరమాత్మ
స్వరూపిణ్యంబా శ్రీపాదుకాంపూజయామినమః

ఆజ్ఞాచక్రము, హాకినీదేవి రూపము ప్రక్కపేజీలలో ఇవ్వబడినవి.

సౌందర్యలహరిలో శంకరులవారు ఆజ్ఞాచక్రాన్ని ఈవిధంగావర్ణించారు.

తవాజ్ఞా చక్రస్థం తపనశశికోటి ద్యుతిధరం
పరం శంభుం వందే పరిమిళితపార్శ్వం పరచితా
యమారాధ్యన్ భక్త్యా రవిశశిరుచీనామ విషయే
నిరాలోకే లోకే నివసతి హి భాలోకభువనే॥

ఆజ్ఞాచక్రంలో శివాశివులు కోట్లకోలది సూర్యచంద్రులకాంతులతో ప్రకాశిస్తుంటారు.

లొల్లా లక్ష్మీధరుడు 'కర్ణావనస్తుతి'లో

ఆజ్ఞాత్మక ద్విదళపద్మగతేతదానీం విద్యున్నిభే రవిశశిప్రయుతోత్కటాభే
గండస్థలప్రతిఫలత్కరదీపజాల కర్ణావతంసకలికేకమలాయతాక్షి.

ఆజ్ఞాచక్రస్వరూపమగుద్విదళపద్మమందున్న ఓదేవీ, మెరుపుతీగవలె పది లక్షలసూర్య చంద్రులకు మించినకాంతితో, విశాలమైన నేత్రములతో ప్రకాశించుచున్నావు.

షట్చక్రనిరూపణలో ఆజ్ఞాచక్రాన్ని గురించి ఈవిధంగా ఉంది.

ఆజ్ఞానాంబుజం తద్ధిమకరసదృశం ధ్యానధామప్రకాశం
హక్షాభ్యాం వైదలాభ్యాం పరిలసితవపుర్నేత్ర పత్రంసుశుభ్రాం।
తన్మధ్యే హాకినీ సా శశి సమధవలావక్త్రషట్కం దధానా
విద్యాం ముద్రాం కపాలం డమరుజలవటీం బిభ్రతీ శుద్ధచిత్తా॥
ఏతత్పద్మాంతరాలేనివసతి చ మనః సూక్ష్మరూపంప్రసిద్ధం
యోనౌతత్కర్ణికాయా మితరశివపదం లింగ చిహ్నప్రకాశం,।
విద్యున్మాలావిలాసం పరమకుల దం బ్రహ్మసూత్ర ప్రబోధం
వేదానామాదిబీజంస్థిరతర హృదయశ్చింతయే త్తత్క్రమేణ॥
ధ్యానాత్మా సాధకేంద్రో భవతి పరపురే శీఘ్రగామీ మునీంద్రః॥

సర్వజ్ఞః సర్వదర్శీసకలహితకరః సర్వశాస్త్రా ర్థవేత్తా।
అద్వైతాచారవాదీ విలసతి పరమాపూర్వసిద్ధి ప్రసిద్ధో
దీర్ఘాయుః సోఽపికర్తా త్రిభువనభవనే సంహృతౌ పాలనే చ॥
తదంతశ్చ క్రేఽస్మి న్నివసతి సతతం శుద్ధ బుద్ధ్యాంతరాత్మా
ప్రదీపాభజ్యోతిః ప్రణవవిరచనారూపవర్ణప్రకాశః।
తదూర్ధ్వే చంద్రార్ధ స్తదుపరివిలసద్బిందురూపమకార
స్తదూర్ధ్వంనాదోఽసౌ జలధవళసుధాధారసంతానహాసీ ॥
ఇహస్థానే లీనే సుసుఖసదనే చేతసి పురం
నిరాలంబా బధ్వాపరమగురుసేవా మవిదితామ్।
తదభ్యాసాద్యోగీ పవనసుహృదాం పశ్యతి కణాన్
తత స్తన్మధ్యాంతః ప్రవిలసితరూపానపి సదా॥
జ్వలద్దీపాకారాం తదను చ నవీనార్క బహుళ
ప్రకాశం జ్యోతిర్వా గగనధరణీ మధ్యమిళితం।
ఇహస్థానే సాక్షాద్భవతి భగవన్ పూర్ణవిభవే
ఽవ్యయః సాక్షీ వహ్నే ః శశిమిహిర యోర్మండల ఇవ॥
ఇహస్థానే విష్ణో రతుల పరమామోదమధురే
సమారోప్య ప్రాణం ప్రముదితమనాః ప్రాణనిధనే।
పరం నిత్యం దేవం పురుషమజమాద్యం త్రిజగతాం
పురాణం యోగీంద్రః ప్రవిశతి చ వేదాంతవిదితమ్॥

ఆజ్ఞాచక్రము భ్రూమధ్యమున ఉన్నది ఇది శరీరంలోని అన్ని అవయవాలకు ఆజ్ఞా లభించుస్థానము. ఇదే గురువు యొక్క ఆజ్ఞ లభించుస్థానము, దానికి రెండుదళాలున్నాయి. అక్కడ ఉన్న అక్షరములు తెల్లనిరంగులో ఉంటాయి.

"ఆజ్ఞాచక్రంతదూర్ధ్వేతు శుక్లం ద్విదళమండితం
కర్పూరహక్షలసితం మనోఽ ధిష్ఠితరంజితమ్"

అని 'సమ్మోహనతంత్రం' లోచెప్పబడింది. దీనిలో ఆరుముఖములతో హాకినీశక్తి ఉన్నది, ఆమెతనచేతులందు పుస్తకము, అక్షమాల, కపాలము, డమరుకము, వరదఅభయముద్రలు ధరించినది. ఇది మనస్తత్త్వాత్మకమైనచక్రము. ఈచక్రమునందు శివుడువిద్యుత్కాంతులతో ప్రకాశించుచున్నారు, ఇక్కడబీజము 'ఓం' ఇక్కడ ఉపాసన చేయు సాధకుడు జ్ఞానాత్ముడవుతాడు. సర్వజ్ఞుడై, సర్వదర్శి అయిన మునీంద్రుడు, అందరిక్షేమం కోరేవాడు,బ్రహ్మద్వైతి అవుతాడు. సృష్టిస్థితిలయాలు కూడ చేయకలుగుతాడు. ఈచక్రంలో

# ఆజ్ఞాచక్రము






1. యోని ముద్ర





౨. ఖేచరీముద్ర

త్రికోణమున్నది. ఆత్రికోణంలో ప్రణవానికి ఆధారమైన (అ+ఉ) అక్షరాలుంటాయి. అది శుద్ధబుద్ధి. దానిమీద బిందురూపంలో మ కారము ఉంటుంది.

యోగి అయిన సాధకుడు యోనిముద్రతోబంధించుకుని, పరమాత్మ స్వరూపుడైనగురువువలన ఈబంధనముతెలుసుకొని మనస్సును లయముచెయ్యాలి. అది ఆనందనిలయము సిద్ధాసనములో ఉండి యోనిముద్రప్రదర్శించాలి. సాధకుడు పద్మాసనంలోకూచుని ఎడమకాలిమడమతో గుదస్థానాన్నిమూయాలి. కుడి కాలును ఎడమకాలి మీద ఉంచాలి. అప్పుడుశరీరము,మెడ,తల,నిటారుగావుంచి మూతిని కాకిముక్కు వలెచేసి గాలి లో పలకుపీల్చి కుంభించాలి. బొటనవ్రేళ్ళతోముక్కు రంధ్రాలను మూసి,మిగిలిన వ్రేళ్ళతో నోటిని మూయాలి. ఇంద్రియాలను వదలివేసి అంటే మనసును శరీరంనుంచి వేరుచేసి మంత్ర పురశ్చరణచెయ్యాలి. ఆ స్థితిలో మనస్సుకు ప్రాణానికి ఐక్యత చేకూరుతుంది.. యోనిముద్రవలన మనస్సుకు ఏకాగ్రతవస్తుంది. హంస అనేది జీవాత్మ. జీవాత్మయొక్క అంశము ప్రాణము. ఈప్రాణముయొక్క ప్రభావముచేతనే మనస్సు చలిస్తుంది. హంసను అంటే జీవాత్మను గనక నిరోధించినట్లైతే ఏకాగ్రత సిద్ధిస్తుంది. అయితే ఖేచరీముద్రతోకుడా ఏకాగ్రతలభిస్తుంది. తరువాత యోగిదీపాకృతి గలజ్యోతిని చూడగలుగుతాడు. అదిబాలభానుడి వలె ప్రకాశిస్తూ ఉంటుంది. ఇక్కడ్నిక్షాగవల 'త్కారముకలుగుతుంది. ఆయన అవ్యయుడు. సృష్టిస్థితిలయకారకుడు. అదిశివశక్తి తత్త్వము. యోని, ఖేచరీముద్రలను ఇచ్చటచూపటం జరిగింది.

సహస్రారము.

"తస్మాదూర్ధ్వమధోముఖం వికసితం పద్మం సహస్రచ్ఛదం
నిత్యానందమయా సదా శివపురీ శక్తైనమశ్మాత్వతం॥"

సహస్రారపద్మము బ్రహ్మరంధ్రానికి కొంచెందిగువన వేయిదళాలతో ఉంటుంది. అదినిత్యానందమయ మైనశివపురము. లలితాసహస్రంలో దీన్నిగురించి ఈవిధంగాచెప్పటం జరిగింది

సహస్రదళపద్మస్థా సర్వభితాపశో •
సర్వాయుధధరా శుక్లసంస్థితా సర్వతోముఖీ
సర్వౌదనప్రీతిచిత్తా యాకిన్యంబాస్వరూపిణీ

షట్చక్రాలకుపైన, బ్రహ్మరంధ్రందగ్గర ఉండేచక్రాన్ని సహస్రదళపద్మము అంటారు. దీనికర్ణికలో యశశ్విని అనేదేవతఉంటుంది. సిద్ధేశ్వరి, సిద్ధవిద్య, సి అసితా ఏచెప్పబడు ఈపరమేశ్వరి సకలప్రపంచానికి సిద్ధిప్రదాయని ఆమెగొప్పదైన యశస్సుకలది. అందుకనే సహస్రారంలో ఉన్నఈదేవిని 'యశశ్విని' అంటారు ఈమెనే 'మేధాదేవి' అనికుడాఅంటారు. సహస్రారంలో ఉండే ఈదేవి ఎరుపు, తెలుపు, పసుపు, నలుపు,నీలము మొదలైన అన్నిరంగులలోనూకలసి చిత్రమైన కాంతితో ప్రకాశిస్తూ ఉంటుంది. అందుకని ఆమె 'సర్వవర్ణేమహాదేవీసంధ్యావిద్యేసరస్వతి' అనిచెప్పబడుతోంది అమృతామొదలుక్షమావతివరకు యాభైశక్తులచేతపరివృతయై అకారాదిక్షకారాంతము వర్ణక్రమంలో అనులోమవిలోమాలుగా

## సహస్రదళపద్మము






ఒక్కొక్కసారికి వందచొప్పున వదివృత్తాలలోను వేయిమందిశక్తులుంటారు. ఇక్కడదేవితనచేతులయందుఅన్ని రకాల ఆయుధాలను ధరించి ఉంటుంది. ఈమెశుక్లమను ధాతువుది. నదుంటుం అన్నిదిక్కులకు ముఖములు కలిగిఉంటుంది. మంత్రశాస్త్రంలో బీజము, మంత్రము, కీలము, అన్నీ య కారసంకేతములు. అందుచేతనే ఆదేవిని 'యాకిన్యంబా' అంటారు. యోగిని ధ్యానంలో సహస్రారం గురించి ఈ విధంగా ఉంది.

ముండవ్యోమస్థపద్మే దళశతదళకే కర్ణికా చంద్ర సంస్థాం
రేతో విష్ఠా సమస్తాయుధకలితకరాం సర్వతో వక్త్రపద్మామ్।
ఆదిక్షాంతార్ణ శక్తిప్రకర పరివృతాం సర్వవర్ణాం భవానీం
సర్వాన్నాసక్తచిత్తాం పరశివరసికాం యాకినీం భావయామః॥

బ్రహ్మరంధ్రానికి దిగువగా సహస్రారమున్నది. దీనికి వేయిదళాలున్నాయి. దీనికర్ణిక చంద్రమండలము. ఇక్కడ ఉండేదేవిపేరు యాకిని. ఆమెపరమేశ్వరి. శుక్లధాతువు కధిపతి. సర్వాయుధములు ధరించి, అన్నిరకాల భక్ష్యములందు ప్రీతికలిగి, అన్నిదిక్కులకు ముఖములుకలిగి ఉంటుంది. ఈమెను అకారమునుండిక్షకారమువరకు గల యోగినీగణముసేవిస్తూ ఉంటుంది, ఇది ఆత్మతత్వాత్త కమైన కష్టస్థము. యా దేవత మంత్రద్రూపంతో ంగా ఉంటుంది.

। బ్రహ్మహమస్మి హ్మహమస్మి। అహమస్మి। బ్రహ్మహమస్మి। తత్త్వమసి। బ్రహ్మహమస్మి। సోహంబ్రహ్మస్మి। ఓం బ్రహ్మహమస్మి। ఆత్మైవేదగ్ం సర్వం। బ్రహ్మైవేదగ్ం సర్వం। సర్వమేతద్బ్రహ్మ। సర్వంఖల్విదంబ్రహ్మ। బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి॥

సహస్రదళపద్మము, యాకినీదేవతాస్వరూపము ప్రక్కపేజీలలో ఇవ్వబడ్డాయి. సౌందర్యలహరిలో కరభగవత్పాదులవారు సహస్రదళపద్మాన్ని ఈవిధంగా వర్ణించారు.

మహీంమూలాధారే కమపిమణిపూ రే హుతవహం
స్థితంస్వాధిష్ఠానే హృదిమరుత మాకాశముపరి।
మనోఽపిభ్రూమధ్యే సకలమపి భిత్వాకులపథం
సహస్రారేపద్మే స హరహసి పత్యావిహరసే॥

షట్చక్రాలుదాటినతరువాత సహస్రదళపద్మంలో భగవతి పరమశివునితో కలసి విహరిస్తూ ఉంటుంది. సహస్రారం గురించి షట్చక్రనిరూపణలో ఈవిధంగా ఉంది.

లయస్థానం వాయో స్తదుపరిచ మహానాదరూపం శివార్థం
సిరాకారం శాంతం వరదమభయం శుద్ధి బుద్ధి ప్రకాశమ్।
యదా యోగీపశ్యద్గురుచరణయుగాంభోజసేవా సుశీల

ప్రదావాచాం సిద్ధిః కరకమలతలే తస్యభూయాత్ సదైవ॥

యోగిఆజ్ఞాచక్రముదాటిన తరువాత మహానాదాన్ని దర్శిస్తాడు. అతడికివాక్సిద్ధికలుగుతుంది. మహానాదము నాగలి రూపంలో ఉంటుంది అది శాంతమైనది. వరప్రదాయని, అభయ ప్రదాయని, శుద్ధబుద్ధి ప్రకాశమైనది. వాయువుకు మహానాదములయస్థానము.

తదూర్ధ్వే శంఖిన్యానివసతిశిఖరే శూన్యదేశే ప్రకాశం
విసర్గాధః పద్మం దశశతదళం పూర్ణ చంద్రాతి శుభ్రమ్
అధోవక్త్రం కాంతం తరుణ రవి కలాకాంతి కింజల్కపుంజం
లకారాద్యై వర్ణై ప్రవిలసితవపుః కేవలానందరూపమ్

ఆశూన్యమందు, విసర్గకు క్రిందగా సహస్రదల పద్మమున్నది. అది పూర్ణ చంద్రుని లాగా ప్రకాసిస్తూ ఉంటుంది. అది అధోముఖంగా ఉంటుంది. దాని కాంతి కిరణాలు సూర్యకిరణాలవలె ప్రకాశిస్తుంటాయి. అక్కడ అకారాది సర్వ వర్ణములు ఉన్నాయి. అదికేవలానందరూప మైనది.

సమాస్తే తస్యాన్తః శశిపరి రహితః శుద్ధసంపూర్ణ చంద్రః
స్ఫురజ్జ్యోత్స్నాజాలః పరమరసచయ స్నిగ్ధ సంతానహాసీ।
త్రికోణం తస్యాంతఃస్ఫురతి చ సతతం విద్యుదాకారరూపం
తదంతః శూన్యం తత్సకల సురగణైః సేవితంచాతిగుప్తమ్॥

సహస్రదళ పద్మంలో కళంకములేనటువంటి పూర్ణచంద్రుడున్నాడు. ఆ చంద్రమండలము మధ్య నత్రికోణమున్నది. దానియందు మహాశూన్యమున్నది. దానిని దేవతలు రహస్యంగా సేవిస్తుంటారు.

సుగుప్తం తద్యత్నా దతిశయపరమామోద సంతానరాశేః
పరం కదం సూక్ష్మం సకల శశికలాశుద్ధరూప ప్రకాశమ్ ।
ఇహ స్థానే దేవః పరమశివసమాఖ్యానసిద్ధః ప్రసిద్ధః
స్వరూపీసర్వాత్మారసవిరసమితో 2 జ్ఞాన మోహాంధహంసః॥

ఆశూన్యము చాలా రహస్యమైనది. అతి ప్రయత్నము మీద గాని దానిని పొందలేరు. అది పరమామోదమైన సంతానరాశి. పరమశివుడు ఇక్కడే ఉంటాడు. ఆయన సర్వాత్మ స్వరూపి. అజ్ఞానమును, మోహమును పోగొడతాడు.

సాధకుడికి భగవానుడు సుధాధారాసారముచే ఆత్మజ్ఞానము కలిగిస్తాడు. అప్పుడు సాధకుడు జీవాత్మ పరమాత్మల సమైక్యము సాధించి సర్వేశ్వరుని లాగా పరమహంస అవుతాడు. శైవులీస్థానాన్ని శివస్థానమని, వైష్ణవులు పరమపురుషస్థానమని, మిగిలినవారు

హరిహర స్థానము అని, ప్రకృతి పురుషుల స్థానమని, దేవి భక్తులు దేవీస్థానమని అంటారు.

శివస్థానం శైవాః పరమపురుషం వైష్ణవగణాః
లపంతీతి ప్రాయో హరిహరపదం కేచిదపరే।
పదం దేవ్యా దేవీచరణయుగలాం భోజరసికాః
మునీంద్రా అప్యన్యే ప్రకృతిపురుష స్థానమమలమ్॥
ఇదం స్థానం జ్ఞాత్వా నియతనిజచిత్తే వరవరో
నభూయాత్ సంసారే పునరపి న బద్ధస్త్రిభువనే।
సమగ్రాశక్తిః స్యాన్నియమమనసస్తస్యకృతినః
సదాకర్తుం భర్తురపి వాటీ సువిమలా॥

ఈస్థానాన్ని తెలుసుకున్న సాధకుడికి పునర్జన్మలేదు. ఈ లోకంతో బంధము ఉండదు.అతనికి పాపపుణ్యాలు లేవు. సంసారబంధనాలు ఉండవు. అతనికి ఇష్టార్థసిద్ధి కలుగుతుంది. ఇక్కడ షోడశీకల ఉంటుంది. బాలభానునివలె ప్రకాశిస్తూ ఉంటుంది. తామర తూడులోని దారములాగా సన్ననైనది. ఆమె భగవతి. జ్ఞానదాత్రి. త్రిభువనజనని. ఆమె యందు నిత్యమైన శివపదము ఉన్నది. అది నిత్యానందమైనది. జ్ఞాన రూపమైనది. దీనినే బ్రహ్మము, హంసము, విష్ణుపదము,ఆత్మ జ్ఞానము, మోక్ష పదము అంటారు! ఇదే పరమపదము. ఇచటకు చేరిన యోగికి సాయుజ్యం లభిస్తుంది.

# 9. నాడీమండలము, వాయువులు

శ్రీవిద్యలో అంతఃపూజ అంటే షట్చక్రభేదనము చేసి, సహస్రారంలో దేవి సాక్షాత్కారంపొందటం.. ఈ రకంగా అంతః పూజ చేసేటందుకు శరీరంలోని నాడీ మండలము, వివిధరకాలైన వాయువు లను గూర్చి కొంతవరకైనా తప్పని సరిగా తెలుసుకోవాలి.

మానవశరీరంలో మొత్తం డబ్బైరెండు వేలనాడులున్నాయి. అన్ని నాడులకు ఆధారమై, మూలాధారమునుండి సహస్రారము వరకు వ్యాపించిఉన్న ఒక పెద్ద ఎముక ఉన్నది. దాన్నే బ్రహ్మదండి, మేరుదండము అంటారు.

ఆధారచక్రము నుంచి బ్రహ్మరంధ్రము వరకు వ్యాపించి ఉన్న నాడిని 'బ్రహ్మనాడి' అంటారు. దీనినే సావిత్రి, సరస్వతి అని కూడా అంటారు. ఇదే సుషుమ్నా నాడి. ఇదికుండలినీ శక్తి యుక్తమైనది. కుండలినీ శక్తి సర్పాకారం ధరించి ఆధారచక్రంలో అధోముఖంగా ఉంటుంది. సుషుమ్న మధ్య భాగంలో కుండలినీశక్తి తామరతూడులోని నూలులాగా ఉంటుంది. అందుకనే లలితా సహస్రంలో కుండలినీ శక్తిని "మహాశక్తిః కుండలినీ బిసతంతు తనీయసీ" అని చెప్పబడింది. సుషుమ్నానాడి ప్రాణవాయువు, జఠరాగ్ని, బుద్ధి, ప్రణవములకు స్థానమై ఉన్నది.

బ్రహ్మనాడికి రెండువేపులా, ఆధార చక్రమునుంచి ముక్కు రంధ్రముపై దాకా ఇడా, పింగళా అనే రెండు నాడులు వ్యాపించి ఉన్నాయి.

ఇడా చ నామవిఖ్యాపా। సోమమండలసంచరా
పితృయానమితిజ్ఞేయం। వామమాశ్రిత్యతిష్ఠతీ॥
దక్షిణే పింగళానాడీ। వహ్నిమండలగోచరా।
దేవయానమితిజ్ఞేయం। పుణ్యకర్మానుసారిణీ॥

ఇడానాడి చంద్రనాడి. ఇది పితృయానము. ఈనాడి పునరావృత్తికి అనుకూలము. ఇది ఎడమ ముక్కు లోని ఊపిరి నిశ్వాస రూపంలో చంద్రమండలాన్ని ఆశ్రయించి, ఆధార చక్రంనుంచి చంద్రమండలం వరకు ఉంటుంది.

శరీరం లోని కుడి భాగంలో పుణ్యకర్మాను సారిణి అయిఉండేది పింగళానాడి. ఇది సూర్యనాడి దేవయానము, పునరావృత్తి రహిత మైనది.

నాడీ మండలము బొడ్డునాశ్రయించి కోడిగ్రుడ్డు ఆకారంలో ఉన్నది. ఇడ, పింగళ నాడులు ఈ నాడీ చక్రంలోనే ఆవిర్భవించినాయి. నాడీమండలంలోని కొన్ని ముఖ్యమైననాడులను ఈ దిగువ వివరించటం జరుగుతోంది.

1. కనులచివర వరకు వ్యాపించిఉన్ననాడులను ' గాంధారి హస్తిజిహ్వ' అంటారు.
2. చెవులవరకువ్యాపించిఉన్ననాడులను 'పూష, అలంబూష' అంటారు.
3. కనుబొమలనడుమ ఉన్న నాడిని 'శుక్లము' అంటారు.

4. ముక్కుల రెండు ద్వారాలు, చెవులరెండు రంధ్రాలు, కనుబొమల క్రింది భాగంలో కలిసి ఉంటాయి. ఆ ప్రదేశాన్ని 'శృంగాటకము లేక చతుష్పదము' అంటారు.

5. ఇడ, పింగళనాడులు కనుబొమల మధ్యప్రదేశాన్ని చేరుతున్నాయి. ఆ ప్రదేశాన్ని 'త్రికూటము, త్రివేణీ సంగమము' అంటారు.

6. నోటిలో నాలుక చివర వరకు వ్యాపించిన నాడిని 'సరస్వతీ' నాడి అంటారు.

7. భక్ష్య, భోజ్యాది చతుర్విధ ఆహారములను భక్షించేది 'విశ్వోదరి' నాడి

8. కంఠ స్థానమున ఉండి ఆకలి దప్పులు కలిగించేది, జలపానము చేసేనాడిపేరు 'పయస్విని',

9. నాడీ చక్రమునందు ఉద్భవించి అధోముఖంగా మూడునాడులున్నాయి. శరీరంలోని వ్యర్థపదార్థాలను ఇవి బయటకు పంపుతాయి. వాటిలో

A. 'రక్తనాడి' రేతస్సును బయటకు పంపుతుంది.

B. 'సినీవాలీనాడి' మూత్రాన్ని బయటకు పంపుతుంది.

C. 'కుహూనాడి' మలాన్ని బయటకు పంపుతుంది.

10. భుజించిన ఆహారము యొక్క సారాన్ని గ్రహించి బ్రహ్మరంధ్రమందు చేరి అమృతాన్ని కలిగించేవి 'శంఖినీ, దామినీ' నాడులు.

11. అనాహత చక్రంలో నూటఒక్కనాడులున్నాయి. వాటిలో అమృతనాడి ఒకటి. అమృతనాడీ మార్గాన్నే మోక్ష మార్గము అని, కైవల్య మార్గమని అంటారు.

12. శరీరంలోని నాడులన్నింటిలోకీ ఇడ, పింగళ, సుషుమ్నా నాడులు ముఖ్యమైనవి. సుషుమ్నా నాడినే 'నాడీశిరోమణి' అంటారు. ఈ మార్గాన్ని తపోమార్గము అంటారు.

ఈ నాడులను గురించి 'ఉత్తరగీత' లో ఈ విధంగా చెప్పబడింది.

ఉత్తరగీత మహాభారతంలోని అశ్వమేధ పర్వంలో ఉంది. ఇది జ్ఞానమార్గాన్ని ప్రతిపాదిస్తుంది. ఇది భగవద్గీతకు పరిశిష్ట భాగము వంటిది అని పండితులంటారు. గౌడపాదులవారు దీనికి సంస్కృతంలో వివరణ వ్రాయగా 16వ శతాబ్దిలోతంజావూరు మండలంలోనివున్నారు గుడివాసి అయిన పరమానంద తీర్థుల వారు దీనికి టీక వ్రాశారు.

దేహేతు పశ్చిమే భాగే, వీణాదండాఖ్య దేహభృత్।
దీర్ఘాస్థిమూర్ధపర్యంతం బ్రహ్మదండేతి కథ్యతే॥
తస్యాంతే సుషిరం సూక్ష్మం బ్రహ్మనాడీతి సూరిభిః।
ఇడాపింగళ యోర్మధ్యే సుషుమ్నా సూక్ష్మరూపిణీ॥
సర్వం ప్రతిష్ఠితం తస్మిన్ సర్వగంధర్వతో ముఖం।
తస్య మధ్యగతాస్సూర్య సోమాగ్ని పరమేశ్వరా॥
భూతలోకాదిశః క్షేత్రసముద్రాః పర్వతాశ్శిలాః।

ద్వీపాశ్చ విమ్నగా వేదశాస్త్ర విద్యాకళాక్షరాః॥
సర్వమంత్ర పురాణాని గుణాస్పర్శాదయోపిచ।
బీజం బీజాత్మ కాస్తేషాం క్షేత్రజ్ఞ ప్రాణవాయవః॥
స మ్నాంతర్గతం విశ్వం తస్మిన్ స ప్రతిష్ఠితం।
ఈ ౯వతినాసేగ్రే పూర్వస్యాం ర్యం వర్తతే॥
అగ్నిలోక స్తథా జ్ఞేయశ్చక్షు స్తేజోవతీ పురీ।
యామ్యే : ధుమనీ శ్రోత్రేయమలోక ప్రతిష్ఠితః॥
నైరుత్యాద రత్నైరుతో లోక శ్రితః।
విభా: ప్రతిచ్యాం తు పృష్ఠే ఆరదికాపురీ॥
వ యోర్గంధవతీకర్ణ పార్శ్వే లోక ప్రతిష్ఠితః।
సౌమ్యే పుష్పవతీసౌమ్యా సోమలోక స్తు కంఠతః॥
వామకర్ణేతు విజ్ఞేయా దేహమాశ్రిత్య తిష్ఠతి
వామ చక్షుషి ఐశానం శివమస్తి మనోన్మయం।
మూర్ధ్నిబ్రహ్మపురీజ్ఞేయా బ్రహ్మాండం దేహమాశ్రితమ్॥

ఈ నాడులందు రెండు రకాలయిన వాయువులు సంచరిస్తూ ఉంటాయి. అవి
1. ప్రధాన వాయువులు. 2. ఉపవాయువులు.

1. ప్రధాన వాయువులనే ప్రాణవాయువులు అంటారు. ఇవి ఐదు రకాలు.

1. ప్రాణవాయువు. 2. అపానవాయువు.
3. వ్యానవాయువు 4. ఉదానవాయువు
5. సమానవాయువు.

1. ప్రాణవాయువు : ఇది వక్షస్థలము నందు ఉంటుంది. దీని అధిష్ఠానదేవత 'విశిష్ఠకుడు,' ఇది శ్వాసాదులను ఇడ, పింగళ నాడీ మార్గం గుండా బయటకు పంపుతుంది.

2. అపాన వాయువు : ఇది గుదస్థానంలో ఉంటుంది. దీనికి అధిష్ఠానదేవత 'విశ్వకర్త'. ఇది అధో ముఖంగా సంచారం చేస్తూ శుక్ల, మల, మూత్రాలను రక్త, కుహూ, సినీవాలీ నాడుల ద్వారా బయటకు పంపుతుంది. దీనివల్లనే మలమూత్రాలు అధోముఖంగా విసర్జింపబడతాయి.

3.వ్యానవాయువు: ఇది శరీరమంతా ప్రసరించి ఉంటుంది. దీనికి అధిష్ఠాన దేవత 'విశ్వయోని' . ఇది బయట శీతోష్ణాలను లోపలకు, లోపలివాటిని బయటకు పంపుతూ ఉంటుంది. భుజించిన ఆహారాన్ని శరీరమంతావ్యాపింపచేస్తుంది.

4. ఉదానవాయువు: ఇది కంఠస్థానంలో ఉంటుంది. దీనికి అధిష్ఠానదేవత 'అజుడు'. ఇది మన సుయొక్క సంకల్ప వికల్పాలను మాటల రూపంలో వెల్లడి చేస్తుంది. సుషుప్తవస్థలో

ఇంద్రియాలను స్వా ం చేసుకుని తనకు కారణమైన అజ్ఞానంలో మునిగిపోతుంది. జాగ్రదవస్థలో ఇంద్రియాలను వా ాటి స్థానాలలో నిలబెడుతుంది. ఈ వాయువు సుషుమ్నా మార్గం గుండా సహస్రా ం వరకు చరిస్తుంది.

5. స సం వాయువు: ఇది నాభిప్రదేశంలో ఉంటుంది. దీనికి అధిష్ఠాన దేవత 'జయుడు'. ఇది జఠరాగ్నిని ప్రజ్వలి చేసి, తినిన ఆహారం అరిగించి, శరీరంలోని డెబ్బైరెండువేల నాడీ మండలానికి సవ ంగా అందిస్తుంది.

ాన ఇదే విధ ఉపవాయువులు కూడా ఐదు రకాలు. అవి. 1. నాగ 2. కూర్మ 3. కృకర, 4. దేవదత్త 5. ధన యములు. వీటిలో

| | | |
|---|---|---|
| 1. నాగవా వు | - | వాంతిని కలిగిస్తుంది. |
| 2. కూర్మ యువు | - | కను రెప్పలను కదిలిస్తుంది. |
| 3. కృకర యువు | - | తుమ్ములను కలిగిస్తుంది. |
| 4. దేవదత్త వాయువు | - | ఆవలింతలు కలిగిస్తుంది. |
| 5. ధనంజ వాయువు | - | శరీరమంతా వ్యాపించి శరీరాభివృద్ధి కలిగిస్తుంది. |

ఈ యంగా శరీర ంని నాడీ మండలము, వాయువులు పనిచేస్తున్నాయి.

# 10. రాజయోగము

సాధన చేసేటప్పుడు కుండలినీశక్తిని ఆధారచక్రం నుండి సహస్రారం వరకు తీసుకొని వెళ్ళి భగవద్దర్శనము చెయ్యాలి. శరీరంలో షట్చక్రాలున్నాయని చెప్పబడింది. అయితే సాధకుని భ్రూమధ్యభాగము నుండి సహస్రార మధ్యభాగము వరకు సూక్ష్మ చక్రాలు అని చెప్పబడే తొమ్మిది చక్రాలున్నాయి. అవి వరుసగా క్రింద నుంచి పైకి

1. చంద్రమండలము
2. అర్ధచంద్రాకారము
3. రోధిని
4. నాదము
5. నాదాంతము
6. శక్తి
7. వ్యాపిక
8. సమనా
[illegible]

వీటిలో శ్రీచక్రంలో గల తొమ్మిది చక్రాలు సామరస్యము పొందుతున్నాయి. ఈ సూక్ష్మ చక్రాలు గురించి ఈ విధంగా చెప్పబడింది.

ఆజ్ఞాంతం సకలాప్రోక్తం తతస్సకలనిష్కళం
ఉన్మన్యంతం పరే స్థానే నిష్చ తథ [illegible] స్థితం ॥
దీపాకారార్థమాత్రశ్చ లలాటస్స్యతే ॥
అర్థమాత్ర స్తదాకారా: పాదవదూర్ధ్వ [illegible] త: ॥
జ్యోత్స్నా కారో తదర్థాంశో రోధిని తస్యవిగ్రహా ।
బిందుద్వయాంతరాళస్థో పేసమణి [illegible] ప్రభ: ॥
కలాంశో ద్విగుణాంశశ్చ నాదాంత్యదు:దు [illegible] జ్వల: ।
హలాకారస్తు బిల్వస్త [illegible] దుయుక్తో విరాజతే ॥
శక్తిర్వామ స్తబిందూద్యత్ని [illegible] పున: ।
వ్యాపికా బిందువిలసత్రికోణా గతా [illegible] ॥
[illegible] ందుబి [illegible] వ్యయాం [illegible] బుష్ట రేఖామయీ [illegible] పున: ।
సమనా బిందువిలసదృజా రేఖ్మనీ థో [illegible] ॥
[illegible] క్త్యా శ [illegible] నీనాం వపున్మూర్ధద్వాదశాన్ని [illegible] పం ।
[illegible] వతు [illegible] షష్ఠి స్తదూర్ధ్వం తద్ద్విగుణుణంత్య [illegible] తత: ॥
శక్త్యాదీనాం తు మాత్రాంశో మనోన్మన్యాస్తథోన్మని ।
దేశకాలావచ్ఛిన్నం తదూర్ధ్వం పరమం మహత్ ॥
నివర్గమందరం తత్తు పరానందనిఘూర్ణితమ్॥

అయితే సూక్ష్మ చక్రాల స్థానములను గురించిప్రవ్నా [illegible] యాలుకుడా ఉన్నాయి.

వీటి ప్రకారము

చం 1. ద్ర మండలము

ఏమండలవ (అజ్ఞాచక్ర నానికి పైన ఉన్నది)

(ఈ రోధిని రోధిని)

3. నాదము (అర్ధచంద్రమువలె ఉంటుంది)

4. నాదాంతము (మహా ము హలాకారములో ఉంటుంది. దీనిలోనే శక్తి, వ్యాపికలుంటాయి)

5. సమనా (దీనినే అజ్ఞ అని కూడా అంటారు.)

6. ఉన్మని (ఉ చేరిన వారు తిరిగి రావటం లేదు అని చెప్పబడుతోంది.

సూక్ష్మ చక్రాల గురించి వివిధ తంత్రాలలో వివిధ రకా గా చె బడినప్పటికీ ఈ సూక్ష్మ చక్రాలన్నీ కూడా తంత్ర సమ్మతములే.సాధకుడు ఒక్కొక్క చక్రము అధిగమించి పైకి వెడుతున్న కొద్దీ, క్రమేణా కొన్ని తత్వాలు వదలుకుంటూ వెళ్ళాలి. ఆ ఉరాలు విధంగా ఉంటాయి.

| | | |
|---|---|---|
| 1. మూలాధారము నందు | --- | పాద, గంధ,అఘ్రాణ తత్వములు |
| 2. స్వాధిష్ఠానమునందు | --- | ప్రాణి, తత్వ, రస ్వములు |
| 3. మణిపూరమునందు | -- | పర్శుద, , రూప తత్వములు |
| 4. అనాహతమునందు | -- | లింగ, స్పర్శ, త్వక్ తత్వములు |
| 5. విశుద్ధ చక్రమునందు | -- | శ్రవణ, శబ్ద, వాక్ తత్వములు |
| 6. అజ్ఞా చక్రమునందు | -- | అహంకారము, బుద్ధి. |

ఈ రకంగా ఉన్మనీ సంచారానికి వెళ్ళేప్పటకి ఆత్మ ఒక్కటే మిగులుతుంది.

తంత్రశాస్త్రాల ప్రకారం సూక్ష్మచక్రాలలో బీజన్యాసము కూడా చెప్పబడింది. ఆ బీజన్యాసము ఈ క్రింది విధంగా ఉన్నది.

| సూక్ష్మచక్రము | బీజము |
|---|---|
| 1. చంద్రమండలము | అం, ఆం, సౌః నమః |
| 2. అర్ధచంద్రమండలము | ఐం, క్లీం, సౌః నమః |
| 3. రోధిని | ం, క్లీం, సౌః నమః |
| 4. నాదము | హ్రైం,హ్క్లీం, హ్సౌః, నమః |
| 5. నాదాంతము | హ్సైం, హ్క్లీం, హ్సౌః,నమః |
| 6. శక్తి | హ్రీం, క్లీం, నమః |
| 7. వ్యాపిక | శ్రీం ప్రీం, , సౌః నమః |

| | |
|---|---|
| 8. సమన | హ్సౌం,హ్స్నౌం, నమః ః |
| 9. ఉన్మని | క ఏ ఈ ల హ్రీం। హ స క హ ల హ్రీం। స కల హ్రీం। నమః |
| 10. బ్రహ్మ రంధ్రము మహా బిందువు. | శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం క ఏ ఈ ల హ్రీం। హ స క హ ల హ్రీం। స కల హ్రీం। గె క్లీం ఐం ౹ హ్రీం శ్రీంనమః॥ |

సాధకుడు భ్రూమధ్యమునుంచి సహస్రారము మధ్య వరకు గల సూక్ష్మ చక్రాలలో సంచారము చేసేటప్పుడు కొన్ని దృశ్యాలు కనిపిస్తాయి. అలాగే కొన్ని ధ్వనులు కూడా వినిపిస్తాయి. వాటి వివ ా దిగువ ఇవ్వటం జరిగింది.

| కనిపించేమండలముపేరు | వినిపించే ధ్వని |
|---|---|
| 1. వియన్మండలము. | అంతర్గత ప్రాణఘోష |
| 2. తమో మండలము | చిణి నాదము |
| 3. మేఘ మండలము. | చిణి చిణి నాదము |
| 4. విద్యున్మండలము | ఘంటానాదము |
| 5. మహా మండలము | శంఖనాదము |
| 6. జ్యోతిర్మండలము. | తంత్రినాదము |
| 7. సూర్యమండలము | వేణునాదము |
| 8. చంద్రమండలము | భేరీనాదము |
| 9. అగ్ని మండలము | మృదంగనాదము |
| 10. హిరణ్మయ మండలము | మేఘనాదము |

సాధకుడు షణ్ముఖీ ముద్రతో తన చెవులను బంధించుకొని జాగ్రత్తగా వినినట్లైతే ఓంకారము మొదటగా 'చిణి' అని వినిపిస్తుంది. తరువాత ఆ శబ్దము హెచ్చి చిణి చిణి అని ఘోష పెడుతుంది. ఆ తరువాత ఘంటానాదములాగా వినిపిస్తుంది. ఆ ఘంటానాదము క్రమముగా విజృంభించి శంఖనాదముగా మారుతుంది. అది అతి మనోహరంగా మారి వీణమీటి నట్లుగా వినిపిస్తుంది. తరువాత వీణానాదము నిర్మలమై వేణు నాదము అవుతుంది. ఆ తరువాత అరిషడ్వర్గాలను జయించిన చిహ్నంగా భేరీ నాదము మ్రోగుతుంది. తరువాత విజయోత్సవ చిహ్నంగా రమణీయమైన మృదంగ నాదము, ఆ తరువాత ఆనంద వర్షపాతము జరుగుచున్నట్లు మేఘనాదము వినిపిస్తుంది. క్రమంగా ఈ నాదాలన్నీ పరానాదముతో కలిసిపోతాయి. ఆ స్థితిలో సాధకుని యొక్క మనస్సు, ప్రాణములు నాద బిందుకళలతో లీనమై పోతాయి. దీనినే తురీయావస్థ, ఉన్మని, అని అంటారు. ఈ అవస్థలో సాధకుడి యొక్క జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు పనిచేయటంమాని వేస్తాయి. బాహ్యప్రపంచముతో సాధకుడికి ఏ మాత్రం సంబంధం ఉండదు. మనస్సు సంకల్ప కారణము.కనుక ఏ విషయాన్నైనా సంకల్పం చేస్తుంది. దాన్ని ఇంద్రియాలు ఆచరణలో పెడతాయి. తురీయావస్థలో ఇంద్రియాలతో పాటుగా సంకల్ప కారణమైన మనస్సు కూడా పనిచేయటం మానివేస్తుంది. మనస్సు లేనటువంటి స్థితి కాబట్టే దీనిని అమనస్కయోగము అంటారు. ఇదే రాజయోగము.

# 11. కుండలినీ శక్తి

" ధ్యాయేత్ కుండలినీం దేవీం స్వయంభూలింగ వేష్టినీమ్
శ్యామాం సూక్ష్మాం సృష్టి రూపాం సృష్టిస్థితి లయాత్మికామ్
విశ్వాతీతామ్ జ్ఞానరూపాం చింతయే దూర్ధ్వ వాహినీమ్"
"ధ్యాయేత్ కుండలినీం దేవీ మిష్టదేవస్వరూపిణీమ్
సదా షోడశవర్షీయాం పీనోన్నతపయోధరామ్
నవయౌవన సంపన్నాం సర్వాభరణ భూషితామ్
పూర్ణ చంద్రప్రభాం రక్తాం సదా చంచలలోలనామ్"॥

కంకాళ మాలినీ తంత్రంలో కుండలినీ వర్ణన

కోటిచంద్ర ప్రతీకాశాం పరబ్రహ్మ స్వరూపిణీమ్
చతుర్భుజాం త్రినేత్రాం చ వరదాభయకరాంతథా॥
తథా పుస్తకవీణాంచధారిణీం సింహవాహినీమ్
గచ్ఛంతీం స్వాసనాం భీమాం నానారూప ధరాత్మికామ్॥"

స్వయంభూ లింగము పైన చిత్కళా శక్తి ఉన్నది. ఆమెయే పరమేశ్వరి. కలారూపిణి.సృష్టికార్యచతుర. సూక్ష్మ, నిత్యానంద పీయూషధారాధర. ఆమెతే జన్ము చేతనే ఈ బ్రహ్మాండము వెలుగు చున్నది. రుద్రయామళంలో కుండలినీ స్తవము ఈ విధంగా ఉంది.

కుండలినీ స్తవము

1. జన్మోద్ధార నిరస్తిణీహ తరుణీ వేదాది బీజాదిమా
నిత్యం చేతసి భావ్యతే భువికదా సద్వాక్య సంచారిణీ,
మాంపాతు ప్రియదాస భావకపదం సంఘాతయే శ్రీధరే!
ధాత్రిత్వం స్వయ మాదిదేవ వనితా దీనాతిదీనం పశుమ్.॥

ఓ పరాత్పరి! శివుని అర్ధాంగి అయిన ఓ పార్వతీ ! నీవు సర్వకాలసర్వావస్థలలోను ఉపనిషద్ వాక్యముల యందు సంచరిస్తుంటావు. ఓంకారస్వరూపిణివి. నిత్యయౌవనవు. మానవుల జన్మలనుద్ధరించటానికి సదామెలుకువతో ఉంటావు. అట్టి నిన్ను ఎల్లప్పుడు నేను ధ్యానం చేస్తుంటాను.

2. రక్తాభామృతచంద్రికా లిపిమయీ సర్పాకృతి ర్నిద్రితా
కుండల్యా కులమార్గ ముక్తనగరీ మాయా కుమార్గా శ్రియా।
యద్యేవం భజతి ప్రభాత సమయే మధ్యాహ్న కాలే థవా
నిత్యం యఃకులకుండలీ జప పదాంభోజం ససిద్ధోభవేత్.॥

తల్లీ। నీవు రక్తవర్ణముతో ప్రకాశిస్తూ సర్పాకృతిలో నిద్రిస్తున్నావు. నీవు జాగ్రదావస్థలోకి వచ్చినప్పుడు నీకరుణా దృక్కులు నామీద ప్రసరింపచేయుము.

3. సిద్ధార్థీ నిజదేవవిత్ స్థలగతి ర్వ్యాస్త 'య విద్యయా
కుండల్యా కులమార్గ ముక్తనగరీ మాయా కుమార్గా శ్రియా।
యద్యేవం భజతి ప్రభాత సమయే మధ్యాహ్నకాలే థవా
నిత్యం యఃకులకుండలీ జప పద్మాం భోః ససిద్ధోభవేత్.॥

దేవీ। కుండలినీ శక్తిగా ఉన్న నీ పాదాలను త్రిసంధ్యల యందు ఎవరైతే సేవిస్తారో వారు సిద్ధులౌతారు.

4 వాయ్వాకాశ చతుర్దతే 2 తి విమ్లస్థానే సలాన్యాలకే
నిత్యంసంప్రతి నిత్యదేహ ఘటితా సాంకేతితా భావితా,
విద్యాకుండలమానినీ స్వజననీ క్రియా యా భావ్యతే
మైస్రైః సిద్ధకులోద్భవైః ప్రణతిభిః సత్ స్తోత్రైః శంభుభిః

నీవు విద్యాస్వరూపిణివి మాయా స్వరూపిణివి.క్రియాస్వరూపిణివి. జగన్మాతవు. పంచభూతాలతో కూడిన ఈ బ్రహ్మాండము నీ శరీరంగా సిద్ధులు భావిస్తుంటారు.

5 వాతాశంక విమోహినీతి బలవచ్ఛాయాపటోద్గామినీ
సంసారాది మహాసుఖప్రహననే! తత్రస్థితా యోగినీ।
సర్వగ్రంథి విభేదినీ స్వభుజగా సూక్ష్మాతిసూక్ష్మా పరా
బ్రహ్మజ్ఞాన వినోదినీ కులకుటీ రాఘాతనీ భావ్యతే. ॥

అమ్మా। నీవు భుజంగా కారముతో ఉండి, గ్రంథిభేదనము చేసి సాధకుడు సుఖమని భావించే సంసార బంధనాలను త్రెంచివేసి బ్రహ్మజ్ఞానమందించే పరాశక్తివి.

6 వందే శ్రీకులకుండలీం త్రివలిభిః సాంగైః స్వయంభూప్రియాం
ప్రావేష్ట్యాంబర చిత్రమధ్య చపలా బాలాబలానిష్కలా.।
యాదేవీ పరిమాతి వేదవదనా సంభావనీ తాపినీ
ఇష్టానాంశిరసి స్వయంభూ వనితా సంభావయామి క్రియామ్ ॥

వేదస్వరూపమైన ఓ దేవీ। ఆకాశమనే మనస్సున మెరుపులా ప్రకాశిస్తుంటావు. నీ ఉపాసకులకు, సాధకులకు క్రియాశక్తివి.

7 వాణీ కోటి మృదంగ నాద మదనా విశ్రేణి కోటిధ్వనిః
ప్రాణేశీ ప్రియతామమూల కమనేల్లాసైక స్వానసా, ।
షాఢోద్భవ మేఘరాజి జనిత ధ్వాంతావ నా స్థాయినీ
ఆశాసా పరిపాతు సూక్ష్మపథగా మాం యోగినాం శంకరీ. ॥

మా నీ ముఖమునుండి అనేకమైన వాగ్విశేషములు, అనంతమైన వాద్యములతో సమానమైన ధ్వని విశేషములు వినవస్తుండగా, సూక్ష్మమార్గంలో సంచరిస్తూ యోగీశ్వరులకు కూడా సుఖాన్నిచ్చే ఓ తల్లీ। మమ్ముకాపాడుదువుగాక.

8 త్వామాశ్రిత ఎరా వ్రజంతి సహసా వైకుంఠ కైలాసయో
రానందైకవిలాసినీం శశిశతానందాననాం కారణామ్, ।
మాతః శ్రీకులకుండలీ ప్రియకరే కాలీ కలోద్దీపనే!
తత్ స్థానం ప్రణమామి భద్రవనితే! మాముద్ధరత్వం పశుమ్ ॥

నిన్ను ఆశ్రయించి కైలాస, వైకుంఠము లందు ఆనందముగా ఉన్ననిన్ను, నీ ఉపాసకులు చేరగలుగుతున్నారు. వేలకొలది చంద్రులతో సమానమైన కాంతులతో ప్రకాశించే ముఖము గల ఓ మంగళ స్వరూపిణీ, జగత్కారణ భూతురాలవైన నీకునమస్కరించు చున్నాను. నన్ను ఉద్ధరింపుము

ఆధార చక్రానికి కొద్దిగా పైభాగాన స్వయంభూలింగానికి మూడున్నర చుట్లు చుట్టుకుని సర్పాకారంలో కుండలినీ శక్తి అధోముఖంగా నిద్రిస్తూ ఉంటుంది. సాధకుడు యమనియమాదుల వల్ల పరిశుద్ధుడై గురువు దగ్గర ఉపదేశం పొంది, కుండలినీ ప్రబోధము ఏ విధంగా చెయ్యాలో తెలుసుకోవాలి. కుండలినీ శక్తిని గురించి దాదాపుగా అన్ని తంత్రాల లోనూ చెప్పటం జరిగింది. వామకేశ్వర తంత్రంలో:

భుజంగాకార రూపేణ మూలాధారం సమాశ్రితా ।
శక్తిః కుండలినీ నామ బిసతంతు నిభాశుభా ॥
మూలకందం ఫణాగ్రేణ దష్ట్వా కమలకందవత్ ।
ముఖేన పుచ్ఛం సంగృహ్య బ్రహ్మరంధ్రం సమాశ్రితా॥
పద్మాసన గత స్వస్థో గుద మాకుంచ్యసాధకః ।
వాయు మూర్ధ్వ గతిం కుర్వన్‌కుంభకావిష్టమానసః॥
వాయ్వాఘాత వశాదగ్నిః స్వాదిష్ఠానగతో జ్వలన్
జ్వలనా మాత [illegible] హిరాట్॥
[illegible] పవనాఘాతై రుపు [illegible] తో

రుద్రగ్రంధిం తతో భిత్వా విష్ణు గ్రంధిం బినత్త్యతః।
బ్రహ్మగ్రంధించ బిత్త్వైవ కమల్యాత్ర భిః షట్॥
సహస్రకమలే శక్తిః శివేన సహ మోదతే।
సాచావస్థా పరా జ్ఞేయా సైవ నిర్వృతి కారణమ్।

తంత్రసారంలో కూడా ఈ విషయాన్ని వివరించటం జరిగింది.

కుండల్యేవ భవే చ్ఛక్తి స్తాంతు సంచాలయే ద్బుధః॥
స్వస్థానా దాభ్రువోర్మధ్యం శక్తి చాలన ముచ్యతే॥
మూలాధారాది షట్చక్రస్థాః శ వ ముదీరితం।
కంఠాదుపరి మూర్ధాంతం శాంభవ స్థాన ముచ్యతే॥
మూలాధారే ధ్వనిం శ్రుత్వా ప్రబుద్ధా శక్తి కుండలీ।
జ్వల త్పావకసంకాశా సూక్ష్మతేజ స్స్వరూపిణీ॥
శక్తిః కుండలినీ నామ బిసతంతు నిభాశుభా।
సాచ విద్యుల్లతాకారా బ్రహ్మద్వారం మనోమయమ్॥
భేనాభి ద్యాత రం ప్రసు మేపర శ్వరీ।
పార్శ్వత్రివలయాకారా త్రథి ఏ విభేదినీ॥
వృధ్యావ్య చక్రద్వితయస్య గ్రం ధి పదోదితం।
వహ్ని షుయన ం చక్రద్వయం తేజోమయం మహత్॥
విష్ణు గ్రంధి పదేనోక్తం తైజసం సర్వసిద్ధిదం।
వాయ్వాకాశ ద్వయీరూపం చక్రద్వితయ ముత్తమమ్॥
బ్రంధి గ్ర పదేనోక్తం మంగళాయతనం మహత్।

కుండలినీశక్తి ఆధారచక్రంల్త తోక తోకను పట్టుకున్న సర్పాకారంలో నిద్రిస్తూ ఉంటుంది. చంద్ర కిరణాల వల్ల అ చే మృ రవేధ దానికి ఆహారం. నిద్రావస్థలో ఉన్న కుండలినీ శక్తిని లేపగలిగితే భగవత్సాక్షా త్కారమౌతుంది. సాధకుడు పద్మాసనంలో కూచుని, చేతులను తొడలమీద ఉంచుకుని ఖేచరీ ముద్రతో ఏకాగ్రత సాధించి కాలి మడమతో గుదస్థానాన్ని తన్నిపట్టి, గాలి పూరించి కుంభించాలి. ఆ తరువాత గుదస్థానము కూడా కుంభించి అపాన వాయువును స్థంభింపచెయ్యాలి. అప్పుడు వాయువును పైకి లాగాలి. ఆ విధంగా లాగేటప్పుడు మూలాధార కర్ణికలో ఉన్న కామవాయువును వామావర్తముగా త్రిప్పాలి. అలాచెయ్యగ కాల్ల మాగ్ని ప్రజ్వరిల్లి కుండలినీ ల్మాపేటు ంది. అప్పుడు

కూర్చ బీజముతో కుండలినీ శక్తిని ఊర్ధ్వ దిశగా నడిపించాలి.

సాధకుడు కాలిమడమతో గుదస్థానాన్ని తన్ని పట్టి వాయువును కుంభించినప్పుడు వాయువు ఊర్ధ్వ ముఖంగా బయలు దేరి చంద్ర సూర్యుల గమనాన్ని అవుతుంది. చంద్రుని గమనము ఎప్పుడైతే ఆగి పోయిందో,అప్పుడు అమృతంస్రవించదు. అమృతధారలు లేకపోవటం చేతనిరాహార అయిన కుండలిని మేల్కొని సుషుమ్నా నాడి ద్వారా ఊర్ధ్వముఖంగా బయలుదేరుతుంది.

ఆ రకంగా బయలుదేరిన కుండలినీ శక్తి షట్చక్రాలను భేదించుకుని, గ్రంథిత్రయాన్ని దాటి, పంచబ్రహ్మలను అధిగమించి సహస్రారంచేరి, సహస్రదళకమలాన్ని నోటితోకరచి పట్టుకుంటుంది. అప్పుడు చంద్రమండలంనుంచి అమృతపు ధారలు స్రవించి శరీరంలోని డబ్బైరెండువేల నాడీ మండలాన్ని తడుపుతాయి.

మూలాధారము అంధకారబంధురము స్వాధిష్ఠానము, మణిపూరము మిశ్రమ లోకములు అనాహతము జ్యోతిర్లోకము విశుద్ధి చంద్రలోకము ఆజ్ఞాచక్రము సుధా లోకము సహస్రారమే చంద్రమండలము.

వెన్నుపూసకు 'మేరుదండము' అని పేరున్నది. దాని మధ్యలో సుషుమ్నా నాడి త్రినాడీ స్వరూపంగా ఉంటుంది. మేరు దండానికి ఎడమవైపున ఇడ, కుడి వైపున పింగళనాడులున్నాయి. సుషుమ్న మధ్యలో వజ్ర అనునాడి ఉన్నది. ఇది శిరస్సు వరకు వ్యాపించి ఉంటుంది. వజ్రము మధ్యన చిత్రిణి అనే నాడి ఉన్నది. దాన్ని ఆధారంగా చేసుకుని షట్కమలాలు ప్రకాశిస్తున్నాయి. చిత్రిణీ మధ్యలో కంఠము నుండి పరమశివ పర్యంతము బ్రహ్మనాడి వ్యాపించి ఉన్నది. ఇదిశుద్ధ జ్ఞాన స్వరూపిణి.

గౌడ పాదులవారు తమసుభగోదయస్తుతిలో కుండలినీశక్తికి మూడు దశలున్నాయన్నారు.

> కుమారీ యన్మంద్రం ధ్వనతిచ తతో యోషి దపరా
> కులం త్యక్త్వా రౌతి స్ఫుటతిచ మహాకాలభుజగీ।
> తతః పాతివ్రత్యం భజతి దహరాకాశ కమలే
> సుఖాసీనా యోషా భవసి భవపీత్కార రసికా॥

అవి వరుసగా1. నిద్రావస్థ 2. ప్రయాణావస్థ 3. సుఖావస్థ. వీటినే 1. కౌమారావస్థ 2. యోషిదవస్థ 3. పతివ్రతావస్థ అంటారు. మొదటి దశలో కుండలిని నిద్రిస్తూ ఉంటుంది. సాధకుడు ఆ శక్తిని మేల్కొల్పి నప్పుడు నిరాహార అయిన కుండలిని మంద్రస్వరంతో పూత్కారంచేస్తూ ఊర్ధ్వ ముఖంగా బయలు దేరి గ్రంథిత్రయాన్ని భేదిస్తుంది. ఇది ప్రయాణావస్థ బ్రహ్మగ్రంథిని దాటి సహస్రారం చేరి అక్కడ ప్రౌఢయై, పతి అయిన పరమ శివునితో విహరిస్తూ

ఉంటుంది. ఇది లేక సుఖావస్థ మూడవదయిన పతివ్రతావస్థ.
కుండలిని సహస్రారంచేరిన తరువాత అమృతాస్వాదన చెయ్యటానికి స్వాధిష్ఠానంలో ఉన్న అగ్ని సహాయపడుతుంది. వాయువుచే అగ్నిని జ్వలింపచేసి, ఆ అగ్ని ద్వారా చంద్ర మండలంనుండి అమృతాన్ని స్రవింపచేస్తుంది.

అక్కడ ఇరవైఆరవతత్త్వమైన పరాశక్తి, శివుని తనలో కలుపుకుని సుఖాసీనురాలవుతున్నది. అని గౌడ పాదులవారన్నారు.భైరవయామళము, బహు రూపాష్టకాలలో

తత్రాస్తే పరమేశానీ మహాత్రిపురసుందరీ।
శివార్కమండలం భిత్వా ద్రావయం తీందుమండలమ్॥
తదుద్భూతామృతస్యంది పరమానంద నందితా
కులయోషిత్కులం త్యక్త్వా, వరం వర్త్మ మేత్యసా॥

కుండలినీ శక్తి షట్చక్రభేదనం చేసి సహస్రారమందలి చంద్రమండలం నుంచి అమృతాన్ని స్రవింపచేసి శరీరంలోని డబ్బైరెండువేల నాడీ మండలాన్ని తడుపుతుంది. ఆ తరువాత మళ్ళీ స్వాధిష్ఠానానికి వచ్చి నిద్రిస్తుంది.



# 12. అర్చిరాదిమార్గము

మానవులు తామాచరించే కర్మ ననుసరించి వారు ప్రయాణించే మార్గాలు నిర్దేశించబడతాయి. మానవులు రెండు రకాలకర్మలనాచరిస్తారు.

1. ఉత్తరాయణ మార్గము (శుభమార్గము)

2. దక్షిణాయణ మార్గము (అశుభమార్గము)

1. ఉత్తరాయణమార్గము:- దీనినే అర్చిరాది మార్గము దేవయానము అని కుడా అంటారు. సాధకులు ఏ కోరికలు లేకుండా ఫలం పరలోక చింతనతో, చేసే కర్మను ఉత్తరాయణ మార్గము అంటారు. ఈ మార్గంలో పరబ్రహ్మ తత్వాను భవంకలిగి కృతకృత్యు లయినవారు పరబ్రహ్మలో లీనమవుతారు. వీరు మోక్షసాధన కోసం వేదవిహితమైన కర్మలు కుడా (యజ్ఞయాగాదులు) చేస్తుంటారు.

2. దక్షిణాయనమార్గము:- కేవలము ఐహిక వాంఛలతో స్వార్థ ప్రయోజనాల కోసం, వారి కోసం కర్మలను ఆచరించటాన్ని దక్షిణాయణమార్గము అంటారు. ఈ మార్గంలో పయనించేవారు పితృలోకాలకు పోతారు. వీరు పరలోకం లో తమకర్మ ఫలాలు అనుభవించి మళ్ళీ భూలోకంలో పుడతారు. ఈ రకంగా సంసార చక్రంలో పడి తిరుగుతూ ఉంటారు. దీన్ని ధూమమార్గము పితృయానముఅని కుడా అంటారు.

ఈ రెండు మార్గాలు తెలియనివారు క్రిమికీటకాలు, పక్షులు, పాములు, జెర్రులుగా పుడతారని బృహదారణ్యకో పనిషత్తులో చెప్పబడింది.

" అథమ ఏతౌ పంథావౌ నవిదు

స్తే కీటాః పతంగా మదిదం దందమూకమ్"

పరబ్రహ్మతత్త్వముతెలిసినసాధకుడు ఈశరీరాన్నివదలినతరువాత పరబ్రహ్మలోలీనమవుతాడు అంతేకాని ఎక్కడికీవెళ్ళడు. అంటేబ్రహ్మజ్ఞానియొక్క ప్రాణములు ఉత్క్రమింపవు, ఉత్క్రమణ అంటే దేవయాన, పితృయానములద్వారా పైకిపోవటము. సాధకుడు పరలోకాలకు ప్రయాణమయ్యేసమయంలో అంటే అవసానదశలో, అతడి ఇంద్రియాలన్నీ జీవుడి దగ్గరకుచేర తాయి, అప్పుడు ఆజీవియొక్క తత్తరపాటు, అవస్థలు, వర్ణనాతీతం అతనికి ఊపిరి సలపక సతమతమవుతాడు క్రమంగా కర్మేంద్రియాలు జ్ఞానేంద్రియాలు వశంతప్పుతాయి. కేవలంమనస్సు ఒక్కటే పనిచేస్తుంది. విషయంమాత్రం తెలుస్తుంది. కానిమాట్లాడలేడు. ఈస్థితిలో ఇంద్రియాలన్నీ కూడతీసుకున్న మనసుప్రాణముతో ఏకమవుతుంది. అంటేమనో వ్యాపారం కుడా అంతరిస్తుంది. అప్పుడు ఈలోకంలో జరిగే విషయాలు అతనికి తెలియవు. క్రమంగా ప్రాణము జీవుడిలో కలిసిపోతుంది ప్రాణి ఎగఊపిరి దిగఊపిరితో కొట్టుకుంటాడు. సకలేంద్రియవ్యాపారము అంతరిస్తుంది. ఇప్పుడు అతడుచేసినపాపపుణ్యాలు అతణ్ణి ఆవరిస్తాయి. ఈరకంగా సకలేంద్రి యాలనుకూడ్చుకున్న జీవుడు శబ్దస్పర్శాదులైన పంచతన్మాత్రలతో ఏకమయి పరలోకయాత్రకు

బయలుదేరతాడు, జీవిబయలు దేరేవరకు దేహమువేడిగాఉంటుంది. ఆతరువాత దేహంచల్ల బడుతుంది. బంధువులు ఆదేహానికి అంత్యక్రియలు చేస్తారు, అంటే స్థూలదేహంనశిస్తుంది. సూక్ష్మదేహం పరలోకయాత్రకు బయలు దేరుతుంది.

లోకంలో కొంతమంది కర్మలను ఫలాపేక్షతో చేస్తే మరికొంతమంది నిష్కామకర్మలను చేస్తూ సగుణోపాసన కూడా చేస్తుంటారు. దేహాన్ని వదలి జీవుడు బయలు దేరటానికి ఈ రెండు రకాల వారికి తేడాలేదు. కర్మోపాసకులు ధూమ మార్గమున (దక్షిణాయనంలో) పోగా, రెండ వారు అర్చిరాది మార్గములో పోతారు. ఈ రెండు రకాల వారు కూడా మొదటగా హృదయాన్ని చేరుకుంటారు. అక్కడనుండి వీరి ప్రయాణం మొదలవుతుంది. శరీరంలో ఉన్న 72 వేల నాడీ మండలమే వీరి ప్రయాణానికి సిద్ధంగా ఉన్న వాహనాలు. జీవుడు వారివారి కర్మలననుసరించి దేహముయొక్క కళ్ళు, ముక్కు, నోరు మొదలైన అవయవాల నుంచి బయటకు వస్తాడు. కాని జ్ఞానులకు బ్రహ్మరంధ్రం ద్వారా బయటకు వస్తాడు.

అర్థాగృహె నివర్తంతే శ్మశానే మిత్రబాంధవా: ।
సుకృతందుష్కృతంచైవ గచ్ఛంతమను గచ్ఛతి ॥

మానవుడు సంపాదించిన ఆస్తిపాస్తులు అతని వెంటరావు. అతడు సంపాదించిన ఇల్లు వాకిలి, సంపద అన్నీ అక్కడే ఉండిపోతాయి. ఇతని మరణానంతరము వారసులు ఆస్తులకోసం పోట్లాడుకుంటారు. ఇంత కష్టపడి ఆస్తులు సంపాదించినా మరణించేటప్పుడు నక్షత్రం మంచిదికాదనో, ఇతర కారణాలచేతనో అతణ్ణి వాకిట్లోనే చాపవేసి పడుకోబెడతారు. కాబట్టి సంపాదించిన ఆస్తిపాస్తులు ఇక్కడివరకే పరిమితమైపోతాయి. ఇక ఇతడంటే ఇష్టపడే బంధువులు, మిత్రులు శ్మశానందాకా వెళ్ళి అతణ్ణి సాగనంపుతారు. మహా అయితే అతడికి దహన సంస్కారాలు పూర్తయ్యేదాకా అక్కడ ఉంటారు. చివరకు అతనితో పాటుగా వెళ్ళేది అతడు చేసిన పాపపుణ్యాలే. అతడు మంచి పనులు చేస్తే, అతను మరణించిన తరువాత కుడా అతడు చేసిన పనిని పది మంది మెచ్చుకుంటారు. ఎంతకాలమైతే అతడి మంచి పనులను జనం కొనియాడు తుంటారో, అంతకాలం అతడు స్వర్గసుఖాలు అనుభవిస్తాడు. అతను మంచి వాడని, మహానుభావుడని పదిమంది మెప్పునుపొందటమే స్వర్గ సుఖం. అతడు చేసిన పనులవల్ల బాధపడిన వారు అతడు పోయిన తరువాత ఆనందిస్తారు. అదే అతడికి నరకం. అందుచేతనే మరణించిన తరువాత అతడితో వచ్చేవి అతడు చేసిన కర్మ ఫలితాలేకాని వేరుకావు.

మరణించపోయేముందు, ఆఖరి దశలో అతడు చేసిన పాపపుణ్యాలు అతడికి గుర్తుకువస్తాయి. అతడి మరు జన్మ ఏమిటి అనే విషయాన్ని అతడు తెలుసుకోగలుగుతాడు. పాపకర్ముడు ఇంత కన్నహీనమైన జన్మరాబోతున్నదని తెలిసి విలపిస్తాడు. జీవి ఈ శరీరం విడిచి పోవటానికి ఇష్టపడడు. చివరకు శరీరం నుంచి జీవి గెంటివేయబడతాడు. ఈ కారణంచేతనే పాపకర్ముల మరణాలు సాధారణంగా నీచంగా ఉంటాయి. పుణ్యచరితులకు అనాయాస మరణం లభిస్తుంది.

ఈరకంగా బయలు దేరిన జీవికి తనమరుజన్మ ఏమిటన్న విషయం తెలుస్తుంది. కర్మలనాచరించిన వారు వాటి ఫలితాలైన పాపపుణ్యాలనుఽ చిన తరువాత మళ్ళీ ఈ లోకంలో పుడతారు. నిష్కామకర్మచేసిన జ్ఞానిఽవిసుషుమ్నా నాడి ద్వారా బ్రహ్మరంధ్రంచేరి అక్కడనుండి సూర్యమండలానికి పోతాడు. ఇక్కడ రాత్రి పగలు అనే భేదం లేదు. ఉత్తరాయణము అంటే సూర్యుడు మకర రాసిలో ప్రవేసించిన నాటినుంచీ (జనవరి 14) కర్కాటక రాశిలో ప్రవేసించేవరకు (జులై 17) అని అర్థము కాదు. ఈ మధ్యకాలంలో మరణించిన వారు మాత్రమే పుణ్యలోకాలకు పో నేది నిజంకాదు. గతంలో చెప్పిన దేవయానాన్నే ఉత్తరాయణమంటారు. జ్ఞాని తాను నవాడు ణాయనంలో మరణించినా సూర్యమండలం చేరతాడు లోకానికి తల. దక్షి సూర్యమ . ఉపాసనాపరులు చేరుకోదగినస్థానః బ్రహ్మలోకము మార్గమే అర్చిఽండలఽర్గము. మము అ 'అగ్ని' అర్థము.

అర్చింకానికి ంటే మార్గము కాంతి వంతమైన బముచే కప్పబ టుంది. అకాప్రోయేనంచూడలేఅతి. అప్పుడు సాధకుడి ఆకాంతి బింబాన్ని ఉగించి, బ్రహ్మలోకానికి దారి చూపమని సూర్యభగవానుణ్ణి ప్రార్థిస్తాడు.

హిరణ్మయే పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్ ।
తత్త్వం పూషన్న పావృణు సత్య ధర్మాయ దృష్టయే ॥
పూషన్నే కర్షే యమ సూర్యప్రాజాపత్య
రశ్మీన్ సమూహ ।
వ్యూహ తేజోయ త్తే రూపం కల్యాణతమం
తత్తే పశ్యామి యో2సావసౌ పురుషఃసో హమస్మి ॥

ఓ సూర్యభగవానుడా జ్యోతిర్మయమగుపాత్రముచేత బ్రహ్మలోకముఖద్వారము కప్పబడి ఉన్నది. ఓ దేవా సత్యమైన ధర్మాన్ని ఆచరించేనాకోసం ఆ మార్గాన్ని తెరవవలసినది.

ఓ సూర్యభగవానుడా! నీకిరణాలను తొలగించికాంతిని ఉపసంహరించు. నీ అనుగ్రహంచేత మంగళకరమైన నీరూపాన్ని చూడగలుగుతాను.

వాయురనిల మమృత మథేదం భస్మాంతం శరీరమ్ ।
ఓం క్రతోస్మర కృతంస్మర క్రతోస్మర కృతంస్మర ॥

ఈ వా ప్రాణవాయువు, సర్వ వ్యాప్తము శాశ్వతము అయిన ప్రాణమందు లీనమగుగాక, ఈ శరీరము బూడిద అగును గాక. ఓమనసా పూర్వకర్మలను గుర్తు తెచ్చుకో. మరణించబోయే మానవుడి ఆలోచన ప్రధానంగా ఉత్తర జన్మల మీద ఉంటుంది. అందుకనే తనజీవితంలో చేసిన కర్మలను అ పాపపుణ్యాలను గుర్తు తెచ్చు మనస్సును హెచ్చరిస్తున్నాడు.

మానవుడు ఎన్నిదుష్కృత్యాలు చేసినా చివరకు సుఖంగా ఉండాలనీ, స్వర్గసౌఖ్యాలను భవించాలనీ కోరత . అందుకనే సత్కర్మల వాచరించిన మానవుడు,. తనను మంచి మార్గం డు.

ద్వారా తీసుకుపొమ్మని అగ్ని దేవుణ్ణి ప్రార్థిస్తాడు.

అగ్నేనయ సుపథారాయే అస్మాన్
విశ్వాని దేవవయునాని విద్వాన్ ।
యు యోధ్యస్మజ్జుహురాణమేనో
భూయిష్ఠాంతే తమ ఉక్తింవిధేమ ॥

ఓ అగ్నిదేవా । నేను చేసిన కర్మలన్నీ నీకు తెలుసు. నాలోని పాపాలను నిర్మూలించు. నేను చేసిన కర్మఫలితాలను భవించటానికి నన్ను మంచి మార్గంగుండా తీసుకుని పోవలసినది అని ప్రార్థిస్తాడు. ఇక్కడ సూర్య భగవానుడు అంటే ఆ పరమేశ్వరుడే అని గుర్తించాలి.

సాధకుని ప్రార్థన ఆలకించి సూర్యుడు బ్రహ్మలోకానికి అడ్డుగా ఉన్న కాంతి బింబాన్ని తొలగిస్తాడు. ఈ మార్గంలో మొదటగా ఉండేది అగ్ని లోకము. అర్చితము అంటే అగ్ని. అందుకే దీన్ని అర్చిరాది మార్గము అగ్నిమార్గము అనికూడా అంటారు. ఇది శుభప్రదమైన మార్గము. ఈ మార్గంలో మొదటగా అగ్నిలోకము అహర్లోకము (పగటి దేవత) శుక్లపక్ష దేవత ఉత్తరాయణదేవత, మాసదేవత, సంవత్సరదేవత, దేవలోకము, యమలోకము, ఆదిత్యలోకము చంద్రలోకము, విద్యుల్లోకము, వరుణ లోకము ఇంద్రలోకము, ప్రజాపతి లోకము ఉంటాయి. చివరకు బ్రహ్మలోకముంటుంది.

జీవుడికి అవయవములు ఆధీనంలో ఉండవు. అతను ఒకచోటినుండి మరొక చోటికి కదలలేడు అని చెప్పబడింది. ఇప్పుడు ఆ జీవుడు ఒక లోకం నుంచి ఇంకొక లోకానికి స్వయంగా పోలేడు కాబట్టి ఆయాలోకాలలో ఆయాదేవతలు, మహాపురుషులు అతడి గమనానికి సాయపడతారు. బ్రహ్మమానసపుత్రుడు జీవిని విద్యుల్లోకంనుంచి బ్రహ్మలోకానికి తీసుకుని పోతాడు. ఈ మార్గంలో వరుణ, ఇంద్ర, ప్రజాపతులంతా జీవి ప్రయాణానికి అనుమతిస్తారు. అంతేకాని అడ్డగించరు. ఈరకంగా జీవుడు బ్రహ్మలోకం చేరతాడు.

సాధకుడు చేసిన కర్మలవల్ల వచ్చేస్వర్గము శాశ్వతం కాదు సాధకుడు స్వర్గంలో పుణ్యఫలమును అనుభవించిన తరువాత మళ్ళీ భూలోకంలో పుడతాడు. కాని బ్రహ్మలోకం చేరిన వారు తిరిగి రారు. కల్పాంతం లో పరబ్రహ్మలో లీనమైపోతారు. అందుకనే బ్రహ్మలోకము చేరే మార్గము ఉత్తమమైనది. అదే అర్చరాది మార్గము అని చెప్పబడింది.

# 13. భావనోపనిషత్తు

ఉపనిషత్తు అంటే బ్రహ్మవిద్య బ్రహ్మవిద్యా పరిశీలకులైన విద్వాంసులకు కర్మ జన్మ మరణాలను లేకుండా చేసేది. అజన్మమరణాదికమైన దానిని నశింపచేసేది. బ్రహ్మపదార్ధలాభాన్ని కలుగచేసేది. అందుకే దీనిని ఉపనిషత్తు అన్నారు. వేదాలు మూడు కాండలుగా విభజింపబడ్డాయి. అవి 1. కర్మ 2. ఉపాసన 3. జ్ఞాన కాండలు. వీటిలో ఉపాసన, జ్ఞాన భాగాలకు'ఉపనిషత్తు' అని పేరు ఉపనిషత్తులు మొత్తం 108 వాటిలో ప్రసిద్ధమైనవి పది.

ఈశ,కేవ,కఠ,ప్రశ్న, ముండ,, మాండూ క్యతిత్తిరిః
ఐతరేయంచ,ఛాందోగ్యం,బృహదారణ్యకందశః

1. ఈశోపనిషత్తు
2. కేనోపనిషత్తు
3. కఠోపనిషత్తు
4. ప్రశ్నోపనిషత్తు
5. ముండకోపనిషత్తు
6. మాండూక్యోపనిషత్తు
7. తైత్తిరీయోపనిషత్తు
8. ఐతరేయోపనిషత్తు
9. ఛాందో గ్యోపనిషత్తు
10. బృహదారణ్యకోపనిషత్తు

మిగిలినవాటిలో

| | |
|---|---|
| 1. యోగోపనిషత్తులు ఇరవై | 20 |
| 2. వేదాంతోపనిషత్తులు ఇరవైనాలుగు | 24 |
| 3. సన్న్యాసోపనిషత్తులు పదిహేడు | 17 |
| 4. శైవోపనిషత్తులు పదిహేను | 15 |
| 5. వైష్ణవోపనిషత్తులు పధ్నాలుగు | 14 |
| 6. దేవ్యుపనిషత్తులు ఎనిమిది | 8 |
| మొత్తం తొంబై ఎనిమిది | 98 |

వీటిలో దేవీ సిద్ధాంతమును ప్రధానంగా చెప్పే ఉపనిషత్తులను దేవీఉపనిషత్తులు అంటారు. అవి ఎనిమిది.

1. త్రిపురోపనిషత్తు
2. త్రిపురతాపిన్యోపనిషత్తు
3. దేవీ ఉపనిషత్తు
5. భావనోపనిషత్తు
6. సరస్వతీ రహస్యోపనిషత్తు
7. సీతోపనిషత్తు

మాట ఎనిమిది ఉపనిషత్తుల మీద పూర్తి వివరాలకు గజ్జెసత్యనారాయణ గుప్తగారి ఆధ్వర్యంలో ప్రార్ధనా గాన ప్రచార సంఘము సత్యనారాయణపురం, విజయవాడ వారు ప్రచురించిన 'ఉపనిషత్ కల్పతరువు' చూడగలరు.

భావనోపనిషత్తు అధర్వణ వేదములోనిది. దీనిలో అంతర్యాగము అంటే దేవి మానసిక పూజావిధానము వివరించబడింది.

భావనోపనిషత్తు పూర్తి పాఠము

ఓం శ్రీగురు: పరమకారణ భూతాశక్తి: తేననవరంధ్రరూపోదేహ: నవచక్రంరూపం శ్రీచక్రం వారాహీపితృరూపా, కురుకుల్లావళిదేవతామాతా ॥ పురుషార్థాస్సాగరా: . దేహోనవరత్న ద్వీప: త్వగాదిసప్తధాతుభిరనేకైస్సంయుక్తా సంకల్పా: కల్పతరవ: తేజ:కల్పకోద్యానం రసనయాభావ్యమానా మధురామ్లతిక్తకటుకషాయలవణరసాష్షడృతవ: క్రియాశక్తిపీఠంకుడలినీ, జ్ఞానశక్తిర్గృహ, ఇచ్ఛాశక్తిర్మహాత్రిపురసుందరీ క్రియాశక్తి పీఠంకుడలినీ,జ్ఞానశక్తిర్గృహ, ఇచ్ఛాశక్తిర్మహాత్రిపురసుందరీ జ్ఞాతాహోతా జ్ఞానమర్ఘ్యం, జ్ఞేయంగ్ంహవి: జ్ఞాతృజ్ఞానజ్ఞేయానామభేదభావనగ్ం శ్రీచక్రపూజనమ్ నియతి సహిత శృంగారాదయో నవరసా అణిమాదయ: కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్య పుణ్యాపాప మయా బ్రాహ్మ్యాద్యష్టశక్తయ:' ఆధారనవకం ముద్రాశక్తయ: పృధివ్యప్తేజోవాయ్వాకాశ శ్రోత్రత్వక్ చక్షుర్జిహ్వా ఘ్రాణవాక్పాణి పాదపాయూపస్థ మనోవికారా షోడశశక్తయ: వచనా దానాగమన విసర్గానందహానో పాదానోపేక్షా బుద్ధ యోనంగ కుసుమాది శక్త యోష్టౌ అలంబుసా, కుహూ,విశ్వోదరీ,వరుణా,హస్తిజిహ్వా,యశస్వతీ, అశ్వినీ,గాంధారీ,పూషా,శంఖినీ, సరస్వతీ, ఇడా, పింగళా,సుషుమ్నా,చేతి,చతుర్దశనాడ్య: సర్వసంక్షోభిణ్యాది చతుర్దశ దేవతా: ప్రాణాపాన, వ్యాన,దాన, సమాన, నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయా దశవాయవ స్సర్వసిద్ధిప్రదాది దేవ్యే బహిర్దశారదేవతా: ఏతద్వాయుదశక సంసర్గో పాధి భేదేన రేచకపూరక శోషక దాహక ప్లావకామృతమితి ప్రాణముఖ్యాత్వేన పంచవిధోస్తి మనుష్యాణాం మోహకో దహకో భక్ష్య భోజ్య లేహ్య చోష్య పేయాత్మకం చతుర్విధమన్నం పాచయంత్యేతా: దశధనకలాసర్వజ్ఞత్వా ద్యంతర్దశారదేవతా: శీతోష్ణ సుఖదు:ఖేచ్ఛా సత్వరజస్తమోగుణా వశిన్యాది శక్త యోష్టౌ శబ్ద స్పర్శ రూప రస గంధా: పంచతన్మాత్రా పంచపుష్పబాణా: మన ఇక్షుధను: వశ్యోబాణ: రాగ:పాశో ద్వేషోంకుశ: అవ్యక్త మహత్తత్వాహంకారా: కామేశ్వరీ, వజ్రేశ్వరీ, భగమాలిన్యోంతస్త్రికోణాగ్రగాదేవతా పంచదశతిథి రూపేణ కాలస్య పరిణామావలోకనం పంచదశనిత్యా: శ్రద్ధానురూపాధిర్దేవతాతయో: కామేశ్వరీ సదానంద ఘనాపూర్ణా స్వాత్మైకరూపాదేవతా సలిలమితి సౌహిత్యకరణగ్ం సత్యమ్ కర్తవ్యమకర్తవ్య మౌదాసీన్యమితి వివేక భావనాయుక్త ఉపచార: అస్తి నాస్తీతి కర్తవ్యతా అనుపచార: తస్యబాహ్యాంత:కరణానామేకరూప తస్యబాహ్యాంత:కరణానామేకరూప విషయ గ్రహణమాసనమ్' విషయ గ్రహణమాసనమ్' రక్త శుక్ల పదైకీకరణం పాద్యమ్ ఉజ్జ్వల

దామోదానుసంధానమర్ఘ్యమ్ స్వచ్ఛంస్వతస్సిద్ధ మిత్యాచమనీయమ్ చిచ్చంద్రమయీ సర్వాంగస్రవణస్నానమ్ చిదగ్ని స్వరూప పరమానందశక్తిస్ఫురణం వస్త్రం ప్రత్యేకగ్ం సప్తవింశతిథా భిన్నత్వేనేచ్ఛాజ్ఞాన క్రియాత్మక బ్రహ్మగ్రంథి మద్రసతంతు బ్రహ్మనాడీ బ్రహ్మసూత్రమ్ స్వవ్యతిరిక్తవస్తు సంగరహిత స్మరణంవిభూషణమ్ సత్సంగపరిపూర్తా మస్మరణంగంధః సమస్త విషయాణాం మనసః స్థైర్యేణా నుసంధానం కుసుమమ్ తేషామేవ సర్వదాస్వీకరణంధూపః పవనావచ్ఛిన్నోర్ధ్వజ్వలన సచ్చిదుల్కాకాశదేహో దీపః సమస్తయాతాయాత వర్జనం నైవేద్యమ్ ॥ స్థితిత్రయైకీకరణం తాంబూలమ్ మూలాధారాది బ్రహ్మబిల పర్యంతం, బ్రహ్మరంధ్రాదిమూలాధారపర్యంతం గతాగత రూపేణ ప్రాదక్షిణ్యమ్ తురీయావస్థా నమస్కారః దేహశూన్య ప్రమాతృతా నిమజ్జనం బలిహరణమ్ సత్యమస్తికర్తవ్య మకర్తవ్య మౌదాసీన్య నిత్యాత్మ విలాపనగ్ంహోమః స్వయం తత్పాదుకా నిమజ్జనం పరిపూర్ణధ్యానమ్ ఏవం ముహూర్తత్రయం భావనయా యుక్తో భవతి, తస్య దేవతాత్మైక్యసిద్ధిః చింతితకార్యాణ్యయత్నేన సిధ్యంతి స ఏవ శివయోగీతి కథ్యత ఇత్యుపనిషత్॥

భావనోపనిషత్తు మొత్తము 49 సూత్రాలుగా ఉంటుంది. దీనిలో

1నుండి 10 సూత్రాల వరకు - మానవ దేహమే పరమేశ్వర స్వరూపమని

11నుండి 24 సూత్రాల వరకు - శ్రీచక్రములోని నవావరణలను

25నుండి 49 సూత్రాల వరకు - మానసిక పూజా విధిని వివరిస్తాయి.

1. "ఓం శ్రీగురుః పరమకారణ భూతాశక్తిః"

గురుర్బ్రహ్మ, గురుర్విష్ణుః గురుర్దేవోమహేశ్వరః

గురుస్సాక్షాత్పరంబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః ॥

మంత్రోపదేశంచేసి దీక్షనొసగిన గురువుత్రిమూర్తి స్వరూపుడు. అజ్ఞానమనే చీకటినిపారద్రోలి జ్ఞానమనే దీపకాంతిని చూపేమహానుభావుడు. శిష్యుని యొక్క ఉపదేశంతోనే బ్రహ్మత్వంసిద్ధిస్తుంది. అందుకే గురువు సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపము అని చెప్పబడింది

నగురోరధికం తత్త్వం। న గురోరధికం తపః

తత్త్వ జ్ఞానాత్ పరం నాస్తి। తస్మైనస్మై గురవే నమః ॥

గురువుకన్న ఎక్కువ అయిన తత్త్వములేదు, తపస్సులేదు. ఆ గురువు శిష్యునకు ఉపదేశించే జ్ఞానము కన్న ఎక్కువైనదిలేదు.

వందే గురుపద ద్వంద్వం అవాఙ్మానస గోచరం।

శ్వేతరక్త ప్రభాభిన్నం। శివశక్త్యాత్మకంపరం ॥

మనోవాక్కులకు గోచరించనిది, శ్వేత,రక్తకాంతుల కన్న అధికమైన కాంతినిచ్చునది, శివశక్త్యాత్మకమైనది అనగా పరబ్రహ్మ స్వరూపమైనది అయిన గురువుల పాదములకు నమస్కరించుచున్నాను. అందుకనే ఓం శ్రీగురుః పరమకారణ భూతాశక్తిః అనేగురు ధ్యానంతో

ఈ ఉపనిషత్తు మొదలవు తుంది.

2. "తేననవరంధ్రరూపోదేహ: నవచక్రంరూపం శ్రీచక్రం"

మానవదేహము నవరంధ్రములతో కూడినది. శ్రీచక్రము తొమ్మిదిచక్రములసమూహము. త్వగాదిధాతులువుతొమ్మిది, శ్రీచక్రంలోని భూపురం దగ్గరనుండి బిందువుదాకా గలఆవరణలన్నీ మానవవదేహంలోని వివిధఅంగాలు. సాధకుని దేహంలోని షట్చక్రాలు శ్రీచక్రంలోని వివిధచక్రాలతో ఐక్యముచెందుతున్నాయి. ఈవిషయాలన్నీ 'శ్రీచక్రము - మానవదేహము' అనేఅధ్యాయం వివరించటంజరిగింది. ఈరకంగాచూసినట్లైతే మానవ దేహమే శ్రీచక్రము. సాధకునిదేహమే దేవాలయము అని భావించాలి.॥ దేహో దేవాలయప్రోక్తో జీవోదేవస్సనాతన:॥

3.వారాహీపితృరూపా, కురుకుళ్ళావళిదేవతామాతా ॥

శ్రీచక్రానికి ప్రధానదేవత శ్రీదేవి, పరాత్పరి. ఆమెశరీరమునుంచి వచ్చిన కాంతిపుంజాలు అష్టసిద్ధులైన అణిమాదిదేవతలు. అలాగే సాధకుడికి తండ్రివారాహి, తల్లికురుకుళ్ళావతి. ఇక్కడ 'మాతా' అంటే సాధకుని యొక్కయోగ్యతనుబట్టి కోర్కెలు తీర్చునది. అంటేఐహికవాంఛలు, మోక్షములను ప్రసాదిస్తుంది. మానవశరీరంలో ఉన్ననాడిమండలంలో ప్రాణనాడి అనిచెప్పబడే సుషుమ్నానాడినే 'కురుకుళ్ళా' అంటారు. సుధాసింధువుమధ్య మణిద్వీపమందున్న శ్రీదేవిపట్టణానికి చిత్తము, అహంకారము అనబడే రెండుప్రాకారాలమధ్య విమర్శరూపమైన బావియందుండేది కురుకుళ్ళావళి అనే దేవత ప్రముఖమైనదేవత కాబట్టి ఈమెనుమాతృదేవతగా భావించాలి. లలితాస్తవరత్నములో ఈవిధంగాచెప్పబడింది

"కురువిందతరణినిలయింకులాచలస్పర్థికుచనమన్మధ్యాం
కుంకుమవిలిప్తగాత్రింకురుకుళ్ళాం మనసికుర్మహేసతతం"

కురువిందరత్నములపైననివసించునది, కులపర్వతములకుమించినస్తనములచే వంగిననడుముకలది, కుంకుమపూయబడినదేహముకలది అయినకురుకుళ్ళాదేవిని మనసాధ్యానించుచున్నాను. ఛాందోగ్యోపనిషత్తులో చెప్పినట్లుగా బ్రహ్మలోకానికి వెళ్ళేమార్గంలో రెండు అమృతసరస్సులున్నాయి. అవి ఇరమ్మదీయములు అనిచెప్పబడింది. ఇరముఅంటే అన్నము మదీయము అంటే ఆనందము అక్కడ అమృతవర్షముగల 'సోమసవనము' అనేవృక్షము ఉన్నది. ఆపట్టణానికి అపరాజితము అనిపేరు.

4. "పురుషార్థాస్సాగరా:"

సప్తసముద్రాలు, సప్తద్వీపాలుదాటిన తరువాత సుధాసముద్రమున్నది. దానిమధ్యలో మణిద్వీపము. మానమదేహంలోని సప్తచక్రాలేసప్త ద్వీపాలు. అపైనసప్తసముద్రాలు.ఆతరువాత సుధాసముద్రము, మణిద్వీపము సప్తసముద్రాలు, సప్తద్వీపాల వివరాలు ... వ ఇవ్వబడ్డాయి

| సముద్రాలు | ద్వీపాలు |
|---|---|
| 1. ల[illegible] సముద్రము | జంబూద్వీపము |
| 2. ఇ[illegible] ముద్రము | ప్లక్షద్వీపము |
| 3. స[illegible] సముద్రము | కుశద్వీపము |
| 4. స[illegible] ముద్రము | క్రౌంచద్వీపము |
| 5. ద[illegible] ముద్రము | శాకద్వీపము |
| 6. క్షీ[illegible] ముద్రము | శాల్మలీద్వీపము |
| 7. జ[illegible] ముద్రము | పుష్కరద్వీపము |

వణ క్షున ంరాస ప్పిస ధిసః రసవ ంసః

బిందుస్థానాన్ని 'ద్వా[illegible]ంతము' అంటారు. ఆధారచక్రం దగ్గరనుండి లెక్క పెట్టినట్లైతే బిందువు పన్నె[illegible]వది అవుతు[illegible].

శా ంది ము. ౦నికి ము

1. కులపద్మ[illegible] మూలాధార[illegible] ందరక్తవర్ణ[illegible] లిగిన సహస్రదళ పద్మము)
2. అష్టదళప[illegible]ు
3. షడ్దళపద్మ[illegible]
4. మూలాధా[illegible]ం
5. స్వాధిష్ఠానము
6. మణిపూరము
7. అనాహతము
8. విశుద్ధము
9. విశుద్ధలంబికాగ్రము అష్టదళము
10. అజ్ఞాచక్రము
11. సహస్రకమలము
12. అకులపద్మము (సహస్రారకర్ణిక)

ద్మమ ౖము ౦రమ

ఇక్కడున్న సహస్రార[illegible]నే బిందు స్థానమని చంద్రమండలమని అంటారు.

కర్ణి

5. "దేహోవవ[illegible] ద్వీపః

సాధకునిశరీరమే స[illegible]సముద్రము మధ్య[illegible] ఉన్నటువంటి నవరత్నమయమైనద్వీపము [illegible] ణిద్వీపము. అది[illegible] నిలయము. అంటేదేవిఎక్కడో లేదు, సాధ[illegible]శరీరంలోనే ఉన్నది

6. "త్వ[illegible] సప్తధాతుభిరనేకైస్సంయుక్తా సంకల్పా: కల్పతరవ:"

మా[illegible]హము ఏడుధాతువుల వలన ఏర్పడింది వాటినే సప్తధాతువులు అంటారు, అవి

1. చర్మము.
2. [illegible]ము.
3. మాంసము
4. మెదడు
5. ఎముకలు
6. మజ్జ
7. శుక్లము

రక్త

దేవిమణిద్వీపంలోని కల్పవృక్షఛాయలో ఉంటుంది. మానవదేహంలోని సంకల్పాలేకల్పవృక్షస[illegible]దాయము. ఆ చోటునేదేవి ఉంటుంది.

ము

7. "ఈకల్పకోద్యానం"

సహస్రారంలో ఉండేదేవియొక్కప్రతిబింబమే జీవస్వరూపము, దానియొక్క కాంతికిరణాలే శరీరమంతావ్యాపించి ఉన్నాయి. ఈకిరణాలకాంతులనే 'కల్పకోద్యానము' అంటారు,

8. "రసనయాభావ్యమానా మధురామ్లతిక్తకటుకషాయలవణరసాష్షడృతవః"

న్నాలుకకు రుచులు ఆరు. ఈఆరురుచులనే ఆరుఋతువులుగాభావించాలి. వాటివివరాలు ఈవిధంగా ఉంటాయి.

| రుచులు | ఋతువులు |
|---|---|
| 1. తీపి | వసంత ఋతువు |
| 2. ఉప్పు | గ్రీష్మ ఋతువు |
| 3. కారము | వర్ష ఋతువు |
| 4. పులుపు | శరదృతువు |
| 5. చేదు | హేమంత ఋతువు |
| 6. వగరు. | శిశిరఋతువు. |

ఈరకంగా ఇప్పటివరకు దేవీనివాసమైన మణిద్వీపము, సాధకునిదేహము ఒకటే అనిచెప్పబడింది. ఇకపరివారదేవతలవివరణ.

9. "క్రియాశక్తిపీఠంకుడలినీ,జ్ఞానశక్తిర్గృహ, ఇచ్ఛాశక్తిర్మహాత్రిపురసుందరీ"

మానవదేహము త్రిశక్తిమయము. అవి 1.ఇచ్ఛా 2. జ్ఞాన 3. క్రియాశక్తులు. ఈశక్తులవలననే పనులుజరుగుతాయి వీటిలోమొదటిదైన ఇచ్ఛాశక్తి ఆదే విశ్వరూపము. జ్ఞానశక్తి అనేది మందిరము. క్రియాశక్తి అనేదిపీఠము, ఏదైనాఒక పనిచేయాలనే ఆలోచన మెదడులో వస్తుంది. అదేఇచ్ఛాశక్తి లేకపరాశక్తి. ఇది అధారాది చక్రాలగుండా పశ్యంతి, మధ్యమా, వైఖరీరూపములుపొందుతుంది

10. "జ్ఞాతాహోతా జ్ఞానమర్ఘ్యం జ్ఞేయ హవిః
జ్ఞాతృజానజ్ఞేయోనామభేదభావనం శ్రీచక్రపూజనమ్"

ఇక్కడ మూడు పదాలు చెప్పబడ్డాయి. అవి

| | | |
|---|---|---|
| 1. జ్ఞాత | - | విషయపరిజ్ఞానముకలవాడు. సాధకుడు. |
| 2. జ్ఞానము | - | తెలుసుకొనవలసినది. |
| 3. జ్ఞేయము | - | తెలుసుకొనబడినది. |

ఈమూడింటిని 'త్రిపుటి' అంటారు. జ్ఞానము అభివృద్ధి చెందినప్పుడు మిగిలిన రెండూ అంటే జ్ఞాత, జ్ఞేయములు దాని యందు లీనమయిపోతాయి. అప్పుడు మిగిలేది జ్ఞానము ఒక్కటే. అదే పర బ్రహ్మానందము.

సాధకుడే అంతర్యాగానికి యజమాని. అతడే జ్ఞాత. అర్ఘ్యమే జ్ఞానము. జ్ఞాత,జ్ఞానము, జ్ఞేయాలను ఐక్యము చెయ్యటమే శ్రీచక్రపూజ, దేవి జ్ఞేయస్వరూపిణి, జ్ఞానము వలన

మాత్రమే తెలుసుకోతగినది దేవి. కాబట్టి త్రిపుటిని లయంచేయటమే శ్రీచక్రపూజ అయి బ్రహ్మానందాన్నిస్తుంది. దేవి జ్ఞానాజ్ఞేయ స్వరూపిణి. అనగా కేవలము జ్ఞానముచే తనే తెలుసు కోతగినది.

11. " నియతి సహిత శృంగారాదయో నవరసా అణిమాదయః "

ప్రథమా వరణ :-ఇక్కడ శ్రీచక్ర ఆవరణ దేవతలను వివరిస్తున్నారు. చక్రార్చన భూపురం నుంచి ప్రారంభించి బిందువుతో పూర్తి చెయ్యాలి. అందుకని ప్రథమావరణ అయిన భూపుర దేవతలను వివరిస్తున్నారు.

భూపురంలో మూడు రేఖలున్నాయి. వాటిలో మొదటి రేఖయందు అన్ని వైపులా అణిమాదిసిద్ధులున్నాయి. సాధకుని శరీరంలో నవరసాలున్నాయి. ఈనవరసాలే ప్రథమావరణలోని ప్రథమ రేఖలో ఉన్న దేవతలు. వాటి వివరాలు ఈవిధంగా ఉన్నాయి.

| సాధకుని శరీరంలోని నవరసాలు. | ప్రథమ రేఖలోని దేవతలు. |
|---|---|
| 1. శృంగారరసము | 1.అణిమాసిద్ధి |
| 2. హాస్యరసము | 2. లఘిమాసిద్ధి |
| 3. కరుణరసము | 3. గరిమాసిద్ధి |
| 4. రౌద్రరసము | 4. మహిమాసిద్ధి |
| 5. వీరరసము | 5. ఈశిత్వసిద్ధి |
| 6. భయానకరసము | 6. వశత్వసిద్ధి |
| 7. బీభత్స రసము | 7. ప్రాకామ్యసిద్ధి |
| 8. అద్భుతరసము | 8. ప్రాప్తిసిద్ధి |
| 9. శాంతరసము | 9.సర్వకామసిద్ధి |

12. " కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్య పుణ్యపాప మయా బ్రాహ్మ్యాద్యష్టశక్తయః'

భూపురంలోని రెండవ రేఖలో ఉన్న ఎనిమిది మంది దేవతలు, సాధకుని శరీరంలోని మనోవికారాలుగా చెప్పబడ్డాయి. వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| మనోవికారాలు | ద్వితీయ రేఖలోని దేవతలు |
|---|---|
| 1. కామము | బ్రాహ్మి |
| 2. క్రోధము | మహేశ్వరి |
| 3. లోభము | కౌమారి |
| 4. మోహము | వైష్ణవి |
| 5. మదము | వారాహి |
| 6. మాత్సర్యము | మాహేంద్రీ |
| 7. పుణ్యము | చాముండా |

| | |
|---|---|
| 8. పాపము | మహాలక్ష్మి |

13. " ఆధారనవకం ముద్రాశక్తయః"

సాధకుని శరీరంలో మూలాధారం నుండి ద్వాదశాంతము వరకు గల తొమ్మిది స్థానాలు భూపురంలోని తృతీయ రేఖలోగల తొమ్మిది ముద్రాశక్తులు వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| సాధకుని శరీరంలోని స్థానాలు | ముద్రాశక్తులు |
|---|---|
| 1. మూలాధారము | సర్వ సంక్షోభిణీశక్తి |
| 2. స్వాధిష్ఠానము | సర్వ విద్రావణీశక్తి |
| 3. మణిపూరము | సర్వాకర్షిణీశక్తి |
| 4. అనాహతము | సర్వవశంకరీశక్తి |
| 5. విశుద్ధచక్రము | సర్వోన్మాదినీశక్తి |
| 6. లంబికాగ్రము | సర్వమహాంకుశాశక్తి |
| 7. ఆజ్ఞాచక్రము | సర్వఖేచరీశక్తి |
| 8. సహస్రారము | సర్వబీజాశక్తి |
| 9. ద్వాదశాంతము | సర్వయోని శక్తి |

14. " పృథివ్యప్తేజోవాయ్వాకాశ శ్రోత్రత్వక్ చక్షుర్జిహ్వా ఘ్రాణవాక్పాది పాదపాయూపస్థ మనోవికారా షోడశక్తయః"

ద్వితీయావరణ :-శ్రీ చక్రంలో రెండవ ఆవరణ షోడశదళము దీనిలో పదహారు దళాలుంటాయి. వీటిలో పదహారు మంది ఆకర్షణ దేవతలుంటారు. వీరు పంచభూతాలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సుల యొక్క స్వరూపాలు. వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| పంచభూతాలు,ఇంద్రియాలు | ద్వితీయావరణలోని దేవతలు |
|---|---|
| 1. పృథి | కామాకర్షిణీదేవి |
| 2. జలము | బుద్ధ్యాకర్షిణీదేవి |
| 3. అగ్ని | అహంకారాకర్షిణీదేవి |
| 4. వాయువు | శబ్దాకర్షిణీదేవి |
| 5. ఆకాశము | స్పర్శాకర్షిణీదేవి |
| 6. కన్ను | రూపాకర్షిణీదేవి |
| 7. ముక్కు | రసాకర్షిణీదేవి |
| 8. చెవి | గంధాకర్షిణీదేవి |
| 9. నాలుక | చిత్తాకర్షిణీదేవి |
| 10. చర్మము | ధైర్యాకర్షిణీదేవి |

| | | |
|---|---|---|
| | 11. వాక్కు | స్మృత్యాకర్షిణీదేవి |
| | 12. పాణి (చేయి) | నామాకర్షిణీదేవి |
| | 13. ము(కాలు) | బీజాకర్షిణీదేవి |
| పాద | 14. ువు(గుదము) | ఆత్మాకర్షిణీదేవి |
| పాం | 15. స్థ(రహస్యాంగము) | మృతాకర్ ...వి |
| ఉప | 16. స్సు | ర్షిణీద శరీరాకర్షిణీదేవి |
| మన | | |

15." వచ... దానాగమన విసర్గానందహానో పాదానోపేక్షా బుద్ధ యోనంగ కుసుమా... యై
...శక ... ష్టౌ

తృతీయావరణ :- చక్రంలో తృతీయావరణ అష్టదళ పద్మము. ఇందులో ఎనిమిది శ్రీ దళాలుంటాయి. ఆ దళాలలో ఎనిమిది మంది దేవతలుంటారు. మానవదేహంలో ఉండే కర్మేంద్రియాలధర్మాలు, ప్రవృత్తి, నివృత్తి ఉపేక్ష అనేవే ఈ ఎనిమిది మంది దేవతలు. వాటి వివరాలు ఈ విధం ఉన్నాయి.

| గా ద్రిం | ఇం రు ధర్మాలు | తృతీయావరణదేవతలు |
|---|---|---|
| | 1. వచనము | అనంగకుసుమాదేవి |
| | 2. దానము | అనంగమేఖలాదేవి |
| | 3. నము | అనంగమదనాదేవి |
| గమ | 4. ర్గము(మలవిసర్జన) | అనంగమదనాతురాదేవి |
| విస | 5. భోగము | అనంగరేఖాదేవి |
| నం | 6. ప్రవృత్తి | అనంగ వేగినీదేవి |
| | 7. ృతి | అనంగాంకుశాదేవి |
| నివ | 8. ేక్ష | అనంగమాలినీదేవి |
| ఉపే | | |

16." ంబుసా, కుహూ,విశ్వోదరీ,వరుణా,హస్తిజిహ్వా,యశస్వతీ, అశ్వనీ,గాంధారీ,పూషా,శంఖినీ, సరస్వతీ, ఇడా, పింగళా,సుషుమ్నా,చేతి,చతుర్దశనాడ్యః, సర్వసంక్షోభిణ్యాది చతుర్దశ దేవతాః."

చతుర్థావరణ:- శ్రీ చక్రంలో నాలుగవ ఆవరణ చతుర్దశ కోణము. ఇందులో పద్నాలుగు కోణాలుంటాయి. అవి పద్నాలుగు లోకాలకు ప్రతీకలు, మానవ దేహంలోని పద్నాలుగు ముఖ్యమైన నాడులే ఈ ఆవరణలో ఉండే దేవతలు. వాటి వివరాలు
ఈ క్రింది విధంగా ఉన్నాయి.

| | దేహం నాడులు | చతుర్థావరణలోని దేవతలు |
|---|---|---|
| లోక | 1. ంబుసా | సర్వసంక్షోభిణీదేవి |
| అల | 2. హూ | సర్వవిద్రావిణీదేవి |
| కు | 3. విశ్వోదరీ | సర్వాకర్షిణీదేవి |

| | |
|---|---|
| 4. వరుణా | సర్వాహ్లాదినీదేవి |
| 5. హస్తిజిహ్వా | సర్వసమ్మోహినీదేవి |
| 6. యశస్వతీ | సర్వస్తంభినీదేవి |
| 7. అశ్వనీ | సర్వజృంభిణీదేవి |
| 8. గాంధారి | సర్వవశంకరీదేవి |
| 9. పూషా | సర్వరంజనీదేవి |
| 10. శంఖినీ | సర్వోన్మాదినీదేవి |
| 11. సరస్వతీ | సర్వార్థసాధికాదేవి |
| 12. ఇడి | సర్వసంపత్తిపూరిణీదేవి |
| 13. పింగళా | సర్వమంత్రమయీదేవి |
| 14. సుషుమ్నా | సర్వద్వంద్వక్షయంకరీదేవి |

17." ప్రాణాపాన,వ్యానో,దాన,సమాన,నాగ,కూర్మ,కృకర,దేవదత్త,ధనంజయా దశవాయవ స్సర్వసిద్ధిప్రదాది దేవ్యో బహిర్దశారదేవతా:"

పంచమావరణ:- శ్రీ చక్రంలోని ఐదవ ఆవరణ బహిర్దశారము. ఇక్కడ పదికోణాలున్నాయి. వాటిలో పదిమంది దేవతలున్నారు. సాధకుని శరీరం[illegible] వాయువులు,ఉపవాయువులే ఈ దేవతలు. వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| వాయువులపేర్లు | పంచమావరణలోని దేవతలు |
|---|---|
| 1. ప్రాణవాయువు | సర్వసిద్ధిప్రదాదేవి |
| 2. అపానవాయువు | సర్వసంపత్ప్రదాదేవి |
| 3. వ్యానవాయువు | సర్వప్రియంకరీదేవి |
| 4. ఉదానవాయువు | సర్వమంగళకారిణీదేవి |
| 5. సమానవాయువు | సర్వకామప్రదాదేవి |
| 6. నాగవాయువు | సర్వదుఃఖవి[illegible]చనీదేవి |
| 7. కూర్మవాయువు | సర్వమృత్యుప్రశమనీదేవి |
| 8. కృకరవాయువు | సర్వవిఘ్ననివారిణీదేవి |
| 9. దేవదత్తము | సర్వాంగసుందరీ[illegible]దేవి |
| 10. ధనుంజయము | సర్వసౌభాగ్యదాయనీదేవి |

18." ఏతద్వాయుదశక సంసర్గో పాధి భేదేన రేచకపూరక శోషక దాహక ప్లావకామృతమితి ప్రాణముఖ్యత్వేన పంచవిధోస్తి మనుష్యాణాం మోహకో దహఖో భక్ష్య భోజ్య లేహ్య చోష్య

పేయాత్మకం చతుర్విధమన్నం పాచయంత్యేతా: దశధనకలాసర్వజ్ఞత్వా ద్యంతర్దశారదేవతా:'

షష్ఠమావరణ :- శ్రీచక్రంలో ఆవర ఆవరణ అంతర్దశారము, దీనిలో కూడా పది కోణా లుంటాయి. ఈ కోణాలలో పదిమంది దేవతలున్నారు. సాధకుని శరీరంలోని ధశవిధవాయువుల వల్ల కలిగే గుణాలు, చతుర్విధాన్నములు పచనము చేయుశక్తులే ఈ దేవతలు. ఈ ఆవరణలోని పది దేవతలు. వాటి వివరాలు ఈ దిగువ ఇవ్వబడినాయి.

| దశవిధవాయువుల గుణములు | షష్ఠమావరణదేవతలు |
|---|---|
| 1. రేచకము(ఊపిరివిడచుట) | సర్వజ్ఞాదేవి |
| 2. పూరకము(ఊపిరి పూరించుట) | సర్వశక్తిదేవి |
| 3. శోషకము(శోషిల్లుట) | సర్వైశ్వర్యప్రదాయని |
| 4. దాహకము(దాహకగుణము) | సర్వజ్ఞానమయి |
| 5. ప్లావకము(ప్లావకగుణము) | సర్వవ్యాధినివారిణి |
| **వివిధఅన్నములు** | |
| 1. భక్ష్యము(తినదగినది) | సర్వాధారస్వరూపిణిదేవి |
| 2. భోజ్యము(భుజింపతగినది) | సర్వపాపహరాదేవి |
| 3. లేహ్యము(నాకిభుజింపతగినది) | సర్వానందమయిదేవి |
| 4. చోష్యము(పీల్చతగినది) | సర్వరక్షాసర్వరూపిణి |
| 5. పేయము(త్రాగతగినది) | సర్వేపినత్ఫలప్రదాదేవి |

19."శీతోష్ణ సుఖదు:ఖేచ్ఛా సత్వరజస్తమోగుణా వశిన్యాది శక్త యోష్టౌ"'

సప్తమావరణ :- శ్రీచక్రంలో ఏడవ ఆవరణ అష్టకోణము. దీని ఎనిమిది కోణాలలోనూ ఎనిమిది మంది దేవతలున్నారు. వారుకుడా సాధకుని శరీరంలో ఉండే లక్షణాలే వాటి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| సాధకునిశరీరంలో గల లక్షణాలు | సప్తమా[illegible]లోని దేవతలు |
|---|---|
| 1. శీతము | వ[illegible] |
| 2. ఉష్ణము | కామేశ్వరి |
| 3. సుఖము | మోదినీ |
| 4. దు:ఖము | విమలా |
| 5. ఇచ్ఛ | అరుణా |
| 6. సత్వగుణము | జయినీ |
| 7. రజోగుణము | సర్వేశ్వరి |
| 8. తమోగుణము | కౌళినీ |

20"శబ్ద స్పర్శ రూప రస గంధాః పంచతన్మాత్రా పంచపుష్పబాణాః"

**బాణాలుః-** దేవిచేతియందు పుష్ప బాణమున్నది. అది ఒక పూవుకాదు. ఐదుపుష్పాలు. అవే పంచతన్మాత్రలు పంచభూతాల ధర్మాలు వస్తువుయొక్క స్థూల స్వరూపమే గుణము. సూక్ష్మరూపముతన్మాత్ర బాణాలు మూడురకాలు

| | | |
|---|---|---|
| 1. స్థూలములు | - | పుష్పబాణాలు |
| 2. సూక్ష్మములు | - | బీజరూపాలు |
| 3. కారణములు | - | వాసనారూపాలు |

ఈ బాణాలపేర్లు ఒక్కొక్క చోట ఒక్కొక్క విధంగా ఉన్నాయి. 1. కాదిమతంలో

| | | |
|---|---|---|
| 1. కమలము | - | ఎర్రతామర |
| 2. రక్తకైరవము | - | తెల్లకలువ |
| 3. కల్హారము | - | కొంచెము ఎరుపు రంగుకల కలువ |
| 4. ఇందీవరము | - | నల్లకలువ |
| 5. సహకారము | - | మామిడిపూవు. |

దేవిచేతిలోని బాణాల వివరాలు ఇతర గ్రంధాలలో ఈ విధంగా ఉన్నాయి.

| కాలికాపురాణము | జ్ఞానార్ణవము | తంత్రరాజము |
|---|---|---|
| 1. హర్షణము | క్షోభణము | మదన |
| 2. శోచనము | ద్రావణము | ఉన్మాద |
| 3. మోహనము | ఆకర్షణము | మోహన |
| 4. శోషణము | వశ్యము | దీపన |
| 5. మారణము | ఉన్మాదము | శోషణ |

దేవి చేతిలో బాణాలు తన్మాత్రలు. అందుకనే దేవి 'పంచతన్మాత్రసాయకా' అని చెప్పబడింది.

21." మన ఇక్షుధనుః వశ్యోబాణః రాగఃపాశో ద్వేషోంకుశః"

**ధనుస్సుః-** దేవి చేతిలో ఉన్న ఆయుధములు సాధకునిలో గల రాగద్వేషాలు

| | | |
|---|---|---|
| చెరకువిల్లు | - | సాధకుని మనస్సు |
| బాణము | - | వశ్యత |
| పాశము | - | అనురాగము |
| అంకుశము | - | ద్వేషము |

22."అవ్యక్త మహత్తత్వాహంకారాః కామేశ్వరీ,వజ్రేశ్వరీ,భగమాలిన్యోంతస్త్రికోణాగ్రగాదేవతా" అష్టమావరణః- శ్రీ చక్రంలో ఎనిమిదవ ఆవరణ త్రికోణము. అక్కడ ముగ్గురు దేవతలున్నారు. వారు సాధకుని మనసులోని

1. అవ్యక్తము --- కామేశ్వరీ
2. మహత్తత్వము --- వజ్రేశ్వరీ
3. అహంకారము --- భగమాలినీ

వీరు స్వరూపిణులయినపార్వతి,లక్ష్మి, సరస్వతులు.

శక్తి 23. "ఁ ఁదశతిథి రూపేణ కాలస్య పరిమాణావలోకనం పంచదశనిత్యాః" అష్టమావరణః- చక్రంలో ఎనిమిదవ ఆవరణ అయిన త్రికోణంలో మూడు రేఖలున్నాయి. ఁలో రేఖకు ఐదుగురు చొప్పున పదిహేను మంది దేవతలున్నారు. వీరినే నిత్యాదేవతలంటారు. ఈ నిత్యలు తిధుల స్వరూపాలు. వీటివివరాలు ఈ క్రింద ఇవ్వబడినాయి.

| తిథులు | - | నిత్యాదేవతలు |
|---|---|---|
| 1. పాడ్యమి | - | కామేశ్వరీ |
| 2. విదియ | - | భగమాలినీ |
| 3 దియ | - | నిత్యక్లిన్నా |
| 4. ఏతి | - | భేరుండా |
| 5. పంచమి | - | వహ్నివాసినీ |
| 6. షష్ఠి | - | మహావజ్రేశ్వరీ |
| 7. సప్తమి | - | శివదూతీ |
| 8. స్తమి | - | త్వరితా |
| 9. నవమి | - | కులసుందరీ |
| 10. దశమి | - | నిత్యా |
| 11. ఏకాదశి | - | నీలపతాకా |
| 12. ద్వాదశి | - | విజయా |
| 13. యోదశి | - | సర్వమంగళా |
| 14. చతుర్దశి | - | జ్వాలామాలినీ |
| 15. పూర్ణిమ అమావాస్య | - | చిత్రా |

ఈ నిత్యల ధ్యానశ్లోకాలు,స్వరూపాలు నాచే వ్రాయబడిన 'శ్రీవిద్యాదర్పణము' లో ఇవ్వబడినాయి.నిత్యలు తిధుల స్వరూపాలు,తిధులు కళాస్వరూపాలు. వీటి వల్లనే

కాలచక్రం తిరుగుతున్నది.

24."శ్రద్ధానురూపాధీర్దేవతాతయో: కామేశ్వరీ సదానంద ఘనాపూర్ణా స్వాత్మైకరూపాదేవతా"

**నవమావరణః-** శ్రీచక్రంలో తొమ్మిదవ ఆవరణ బిందువు. ఇందున్న ప్రధానదేవతలు కామేశ్వరీ కామేశ్వరులు. ఇందులో సాధకుడి ఆత్మ యే కామేశ్వరి, బుద్ధి కామేశ్వరుడు. కాబట్టి సాధకుడి ఆత్మ, దేవి రెండూ ఒక్కటే. ఎప్పుడయితే తన ఆత్మ దేవి స్వరూపం అయిందో, అప్పుడు అతడు పరబ్రహ్మ అవుతాడు. దీనినే బ్రహ్మాత్మైక్యాను సంధానము అంటారు. ఇదే జీవన్ముక్తి.

25" సలిలమితి సౌహిత్యకరణగ్ం సత్త్వమ్"

ఇక్కడ నుంచి అంతర్యాగము వివరించ బడుతోంది. బాహ్యామైన వస్తువులన్నీ విషయ వాంఛలకు ప్రతీకలు. కాబట్టి వాటిని వదలి పెట్టెయ్యాలి. శరీరంలో ఉండే వస్తువులచేతనే పూజ జరగాలి. పూజకు ముఖ్యమైనది జలము. సాధకుని శరీరంలో సత్వరజస్త మోగుణాలున్నాయి. వీటిలో మొదటి దానిని పెంపొందించి, మిగిలిన రెండింటినీ తగ్గించాలి. సత్వగుణమే జలము.

26." కర్తవ్యమకర్తవ్య మౌదాసీన్యమితి వివేక భావనాయుక్త ఉపచార:"

**ఉపచారాలుః-** బాహ్యపూజలోదేవికి రాజోపచారాలు, దేవోపచారాలు, మంత్రోపచారాలు అని వివిధ రకాలైన ఉపచారాలున్నాయి. అయిన్పూజ అంత: లో ఉపచారము అంటే నిత్యము. కాని వాటిని వదలి వేయటము. బ్రహ్మపదార్థమే సత్యము కాబట్టి మిగిలినవి వదలివేయాలి.ఉదాసీనభావము తూష్ణీభావంగా రూపొందకూడదు. ఇదే అంత:పూజలో ప్రధానమైన ఉపచారము.

27." అస్తి నాస్తీతి కర్తవ్యతా అనుపచార:"

**అనుపచారాలుః-** బ్రహ్మము ఒక్కటే సత్యము, నిత్యము. అది కనిపించనంత మాత్రం చేత లేదు అనుకోరాదు. సర్వజీవరాశులయందు పరబ్రహ్మమున్నది. అంతేకాని బ్రహ్మము లేదనుకోవటము అపచారము తెలియని తనము. అపరాధము. ఇదే అనుపచారము చేయతగనిది.

28." బాహ్యాంతఃకరణానాం రూపగ్రహణ యోగ్యతాస్తి త్యావాహనమ్"

**ఆవాహన :-** దేహంలో బాహ్యేంద్రియాలు, అంతరింద్రియాలు ఉన్నాయి. ఆత్మ అనేది ఈ ఇంద్రియాలద్వారానే ప్రకాశిస్తోంది. కాబట్టి వాటి యొక్క దేవతారూపాన్ని ఆవాహన చెయ్యటమే దేవిని ఆవాహన చెయ్యటము.

29. "తస్య బాహ్యాంత:కరణానామేకరూప విషయ గ్రహణమాసనమ్"

**ఆసనముః-** శరీరంలో ఉన్న జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే పద్నాలుగు విభిన్నమైన ధర్మాలు కలిగిఉన్నాయి. ఆ ధర్మాలను అరికట్టి సర్వము బ్రహ్మపదార్థము అని భావించటమే ఆసన సమర్పణ.

30." రక్త శుక్ల పదైకీకరణం పాద్యమ్"

**పాద్యము :-** అంటే కాళ్ళు కడుక్కునేనీరు ఆ దేవి సాధకుడి శరీరంలోద్వాదశాంతంలో ఉన్నది. బ్రహ్మము (ప్రకాశ శక్తి) ఆత్మశక్తిలో ప్రవేశించి శుక్ల బిందువయింది. విమర్శశక్తి శుక్ల బిందువులో ప్రవేశించి రక్తబిందువయింది. ఈ రెండింటి కలయిక వలన మిశ్రమ బిందువు ఏర్పడింది. ఇప్పుడు

| | | |
|---|---|---|
| రక్తబిందువు | -- | చంద్రుడు |
| శుక్లబిందువు | -- | అగ్ని |
| మిశ్రమబిందువు | -- | సూర్యుడు |

మిశ్రమబిందువు నుంచినాదము,దాని నుంచి కళలు అవిర్భవిస్తాయి. ఇప్పుడు మిశ్రమ బిందుస్వరూపమైన కామేశ్వరీద్వందము యొక్క

కుడికాలు --- శుక్ల వర్ణమైన ప్రకాశాంశము

ఎడమకాలు --- రక్తవర్ణమైన విమర్శాంశము.

ఈ రెండు పాదాలనూ ధ్యానిస్తూ, వాటికి భేదములేదు అనుకోవటమే పాద్యము.

31." ఉజ్జ్వల దామోదానుసంధానమర్ఘ్యమ్"

**అర్ఘ్యము :-** అంటే చేతులు కడుక్కునేనీరు. శ్రమతీరటానికి ఇచ్చే అల్పాహారం అంటే త్రాగేందుకు ఇచ్చేనీరు. అంతఃపూజలో ఆత్మయే శ్రీదేవి అ ్రగ్రహించి ్హ్మానందాను సంధానము చెయ్యటమే అర్ఘ్యప్రదానము.

32." స్వచ్ఛంస్వతస్సిద్ధ మిత్యాచమనీయమ్"

**ఆచమనము :-** ఆచమనము అంటే మంత్ర పూర్వకంగా నోటిలోకి తీసుకునే నీరు. ఆత్మస్వరూపమైన దేవి స్వచ్ఛమైనది. అస్వచ్ఛత స్వయం సిద్ధమైనది అని గ్రహించట.

33." చిచ్చంద్రమయీ సర్వాంగస్రవణస్నానమ్"

**స్నానము :-** స్నానము బాహ్యపూజలో దేవతకు పంచామృత స్నానము చేయిస్తారు. కాని అంతఃపూజలో అదిలేదు. కుండలినీశక్తి ఆధారచక్రంలో నిద్రిస్తూ ఉంటుంది. సాధకుడు ప్రాణాయామంచేసి కుండలినీ శక్తిని గనక నిద్రలేపినట్లైతే, అది షట్చక్రాల గుండా ప్రయాణించి, గ్రంధి త్రయాన్ని భేదించి సహస్రారంచేరి తననోటితో సహస్రదళ పద్మాన్ని కరిచి పట్టుకుంటుంది. అప్పుడు సహస్రారము అనే చంద్రమండలం నుండి అమృతధారలు స్రవించి శరీరంలోని డెబ్భైరెండువేల నాడీ మండలాన్నీ తడుపుతాయి. ఈ రకంగా అమృతవర్షము కురిపించటమే ఆత్మదేవత (పరదేవత)కు స్నానము. ఈ రకంగా అమృతవర్షము వలన శరీరము సమశీతోష్ణమవుతుంది.

34." చిదగ్ని స్వరూప పరమానందశక్తిస్ఫురణం వస్త్రం"

**వస్త్రము :-** వస్త్రము అంటే శరీరాచ్ఛాదనకు ఉపయోగించేది. సాధకుని శరీరంలోని కాంతి అంతా ఆపరాశక్తి యొక్క తేజస్సే. ఈ విషయం తెలిసి బ్రహ్మానందము పొందుటమే వస్త్రప్రదానము.

35." ప్రత్యేకగ్ం సప్తవింశతిధా భిన్నత్వేనేచ్ఛాజ్ఞాన క్రియాత్మక బ్రహ్మ గ్రంథి మద్రసతంతు బ్రహ్మనాడీ బ్రహ్మసూత్రమ్"

**యజ్ఞోపవీతము:-**, దీన్నే బ్రహ్మసూత్రము అంటారు. జగత్తు అంతా బ్రహ్మమయమని సూత్రము కాబట్టి ఇది బ్రహ్మసూత్రము. దేహంలో ఉండేనాడులలో సుషుమ్నానాడి ముఖ్యమైనది. దీన్నే బ్రహ్మనాడి అంటారు. అంత: పూజలో ఈ సుషుమ్నానాడినే బ్రహ్మసూత్రముఅని భావించాలి.

గాయత్రీ మంత్రానికి ప్రతీక యజ్ఞోపవీతము. తొంబై ఆరు బెత్తలు ప్రమాణంకల సూత్రము (దారము) తయారు చేసి దాన్ని మూడుచుట్లు చుట్టాలి. ఇప్పుడు రెండు చివరలు కలిపి ముడివెయ్యాలి. ఇందులోని సూత్రములో మూడుపోగులుంటాయి. అంటే మొత్తం ఇరవై ఏడు పోగులుఉంటాయి.తొంబై ఆరు బెత్తలు ప్రమాణము-తత్త్వములు

| | | |
|---|---|---|
| మూడు ఆవృతులు | - | త్రిగుణములు |
| మూడు ముడులు | - | మూడుగ్రంథులు |
| మూడు గ్రంథులు | - | బ్రహ్మముడి |
| ఇరవైఏడు పోగులు | - | ఇరవై ఏడు భేదములు కల జగత్తు |

బ్రాహ్మణులు యజ్ఞోపవీతాన్ని ధరించి కర్మలుచేస్తారు. యజ్ఞోపవీతాన్ని తీసివేయటమంటే సన్యాసం స్వీకరించటము. అట్టి సన్యాసి బ్రహ్మకాండను చేసేవాడు. సర్వకర్మ విముక్తుడు జీవన్ముక్తుడు.

సుషుమ్నా నాడిలో సూక్ష్మనాడులు కలిసే చోటును గ్రంధిఅంటారు. అది ఇరవైఏడు సూక్ష్మనాడుల సమూహము. అందుకనే సుషుమ్నా నాడి యజ్ఞో పవీతము కంటె సత్యమైనది, సహజమైనది. ఇదేకంఠసూత్రము.

36. " స్వవ్యతిరిక్తవస్తు సంగరహిత స్మరణంవిభూషణమ్"

**ఆభరణాలు:-** దేవతకు కంఠసూత్రంతో పాటుగా వివిధ ఆభరణాలు సమర్పించాలి. సాధకుడు తాను కూడా పరబ్రహ్మస్వరూపమే అని, మాయా మోహంచేత తాను మనిషిగా ఉన్నానని గ్రహించి మాయాది వస్తువులతో తనకు సంబంధములేదు అని వాటిని పరిత్యజించటమే దేవికి ఆభరణములు అర్పించటము.

37." సత్సంగపరిపూర్ణతా మస్మరణంగంధ:"

**గంధము:-** దేహానికి గంధం రాసుకోవటంచేత సువాసన రావటమే కాకుండాపవిత్రత కూడా వస్తుంది. సాధకుడి సహస్రారంలో ఆపరాశక్తి ఉన్నదని, దానికాంతిచేత అతని శరీరము

తేజస్సుతో ప్రకాశిస్తుందని ముందేచెప్పటం జరిగింది. ఈ రకంగా జరగటం చేత సాధకుడు తాను ఎప్పుడూ పవిత్రుడనే అనే భావం కలిగి ఉంటాడు. ఇదే దేవికి శ్రీచందనసమర్పణ.

38." సమస్త విషయాణాం మనసః స్థైర్యేణా నుసంధానం కుసుమమ్"

పూజః- భగవంతుని భక్తుడు నానావిధపుష్పాలతో పూజిస్తాడు. ఇంద్రియవాంఛలకు లోనుగాకుండా, మనసును పరబ్రహ్మ ముందు లయం చేసి, సర్వము బ్రహ్మమయమని తెలుసు కోవటమే పుష్పపూజ.

" అహింసా ప్రథమ పుష్పం, పుష్పమింద్రియనిగ్రహః
దయాక్షయాజ్ఞానపుష్పం పంచపుష్పంతతఃపరం"

అహింస, ఇంద్రియనిగ్రహము, దయ,క్షమ,జ్ఞానము అనేవి పంచపుష్పాలు. సాధకుడు అరిషడ్వర్గాలు జయించి, అహంకారమనే పుష్పంతో దేవిని పూజించాలి. అంటే ఈ స్థితిలో నేను,అనే అహంకారాన్ని, నాది అనే భ్రాంతిని వదలివెయ్యాలి.

39." తేషామేవ సర్వదాస్వీకరణంధూపః"

ధూపంః సాధకుడు ఇంద్రియచాపల్యానికి లోనుగాకుండా, ఇంద్రియాలను తనస్వాధీనంలో ఉంచుకోవటమే ధూపము.

40." పవనావచ్ఛిన్నోర్ధ్వజ్వలన సచ్చిదుల్కాకాశదేహో దీపః"

దీపంః-. బ్రహ్మతేజస్సు వాయువు తోకలసి జ్వాలగా ప్రకాశిస్తుంది. అది విశ్వమంతా వ్యాపించిఉంది. సాధకుడి శరీరము పరబ్రహ్మము యొక్కకాంతి పుంజములతో ప్రకాశిస్తుంది. ఇప్పుడుసాధకుడు ఆకాశాన్నే తనశరీరంగా భావించి, తనశరీరంలో ఉన్న అపరాశక్తిని చిత్కలను దీపముగా భావించటమే దేవికి దీపసమర్పణ.

41." సమస్తయాతాయాత వర్జనం నైవేద్యమ్"

నైవేద్యముః పూజానంతరము నైవేద్యము చెయ్యాలి. ఇంద్రియచాంచల్యము లేకుండా అంటే ఇంద్రియాలను జయించి బ్రహ్మాకారవృత్తితో ఉండటమే నైవేద్యము. ఇది బ్రహ్మానందానుభవము.

42." అవస్థాత్రయైకీకరణం తాంబూలమ్"

తాంబూలముః ఆకు వక్క సున్నము కలిస్తే తాంబూలము అవుతుంది. అవే జాగ్రస్వప్న సుషుప్తి అనేమూడు అవస్థలు. ఆమూడు అవస్థలను తురీయావస్థ లో విలీనం చెయ్యటమే తాంబూల సమర్పణ.

43." మూలాధారాది బ్రహ్మబిల పర్యంతం, బ్రహ్మరంధ్రాదిమూలాధారపర్యంతం గతాగత రూపేణ ప్రాదక్షిణ్యమ్."

ప్రదక్షిణముః-. శరీరంలో ప్రాణవాయువు ఆధారచక్రం నుండి సహస్రారము వరకు, సహస్రారం నుంచి ఆధారచక్రం వరకు సుషుమ్నా మార్గంగుండా తిరుగుతూ ఉంటుంది. ఈ రకంగా ప్రాణవాయువు సంచారము చెయ్యటమే ఆత్మరూపంలో ఉన్న దేవతకు ప్రదక్షణము. దీనికే అజపారూప హంస అని పేరు.

హ కారనంజ్ఞగల పరమాత్మ నకార సంజ్ఞగల ప్రకృతితో కలసి హంసరూపమైన శబల బ్రహ్మము అవుతాడు. ఈ శబలబ్రహ్మము తొమ్మిది ద్వారాలు గల మానవశరీరము అనే పట్టణంలో ప్రవేశించి ఇంద్రియములు, ప్రాణములు, మనస్సుతో కూడిన వాడై పంజరంలో బంధించబడిన పక్షిలాగా బయటకు వచ్చే ఉపాయం తెలియక ప్రాపంచిక బంధనాలతో కొట్టుమిట్టాడు తున్నాడు. అంటువంటి హంస అనబడే జీవుడికి

| | | |
|---|---|---|
| అగ్ని, చంద్ర మండలాలు | - | రెక్కలు |
| ఓంకారము | - | శిరస్సు |
| జ్ఞాననేత్రము | - | ముఖము |
| హకారనకారములు | | పాదాలు |
| (హకారము రుద్ర బీజము | | |
| సకారము శక్తి బీజము) | - | |

ఈ రకంగా ఉన్న హంస అనే జీవుడు పాలలో ఉన్న నెయ్యి లాగా సమస్త ప్రాణికోటినీ ఆశ్రయించి ఉన్నాడు.

సహస్రారము అనేది ఎనిమిది దళాలు కలిగిన పద్మము. ఇందులోని ఒక్కొక్క దళంలోనూ చిన్నచిన్న రేకులు నూట ఇరవై అయిదు చొప్పున ఉంటాయి. ఈ రకంగా మొత్తం వెయ్యి దళాలుంటాయి. అందుకే దాన్ని సహస్రదళకమలం అంటారు. ఎనిమిది దళాలు ఎనిమిది దిక్కులకు తిరిగి ఉంటాయి.

ఎనిమిది దళాల వివరాలు ఈ విధంగా ఉంటాయి.

| | | |
|---|---|---|
| తూర్పుదిక్కు | - | సద్బుద్ధి |
| ఆగ్నేయం | - | నిద్ర,దప్పిక, ఆలస్యము |
| దక్షిణము | - | క్రూరబుద్ధి |
| నైరుతి | - | పాపబుద్ధి |
| పడమర | - | విలాసము |
| వాయువ్యము | - | నడచుట మొ॥విషయములందుబుద్ధి |
| ఉత్తరము | - | సురతము నందు ఆసక్తి |
| ఈ శాన్యము | - | ద్రవ్యము దానంచేసే తలంపు |
| పద్మాంతరాళంలో | - | ఇహపరలోకవిముక్తి |
| కింజల్కము | | |
| (తామరపువ్వులోని | | |
| కేసరములు) | - | మెలకువ |
| తామరదుద్దు | - | కల |
| దుంప | - | నిద్ర |

ఆత్మ ఏక్షణానైతే సహస్రారాన్ని వదులు తుందో ఆక్షణలోనే పరబ్రహ్మలో ఐక్యమవుతుంది. దీనికే తురీయావస్థ అ ంరు.

44." తురీయావస్థా నమస్కార:"

**నమస్కారము:-** దేవికి నమస్కారము చెయ్యట మంటే సాధకుడు తురీయావస్థ చేరటమే

45." దేహశూన్య ప్రమాతృతా నిమజ్జనం బలిహరణమ్"

**బలిహారణము:-** సాధకుడి స్థూలశరీరము మాయతోకూడుకున్నది. సూక్ష్మశరీరము జ్ఞానస్వరూపము తాను జ్ఞానస్వరూపుడు కాబట్టి జీవాత్మను పరమాత్మ యందు విలీనం చేసినట్లు భావించటమే బలిసమర్పణ.

46." సత్యమస్తికర్తవ్య మకర్తవ్య మౌదాసీన్య నిత్యాత్మ విలాపనగ్ంహోమ:"

**హోమము :-** పూజ, జపము అయిన తరువాత హోమము చేయటం విధి. సాధకుడి అహంభావము, జీవభావము, పరబ్రహ్మస్వరూపం ఉంది, లేదు అద్వైతభా ము మొదలైనవన్నీ పరబ్రహ్మ అగ్నిమనే లో విలీనము అనే ఆహుతి చేవయటమే హోమము.

47." స్వయం తత్పాదుకా నిమజ్జనం పరిపూర్ణధ్యానమ్"

**ధ్యానము:-** సాధకుడు తాను అదేవి యొక్క పాదముల నుండి వచ్చే తేజస్సులో విలీనమయి నట్లుగా తలచి, తానుకుడా అతేజస్సులో ఒక భాగమేనని, సర్వము పరబ్రహ్మమయని భావించటమే పరిపూర్ణ ధ్యానము.

48." ఏవం ముహూర్తత్రయం భావనయా యుక్తో భవతి, తస్య దేవతాత్మైక్యసిద్ధి:

"**బ్రహ్మత్వసిద్ధి.:-**ఈ విధంగా తననుతాను పరబ్రహ్మస్వరూపంగా భావించి మూడు ముహూర్తముల కాలము దేవియందు మనసును లగ్నం చేసినవాడు అ దేవితో ఐక్యత పొందుతాడు. దీనినే బ్రహ్మత్వం సిద్ధించటం అంటారు.

49." చించితకార్యాణ్యయత్నేన సిధ్యంతి స ఏవ శివయోగీతి కథ్యత ఇత్యుపనిషత్"॥

**ఫలము:-** ఈ విధంగా అంత: పూజచేసి సిద్ధుడైన సాధకుడికి కోరిన కోరికలు అప్రయత్నంగా నెరవేరతాయి. అతడినే శివయోగి అంటారు అని ఈ ఉపనిషత్తులో చెప్పబడింది.



# 14. సాదాఖ్యకళ

నిత్యలు మొత్తం 16 ఈ షోడశ నిత్యలను గురించి వసిష్ఠ సంహితలో చెప్పటం జరిగింది.

శృణుదేవి ప్రవక్ష్యామి నిత్యాషోడశకం తవ।
న కన్య చిన్మయా Z Z ఖ్యాతం సర్వతంత్రేషు గోపితమ్॥

తత్రాదౌ ప్రథమానిత్యా మహాత్రిపురసుందరీ ।
తతః కామేశ్వరీ నిత్యా నిత్యాచ భగమాలినీ॥

నిత్యక్లిన్నా తథాచైవ భేరుండా వహ్నివాసినీ ।
మహావిద్యేశ్వరీ (వజ్రేశ్వరీ) రౌద్రీ, త్వరితా కులసుందరీ॥

నిత్యా నీలపతాకాచ విజయా సర్వమంగళా ।
జ్వాలామాలినీ చిద్రూపా ఏతానిత్యాస్తు షోడశ॥

ప్రతిపత్ప్రభృతౌ దేవ్యాః పౌర్ణమాస్యంతమర్చయేత్
ఏకాదివృద్ధ్యా హాన్యాచ,దర్శాంతం దేవి విగ్రహమ్॥

1. మహాత్రిపుర సుందరి
2. కామేశ్వరి,
3. భగమాలిని,
4. నిత్యక్లిన్న,
5. భేరుండ,
6. వహ్నివాసిని.
7. మహావిద్యేశ్వరి.
8. రౌద్రీ
9. త్వరిత
10. కులసుందరి
11. నిత్యా,
12. నీలపతాక
13. విజయ
14. సర్వమంగళ
15. జ్వాలామాలిని
16. ౹ చిద్రూప

లనే ఈ పదహారు నిత్యలు. షోడశ నిత్యలు శుక్ల పక్ష పాడ్యమి మొదలు పౌర్ణమి వరకు గల తిథుల రూపమున, కృష్ణ పక్ష పాడ్యమి మొదలు అమావాస్య వరకు గల తిథుల రూపమున ఉన్నారు. వీరికే చంద్రకళలు అని పేరు. చంద్రకళలే పాడ్యమి మొదలయిన తిథులు అని జ్యోతి శ్శాస్త్రంలో చెప్పబడింది.

ప్రతిపన్నామ విజ్ఞేయా చంద్రస్య ప్రథమా కలా
ద్వితీయాద్యా ద్వితీయాద్యాః పక్షౌ శుక్ల కృష్ణ [illegible] యో : ॥

పాడ్యమి నుండి పౌర్ణమి వరకు 15, అమావస్య మొత్తం పదహారు తిధులు సుభగోదయం లో చెప్పినట్లుగా

దర్శాద్యాః పూర్ణిమాం తాశ్చ కలాః పంచ దశైవ తు ।
షోడశీతు కలాజ్ఞేయా సచ్చిదానంద రూపిణీ ॥

అమావాస్య మొదలు పూర్ణిమ వరకు గల కళలు 15 16వ కలషోడశి. సచ్చిదానంద స్వరూపిణి అయి ఉన్నది.

ఇదే సాదాఖ్య కళ నా దు కళాతీత మైనది. భగవతి మాతృకావర్ణ రూపిణి. అంటే ఆ దేవి 50 అక్షరముల స్వరూపమై ఉన్నది. అక్షరాలు మొత్తం అ,క,చ,ట,త,ప,య,శ అను ఎనిమిది వర్ణులుగా ఉన్నాయి. ఇవి వశిన్యాది శక్తులతో కలిసి శ్రీ క్షంలోని , శక్తి చక్రాలతో ఐక్యముపొందుతున్నాయి. వశిన్యాది శక్తులు అంటే

1. వశిని,
2. కామేశ్వరి,
3. మోదిని.
4. విమల
5. అరుణ
6. జయిని
7. సర్వేశ్వరి.
8. కౌళిని.

పంచదశి మహామంత్రంలో మొదట క కారము చెప్పటం వల్ల, ఆ తరువాత ఉన్న అక్షరాలన్నీ తీసుకోబదుతున్నాయని గ్రహించాలి. అలాగే ఏ కారము చెప్పటం వల్ల ఆ వర్ణులోని అక్షరాలన్నీ తీసుకోబదుతున్నాయి. అనగా మొత్తం మీద అచ్చులు, హల్లులు అన్నీ తీసుకోబడినాయని సిద్ధాంతము. అలాగే మంత్రంలోని మొదటి అక్షరము క చివరి అక్షరము ల కాబట్టి ఈ రెండింటి కీ మధ్య ఉన్న అక్షరాలన్నీ గ్రహించబడినాయి. క కారము నుంచి ల కారము వరకు గల అక్షరములను 'కళ' అనటం గౌణార్ధ ప్రయోగముగా చెప్పబదుతోంది.

సంస్కృత భాషకు ఉన్న 50 అక్షరాలను మూడు భాగాలుగా చేశారు.

| | |
|---|---|
| 1. అ నుంచి అః వరకు | 16 అక్షరములు ఒక భాగము |
| 2. క నుంచి త వరకు | 16 అక్షరములు ఒక భాగము |
| 3. థ నుంచి స వరకు | 16 అక్షరములు ఒక భాగము |

ఈ మూడు భాగాలకు మూడు ఖండాలు అని నామకరణం చేశారు. ఇవి షోడశనిత్యలతో అంతస్థానం పొం తున్నాయి. హకారము బైందవస్థానమందు, ళ కారము బిందువునంది క్షకారము క,షల యొక్క మిశ్రమము కాబట్టి సర్వత్ర చెప్పబదుతోంది.బైందవ స్థానానికి శ్రీచక్రము అని, సరఘ అనీపేరు. సహస్రారంలో ఉన్న చంద్రమండలమే సరఘ అని పిలవబదుతోంది. ఇదే 16 వ కళ అయిన సాదాఖ్య కళ, చిద్రూప అయి ఉన్నది. ఈ విషయాన్ని గౌడ పాదుల వారు తమ సభగోదమస్తుతిలో

ఇమాస్త్రా: షోడశ్యాస్త్రవసుచ పరఘాయాం శశికళా
స్వరూపాయాం, లీనా వివసతి తవశ్రీ శశికళా ।
అయం ప్రత్యాహార: శ్రుత ఇహ కళా వ్యంజనగణ:
కకారేణాకార: స్వరగణ మశేషం కథయతి॥

కౌళ, సమయమతాలు పూర్తిగా తెలిసిన విజ్ఞులు, కౌళమతస్థులు వివేక శూన్యులని, పామరులని అంటారు. పండితులందరూ సహస్రారంలో శివాశివుల రూపంలో ఉన్న 16వ నిత్యనే ఆరాధిస్తారు. సుధాసింధువు మధ్యన ఉన్న ఆకళయే చంద్రకళ, సాదాఖ్యకళ. ఆమెయే భగవతి.

అతస్తే కౌలాస్తే భగవతి దృఢ ప్రాకృత జనా
ఇతిప్రాహు: ప్రాజ్ఞా: కులసమయ మార్గద్వయవిధ:
మహాంత: సేవంతే సకలజననీం బైందవగృహే
శివాకారాం నిత్యామమృత ఝరికా మైందవకళామ్

సహస్రారంలో గల చంద్రమండలమే శ్రీచక్రము. ఇది షోడశకళాత్మకము సహస్రదళకమలంలో శ్రీ చక్ర స్వరూపమైన చంద్రబింబానికి మధ్య ఆ దేవి ఉంటుంది. అందుకనే లలితా సహస్రంలో దేవి చంద్రమండలమధ్యగా అని చెప్పబడింది. ఆమె పాదోదకము అమృతమయము. అది శరీరంలోని 72 000 నాడీ మండలాన్నీ తడుపుతున్నది.

శిరస్సు నందు చంద్రమండలమున్నదని యోగశాస్త్రాలన్నీ చెబుతున్నాయి. దీన్నే శ్రీచక్రం అంటారు. చంద్రమండలం 16 కళలతో కూడినదవటంచేత, శ్రీ విద్యలో పాడ్యమి మొదలయిన తిథుల వృద్ధిక్షయాలను చెప్పటంచేత, శ్రీవిద్యయే చంద్రమండలమవుతున్నది. ఇది సమయమత రహస్యము.

సమయములకు షట్చక్రపూజ నియతంకాదు. వారికి సహస్ర కమలమందే పూజ. అంటే సహస్రకమలము బైందవ స్థానంగాను దాని మధ్యలో ఉన్న చంద్రమండలము చతుష్కోణము గాను, దాని మధ్యలో ఉన్న బిందువు 25 తత్త్వములకు అతీతమైన 26వ తత్త్వము, శివశక్తుల మేళన రూపమయిన సాదాఖ్య కళ అని చెప్పటం జరిగింది. అందుకనే సమయ మతంలో బాహ్యపూజలేదు.చతుర్విధైక్య సంధానము లేదా షడ్విధైక్య సంధానమే భగవతికి సపర్య. ఈ సపర్యకు స్వాధ్యాన్మైత్ర కనిష్ఠ కావాలి. సాదాఖ్య అని పిలువబడేది సహస్రారంలో ఉండే చంద్రకళ.

శ్రీ చక్రరూపమైన చంద్రబింబంలో ఒకే కళ ఉన్నది. అది పరమాకళ. ఆజ్ఞాచక్రంలో ఉన్న చంద్రుడికి 15 కళలున్నాయి. 16వది పరమాకళ, చిద్రూప. ఆజ్ఞాచక్రంలో ఉన్న చంద్రుని కన్న భిన్నమైన చంద్రుడు ంలో స్రార ్దు. ఉన్న ఇదే బైందవస్థానము, సుధాసింధువు,

సరస్సు[illegible]ని పిలవబ[illegible] [illegible]ంది. కాబట్టి సమయమతస్థులు సహస్రపద్మదళంలోనే దే[illegible] పూజించాలి. ఇక్కడ ఉన్నబిందు[illegible] [illegible]వశక్తులు రూపమైన సాదాఖ్య అను 26వ తత్త్వము.అదే పరబ్రహ్మమహిషి [illegible] ఆజ్ఞాచక్ర[illegible] చంద్రకళలు ఉండేస్థానం. సహస్రారం చంద్రమండలము ఇక్కడ ఉండే చంద్రుడు నిత్యకళాయుక్తుడు. అదే శ్రీచక్రము నాలుగు ద్వారాలు, మూడు భూపురాల[illegible] శ్రీచ[illegible] బ్రహ్మ[illegible] పైన ఉన్నది. శ్రీచక్రము యొక్క నాలుగు ద్వారాలలోనూ మాయ, శుద్ధ విద్య, మహేశ్వరుడు, సదాశివుడు అనే నాలుగు తత్త్వాలుంటాయి. వీటినే భగవతి విశ్రమించే మం[illegible]కి నాలుగు [illegible]ళ్ళు అంటారు. నాలుగు ద్వారాలు కలిగి కర్ణికారూపంలో ఉన్న శ్రీచక్రంలోని చతు[illegible]ణము మధ్య గల బిందువునే సర[illegible]అంటారు [illegible] శివశక్తుల సంగమస్థానం.

[illegible] సాధకుడు [illegible]ండలినీ శక్తిని సహస్రారం చేర్చగలిగినట్లైతే నాలుగుద్వా[illegible]ంతో కూడిన శ్రీచ[illegible]లోనికి ప్రవే[illegible] నట్లే అప్పుడు దేవి సాక్షాత్కారం అవుతుంది.

శ్రీ[illegible] చక్రస్యచత్వారిద్వారాణి చతుర్వేదరూపిణి
ద్వా[illegible] [illegible]రప్రవేశనైవభవతి పరదేవతా సాక్షాత్కారః

శ్రీచక్రం యొక్క నాలుగు ద్వారాలు నాలుగు వేదా[illegible] ప్రతీకలు. [illegible] ద్వారాలలో గనక ప్రవేశించినట్లైతే దేవిసాక్షాత్కారం కలుగుతుంది.

హరితస గోత్రీకుడు, శ్రీమతి క్రోవిసత్య పర్వతవర్ధనమ్మ, శ్రీకృష్ణప్రకాశరావుగారల జే[illegible]పుత్రుడు,
విజయవాద శాతవాహన కళాశాల అధ్యాపకుడు అయిన

**క్రోవిపార్థసారథి**

సర్వజనామోదము పొందునట్లుగా

సులభశైలిలో వ్రాసిన 'శ్రీవిద్యారహస్యము' సమాప్తము

**ఓంతత్సత్**

